శ్రీ

శ్రీమదిష్టదేవతాయైనమః

# శ్రీ శివమహా భక్తవిజయము.



మొదటిభాగము.

గ్రంథకర్త:

బెల్లముకొండ నరసింహాచార్యులు.


మొదటి కూర్పు 1000 ప్రతులు

...గారి ప్రిమియర్ ముద్రాక్షరశాలయందు

...బడియె, శికింద్రాబాద్.

1934




(నాలుగుభాగములుచేర్చి) వెల 4-0-0

శ్రీమదిష్టదేవతాయైనమః



# శ్రీ శివమహాభక్తవిజయము.

మొదటిభాగము.

గ్రంథకర్త:

బెల్లముకొండ నరసింహాచార్యులు.

మొదటి కూర్పు 1000 ప్రతులు

కొండా వీరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షర
శాలయందు ముద్రింపబడియె,
శికిందరాబాదు.

1934.

(నాలుగుభాగములుచేర్చి) వెల 4-0-0

## ప్రకటన.

ఈగ్రంథమును గ్రంథకర్తగారి యనుమతిని బొందనిది యెవరైన ప్రక టించినయెడల దావాకు పాత్రులై నష్టము నిచ్చుటకు బాధ్యులగుదురు.

ఈ గ్రంథములు దొరకుస్థలములు.

---

బెల్లంకొండ నరసింహాచార్య్వులు

మక్తా వడ్డేపల్లి,

హనుమకొండ పోష్టు.

కొండూరు నరసింహాచార్యులుగారు

కిషన్ గంజ్,

హైదరాబాదు.

బచ్చు వేంకటేశ్వరగుప్త వకీల్ గారు

సదాశివునిపేట.

## ముఖ్యాభిమానులు.

మ॥ రా॥ పర్మారెడ్డిగారు శంకేపల్లి

రాజపోషకులు.

మ॥ రా॥ ఎల్లారెడ్డిగారు గొల్లగూడ

,, ,, కృష్ణారెడ్డిగారు నారగూడ.

,, ,, రాంరెడ్డిగారు అంతప్పగూడ.

# పీఠిక.

---

అఖండ సచ్చిదానంద స్వరూపుండైన పరమేశ్వరుని లీలాప్రపంచ రంగమున ప్రధానపాత్రములై ప్రవేశించి నాట్యము సల్పు చేతనులు తెంపులేని యచిత్సంబంధముచే నజ్ఞానతమంబావరించ ప్రకృతి విలక్షణంబైన తమ నిజస్వరూపము నెఱుంగలేక ప్రకృతి సిద్ధంబై నానావికారముల కాస్పదంబై క్షణనశ్వరంబైన దృశ్యమాన దేహంబును తానయని దృఢీకరించికొని తజ్జన్యంబులైన యహంకార మమకారములకు లోబడ

(ఇదమద్యమయాలబ్ధ మిమంప్రాప్స్యే మనోరథం
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనం
అసౌమయాహతశ్శత్రుర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోహమహంభోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ
ఆఢ్యోభిజనవానస్మి కోన్యోస్తి సదృశోమయా
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః
అనేకచిత్త విభ్రాంతాః మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతినరకేశుచౌ॥

అనగా నిది నాచేఁ బొందబడినది. ఇఁకనీకోరికను బొందఁగలను కష్టించి నేనార్జించిన వస్తువు నేటికింతఁ గలదు. ఇంకను ధనము మిగులఁ గలుగఁగలదు. నేను మహాశూరుడనగుటచే నీతఁడు నాచేఁజచ్చెను. మరియు నెందఱినో చంపఁగలను నేను సర్వమునకు ప్రభువును, మహాభోగవంతుడను, ఇష్టసిద్ధిఁ గలవాఁడను, బలవంతుఁడను, సుఖశాలిని, ఆఢ్యుఁడను, బలము గలవాఁడను, కావున నాతో సమానుఁడగువాఁడీ భూమియందెవ్వఁడును లేడు నిరంకుశముగా నెన్నికార్యములనో జేయుదును. ఇష్టపూర్తిగ దానముజేయఁగలను కాంతాది వస్తు సముదాయముచే వినోదించఁగలను. అని యిట్టి యజ్ఞానభావములును చిత్తవిభ్రాంతులును గలిగి మోహసముదాయముచే నావరింపఁబడి యింద్రియ పరాయణులై కేవల గ్రామ్య సుఖముల కిచ్ఛయించుచు మహానరకంబులంగూలి క్లేశభాజనులగుచున్నారు.

ఇట్టివారినిపరమకారుణికుండును నిర్హేతుక కృపగల్గువాఁడునగు సర్వేశ్వరుఁడు చూచి మిగుల వగచి వానినేదో రూపముగ రక్షించ నెంచుచుండును. ఆరక్షణము నొందుటకై విస్తార ప్రపంచములోఁ బ్రయత్నము నొందు మానవుఁడు

[సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే నృణాం మోక్షేచ్ఛాజాయతే తదాసద్గురుమాశ్రిత్య చిరకాలసేవనయా బంధాన్మోక్షం కశ్చిత్ప్రయాతి॥

అనగా ననేక జన్మకృత కర్మపరిపాకమువలన ననేక జన్మములు గడచినపిదప

మానవులకు మోక్షమం దిచ్చగలిఁగి సద్గురువు నాశ్రయించి ఆగురుసేవనమువలన నొకానొకఁడు సంసారమునుండి తరించి మోక్షము నొందగలఁడు. అనునట్లు కోటి కొక్కఁడైనా గలఁడనుట దుర్లభము. పరమేశ్వరుఁడు మానవులు జీవయాత్రను సుఖముగ గడపి తన్ను బొందుకొఱకై యనేక మార్గములను జూపించెను. వానికిఁ దోడుశ్రుతిస్మృతీతిహాస పురాణాగమాదులను మహాత్ముల ముఖముగా జూపించెను. అందుఁ బ్రవృత్తి మార్గము నివృత్తి మార్గమును నవి రెండుమార్గములు ముఖ్యములు యజ్ఞయాగాదులవలన ఫలములను గోరు ప్రవృత్తిమార్గమును భక్తిజ్ఞాన వైరాగ్యముల నపేక్షించు వారు నివృత్తిమార్గమును నవలంబించి తదనుష్ఠానములం గావించుచుఁ దత్తత్ఫలముల నొందుచున్నారు. అందునివృత్తి మార్గమును గోరువారికే మోక్షము సులభమని పెద్దల యభిప్రాయము కర్మవాదులు కర్మలవలననే జ్ఞానమం కురించి దాన మోక్షము గలిగించునని చెప్పుదురు. కాని యది కష్టసాధ్యము సర్వ జన సామాన్యముగాదు అట్లగుటచే ప్రవాహ రూపమైన ప్రపంచమున గొంతకాల మునకు కర్మమార్గమునకును జ్ఞానమార్గమును భేదమంకురించి కేవల కర్మలు పరి హాసాస్పదము లయ్యెను. కార్మికులకును వేదాంతులకును పరస్పర భేదదృష్టి కలిగినది కర్మవాదులు కర్మయే మోక్షహేతువని వాదించుచుండిరిగాని అది సర్వ మానవ సాధారణముగాక కర్మాధికారులుగాని ప్రజలు జీవయాత్రను సుఖముగ గడుపుటకు గష్టము సంభవించెను. అట్టి దశయందు బుద్ధుడు మొదలగువారు జన్మించి కర్మవాదులగు బ్రాహ్మణుల ప్రాధమికత్వమును నిరోధించి లోకులయందొక నూతన మార్గమును ప్రతిష్ఠించిరి. ఆమార్గము నవలంబించిన మానవులకు బుద్ధుని ప్రబోధములు చాలవరకు సుఖదాయకములై యుండెను అందు భూతదయ సర్వమానవ సమత్వము జాతిమతకులభేద రహితత్వము మున్నగు ధర్మ ములు సిద్ధాంతీకరింపబడినవి. కొలది భేదములతో ప్రబలిన జైనబౌద్ధమతము లీప త్కాలములోననే ప్రపంచమునంతయును వ్యాపించి వేయిసంవత్సరములవరకు నిష్కలంకము నిరాటంకముగా ప్రబలినవి ప్రతిదేశమందును ప్రతిఖండమునందును జైనబౌద్ధులే వారిస్తూపములే విహారములే మఠములే మందిరములే అయి వెలసినవి. అనేకులు బోధకులుగ బయలుఁదేరి తమమతమునకు గళలను రెట్టింపు జేయుచుండిరి అందీశ్వరపూజలేమిచే గాలము మాఱినకొలది క్షీణించుటకు హేతువయ్యెను. అప్పుడాది శంకరులవారవతరించి జైనబౌద్ధాది దుర్మతంబులను చాలావరకు ఖండిం చిరి. శైవవైష్ణవాది షణ్మతంబుల నామోదించుచు నిష్కామకర్మసిద్ధాంతమును పున ర్జన్మ సిద్ధాంతమును జీవేశ్వరాభేద సిద్ధాంతమును గావించి (సర్వం ఖల్విదంబ్రహ్మ తత్వమసి ఇత్యాది మహాప్రమాణంబుల నద్వైతమును స్థాపించి వైదికమతమును పునరుద్ధరించిరి. వారును కర్మవాదులుగారు గావున మండన మిశ్రాదులం జయించి జ్ఞానభక్తిమార్గములనే మిక్కిలి ప్రచారము గావించిరి బ్రహ్మసూత్రములకును

ఉపనిషత్తులకును భాష్యమును వ్రాసి బ్రహ్మసత్యము జగత్తుమిథ్యయను ముఖ్య సూత్రమును ప్రజలలో నంకురింపజేసిరి తిరిగి జాతిమత కులభేదము లేర్పడి ప్రపంచము శాంతినొందినది కాని ప్రజాసామాన్యమునందు కర్మానధికారము అద్వైత జ్ఞాన మగమ్యమగుటచే తరణోపాయములేక జనులు చీకాకు నొందవలసిన దశ గల్గెను. ఆయవసరమందు శ్రీరామానుజ యోగీంద్రు లవతరించి జీవున కీశ్వరునకుగల భేదమును జీవుడు నీశ్వరునం దేవిధముగ నడచి తరించు నుపాయమును భక్తిప్రపత్తి జ్ఞానానుష్ఠానములే భగవత్ప్రాప్తికి గారణములని బోధించి ప్రజలయందలి యాందోళను బోగొట్టెను. అనంతరము బసవేశ్వరుడు నందియంశమున భువినవతరించి ప్రజలయందు శివభక్తి జ్ఞానవైరాగ్యముల నంకురింపజేసి బ్రాహ్మణాది శ్వపచుల పర్యంతము నుద్ధరించి ప్రపంచమంతయును భక్తిసముద్రమున మునుంగునట్లు జేసెను.

## భక్తిమార్గము

మానవుడు తరించుకొరకు భక్తియే ముఖ్యమార్గమని సూచింపబడియెను.

యేతుసర్వాణికర్మాణి మయిసన్యస్యమత్పరాః
అనన్యేనైవయోగేన మాంధ్యాయంత ఉపాసతే
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామినచిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్
యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతేచయః
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్సచమేప్రియః
అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యోమద్భక్తస్సమేప్రియః

ఎవరైతే సర్వకర్మలను నాయర్పణము గావించి నాయందాసక్తులై అనన్యమైన భక్తియోగముచే నన్నుధ్యానించుచు నుపాసించుచున్నారో వారిని నేను మృత్యుస్వరూపమైన సంసార సముద్రమునుండి యుద్ధరించుచున్నాను.

ఎవనివలన లోకము క్షోభనొందదో యెవడు లోకముచే క్షోభనొందడో యెవడు సంతోషకోపభయోద్వేగములచేతవిముక్తుండగునో వాడేనాకుప్రియుడు.

ఏవస్తువునందు నపేక్షలేనివాడై పరిశుద్ధుడై దక్షుడై ఉదాసీనుడై వెతలు లేనివాడై సర్వకర్మ వర్జితుడైనవాడే నాభక్తుడు ప్రియుడు.

అనుగీతా సూత్రము ననుసరించి భక్తిమార్గము ప్రబలమయ్యెను. అది కర్మజ్ఞాన మార్గములకును సగుణ నిర్గుణ బ్రహ్మోపాసనలకు దటస్థమైయున్నది ఆభక్తి ద్వైతాద్వైతములు రెండు నామోదించినవి దాన మానవజీవితము సంకటములనుండి దొరలి నిత్యనిర్మల సదానంద పరబ్రహ్మ స్థానమున సుఖించుటకు తావు

నందినది కార్మికుఁడుఁ గర్మమార్గమునం దెంతయవస్థం జెందినను భక్తిమార్గము నవలంబించక మోక్షముఁ జెందనేరఁడు.

భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే
సవిప్రేంద్రోమునిశ్శ్రీమాన్ సయతిస్సచపండితః
తస్మైదేయంతతో గ్రాహ్యం సచపూజ్యోయథాహ్యహం॥

అనునట్లు అర్చన వందనాద్యష్ట విధములు గలిఁగిన భక్తి నిష్కళంకమై మ్లేచ్ఛుని యందున్నను ఆతఁడే బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు, ముని, సిరిగలవాఁడు, యతి. జ్ఞానియునగును, కావుననన్నువలెనే ఆతని పూజించవలయును ఆతనికే యియ్యవలయునుఁ గొనవలయును ఈసూత్రము ననుసరించి ప్రబోధనంబుఁగావించి జాతి వైషమ్యముల నంతరింపంజేసి సర్వమానవులు నీశ్వరునికడ సమానులేయనుట వెల్లడించి మానవులందు భక్తినంకురింపంజేసినది వైష్ణవము శైవమే ఈమతద్వయమందు దేవతానామ భేదముదప్ప వేదాంతమందెందును భేదము లేదు దీనికి నిదర్శనములు శ్రీ నీలకంఠ రామానుజ భాష్యములే.

అనాది వైష్ణవమతమునకు భగవద్రామానుజులువలెనే యనాదియగు శైవమతమునకు శ్రీ బసవేశ్వరులు వ్యాపకులై యుండిరి.

## శై వ మ త ము.

శైవము వైదికమతములలో నొకటి దీనికనంత నాముండు ననంతరూపుండై ప్రపంచమునంతయు నావరించిన శివుఁడు పరదేవత భస్మరుద్రాక్షలింగధారణాదులు చిహ్నములు శివోత్కర్షతను జూపించు ప్రమాణములు శ్రుతిస్మృతీతిహాస పురాణాగమాదులందు వేనవేలు గలవు భరతఖండమునందా సేతుహిమాచల పర్యంతమును వ్యాపించియుండు శివలింగ క్షేత్రములే శైవమతవ్యాప్తిఁ దెలుపు నిదర్శనములు బ్రాహ్మణాది సర్వవర్ణములవారును శివునారాధించువారై నూటికెబదిమంది కెక్కువనే గానంబడుచున్నారు. కాని అందఱును శైవులేయని సర్వసాధారణముగా జెప్పసలపిగాదు. కొందఱు బ్రాహ్మణులు వైశ్యులు లింగవంతులుగాక భస్మ రుద్రాక్షధారణంజేసి లింగమును పూజింతురు. మఱికొందఱు శివలింగమును మేనధరించియు బ్రాహ్మ్యకర్మల నాచరించుచున్నారు. వారిశిష్యులు నట్లేయున్నారు. గావున వీరు వీరశైవు లనఁబడరు.

## వీ ర శై వు లు.

వీరశైవులందు వర్ణవ్యవస్థలేదు. భక్తిప్రధానము కర్మనువదలిననే శివభక్తి యంకురించి శివుని జేరుటకు హేతువగునని వీరశైవ సిద్ధాంతము, అందులకే

బ్రాహ్మణునింటిలోఁబుట్టిన బసవేశ్వరుండుఁ దన్నుపనీతుఁ జేయఁదలఁచిన తండ్రికిఁ గర్మనిరసనమునకై బోధించిన విషయము లనేకములుగలవు.

శ్రీబసవేశ్వరుఁడే వీరశైవాభివృద్ధికి కారణుఁడు.

బసవేశ్వరుఁ డవతరించకమున్నే భరతఖండమందంతటను ముఖ్యముగ దక్షిణ హిందూస్థానమున శైవమతము వ్యాపించియున్నది. కాని యది కర్మజ్ఞాన భక్తి సమ్మిళితంబై వర్ణవ్యవస్థగలదియైయుండుకతన సంకుచితమై యుండెను. దానంజేసి జైనబౌద్ధాది మతములు వ్యాపించి శైవమతమును నిరసించుచుండెను. బసవేశ్వరుని కాలమువరకు శివభక్తు లచ్చటచ్చటనున్నను విజృంభించి మతాభివృద్ధిని గావించలేదు దానికి కులభేదమే యాటంకము. బసవేశ్వరుఁడు నిర్మలశివభక్తి జ్ఞానవైరాగ్యంబులను జగంబున వెల్లడింపఁజేయుట కవతరించిన నందీశ్వరుఁడని బసవపురాణాదులు నొక్కి వక్కాణించుచున్నవి.

బసవనంతటి భక్తివంతుడు మహాత్వముగలవాఁడాకాలమున నొక్కండును లేకుండెను. ఆతనిగురువగు సంగయదేవుని యానతిప్రకారమే బసవన జీవితమును గడపెను. వీరశైవధర్మములను తాఁ జక్కగనడిచి యితరులను నడిపించెను. తన యింట లక్షలమంది శరణుల నుంచుకొని పూజించుచు జంగమారాధనాక్రమంబు విశదపఱచెను. బసవని గుణవిశేషంబులను మహాత్ముండగు నల్లమ ప్రభువు మిగులఁ గొనియాడియున్నాఁడు. అదివఱకాలునూరేండ్ల పయినుండి శివలీలా విభూతిలో శివ పూజలం గావించుచు (శివోఽహం) అను శివాద్వైతమును సార్థకపఱచిన వకలేశ నూది రాజయ్యాయు కిన్నరబ్రహ్మాయు మొదలుగాగల మహాభక్తులు నీతని దర్శనముం గోరియే వచ్చియుండిరి అట్టి బసవేశ్వరుఁడు తన ప్రతిభచే వైదిక జైనబౌద్ధ మతముల నిరోధించి వీరశైవము లభివృద్ధినొందించెను. బౌద్ధమత జాలమున జిక్కికొన్న మానవుల నుద్ధరించి భక్తిమార్గంబును బోధించి యచిరకాలముననే దిగంత విఖ్యాతుండయ్యెను.

బసవేశ్వరుడు స్థాపించిన వీరశైవమునకు లింగధారణము భస్మరుద్రాక్ష ధారణము అన్యసమయ నిరసనము భక్తిప్రపత్తి జ్ఞానవైరాగ్యములు జాతిభేదంబులను బాటించకుండుటయు జంగమార్చనయును ముఖ్యధర్మములు లింగధారణమునకు కక్ష కంఠ కరశిరోస్థలములు ముఖ్యస్థానములు బ్రాహ్మణాద్యష్టాదశవర్ణముల వారును లింగాంగులై కులభేదమును బాటించక నందఱు నీశ్వరసంతానమని సోదర న్యాయముగా నుందురు. దీనివిషయమై శివనాగుమ కమలాచరిత్రములందు బసవేశ్వరుడు బిజ్జలునకొసంగిన బ్రత్యుత్తరములనుఁ జూడవలయును. ఇట్లే వైష్ణవ భక్తులందుగూడఁ బ్రచారముండెను ఈవీరశైవ సంఘము బసవేశ్వరుని నాటినుండి దినదినాభి వృద్ధిఁజెంది జాతివైషమ్యంబులనుఁ బోకార్చి మహాసముద్రముఁబోలె నుండెను. వీరి శైవులు భక్తియందును మతమునందును నిశ్చలత్వమునుఁ బూనిరి

లింగపసాయిత ఖడ్గంబులను ధరించి శివద్రోహులను నశింపఁజేసిరి అది హింసాకార్యమైనను మతోద్ధరణ ధర్మమువల్ల యదిన్యాయమనియే వారిభావన బసవేశ్వరునకు సంగయగురుడు

చిత్తజాంతకుభక్తి చెందనాడుఖలుల
మృత్యువుగతిఁద్రుంపుమీ, బసవన్న॥

అని యాజ్ఞాపించెను. ఆకారణమున వీరశైవులు మతాంతరులకు భయంకరులుగానే యుండిరి. కల్యాణపురములో వీరశైవుల హడావుడి యంతగలిగినను బిజ్జలుండు మిన్నకుండుటకు కారణముగూడా నదియే అట్టి పూనికగలవారు కనుకనే యచిరకాలముననే దేశమంతయు వ్యాపించి యితర మతస్థులకంటె నెక్కువ వృద్ధింజెంది ప్రజలనందఱిని భక్తిమార్గంబున బ్రవేశింపఁజేసి సంసార సముద్రము నుండి తరింపంజేసిరి. శివభక్తియంతయును పలురూపులుగఁ బ్రకాశించుచున్నదను నట్లా కాలపు భక్తులు నిశ్చలముగా నడచిరి (శివాతిరిక్తం నహిచసర్వం శివమయం జగత్) అను సూక్తి వారి రోమరోమము బారియున్నది వారికి బ్రహ్మాది దేవతలు తృణప్రాయులు సంకల్ప వికల్పములు వారి స్వాధీనములు బొమముడిఁ బెట్టునంతనే బ్రహ్మాండము నశింపంజేయు సమర్థత గలవారు కొందఱు భక్తులు పాంచభౌతిక దేహముతోడనే సపరివారముగాఁ గైలాసమునకేగిరి జేరమరాజబిళ్ళమరాజ ప్రభృతులే సాక్షులు. భక్తులొకప్పుడు శివునైన నెదిర్చి తమదార్ఢ్యత్రను నిలిపి కొనిరి యీశ్వరుని వశుని గావించుకొని కేలనాడించిరి.

వీరశైవము ప్రబలిన తోడనే అద్వైత జైనబౌద్ధాది మతముల వ్యాప్తి తగ్గినది. కొందఱు బ్రాహ్మణులు వీరశైవాభివృద్ధికోర్వక నెదిరించి వారిదాడి కోర్వక వీరశైవ దీక్షఁగొనిరి వారింజూచియే శైవబ్రాహ్మణులు లింగధారణనొంది అంత్యసంస్కారమునందుఖననము మాత్రము యాచరణలో నుంచికొని యుట్టికి స్వర్గమున కందకుండా నుండిరి అందుకే మల్లికార్జున పండితారాధ్యుడు (భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతోపొత్తు బాయలేను నేను బసవలింగ) యని ప్రలాపించినాడు దానివలన శైవమునకంటె వీరశైవమే శ్రేష్ఠమని తెలియుచున్నది. బసవని యుపాస్య దైవముగ భావించి నుతించిన పాల్కురికి సోమనారాధ్యుఁడును తనయంత్యకాలమున వీరశైవమునే యవలంబించెను. ఇట్లే బ్రాహ్మణు లెందఱో వీరశైవము నవలంబించి తమ బ్రాహ్మ్యమునకుఁ దిలాంజలి నొసంగిరి వీరశైవులు మాత్రము బ్రాహ్మణ్యమును భూషించలేదు. దానియందు లక్ష్యముంచలేదు ఆసంఘమును చెదుర గొట్టుటలో ముందంజ వేసినది వీరశైవులు గొందఱు భవులతో దర్శన స్పర్శనాలాపన దానాదానాదులనుగూడ వర్జించి కేవల లింగ నిష్ఠాగరిష్ఠులై యుండిరి వీరితరులవలె వేషధారులుగారు.

## గురులింగ జంగము సామరస్యము.

మఱియును రహస్యార్థోపదేశకంబైన గురులింగ జంగమ సామరస్యంబు వారియందు నిగూఢంబై యున్నది దాని నెఱింగినవారికే కైలాసము కరతలామలకము మోక్షేచ్ఛగల మానవుఁడు పూర్వజన్మ శతకృత పుణ్య పరిపాకము వలనఁ గురుసమాశ్రయణమునొంది తదుపదేశంబున తొల్లింటి జన్మావస్థను మఱచి గురుజాతుండై గురుదత్త లింగధారియై ఆతనివలన లింగరహస్యము నెఱింగి జంగమ కటాక్షమునకుఁ బాత్రుఁడై కైలాసమునొందుట కర్హుండగును. ఆగురులింగ జంగమ పదములొకటిని విడచి యొకటియుండ నేరవు గురులింగములు జంగమమనియు లింగజంగమములు గురుఁడనియు, గురుజంగమములు లింగమనియు చెప్పఁబడుటచే నీముగ్గురు నొక్కటేయను భావమాపదత్రియమున భాసిల్లుచున్నది దాని నెఱింగిన వాఁడే సంపూర్ణ శివజ్ఞాని గుర్వనుగ్రహపాత్రుఁడు.

## భక్తుఁడు.

ఆగురుకరుణచేత నెల్ల శివరహస్యములు నెఱింగిననేగాని భక్తుఁడు గాజాలఁడు భక్తుఁడు గానివానికి కైలాసమునున్న భక్తునకు జాతిగోత్రములులేవు దైహిక బంధువ్రులులేరు. తల్లిదండ్రి మొదలగు బంధుగులెల్లరును భక్తులే వారికి బ్రహ్మాది పదవులు తృణసమానము భస్మరుద్రాక్ష ధారణము లింగపూజ పంచాక్షరీ మంత్ర పఠనము జంగమార్చనయు తచ్చరణతీర్థగ్రహణంబు ప్రసాదోప భోగంబు భక్తుని నిత్యకృత్యములు దీననే భక్తుని శివుఁడనుగ్రహించును.

## శైవులలోని భేదము.

వామాః పాశుపతాశ్చైవ కాలాముఖమహావ్రతాః
కాపాలాభైరవాశ్చైవ శ్రావకా యోగధారిణః
శైవాబహువిధాశ్చైవ

వామ పాశుపత, కాలాముఖ, మహావ్రత, కాపాల, భైరవాది భేదములచే నీశైవము నందంతర్గతము లిమిడియున్నవి అన్నియు వర్ణాశ్రమాచార యుక్తములై నవి. యీమతములందు లింగధారణ లేదని యీక్రింది ప్రమాణమువలన తెలియు చున్నది.

వ్రతం పాశుపతంచైవ కాలాముఖకపాలికే
లింగాంగసంగహీనత్వాత్తచ్ఛిష్యోనరకంవ్రజేత్
శైవాః పాశుపతాః వామాః కాలాముఖ మహావ్రతాః
అతిరిచ్యతిదేవేశి ప్రాణలింగార్చకోబుధః

మహావ్రత పాశుపత కాలాముఖకాపాలికాదులు లింగవంతులుగారు గావున

వారి నాశ్రయించినవాఁడు నరకమునఁ బడును.

పాశుపతవామకాలాముఖ మహావ్రతాది శైవులకంటె ప్రాణలింగధారియే యుత్తముఁడు ఇట్లుఁ జెప్పుటచే శైవులలో నెల్ల వీరశైవులే శ్రేష్ఠులని తెలియుచున్నది లింగధారి గానివాఁడెంత మహాత్ముఁడైనను మోక్షము నొందనేరడనిగదా సిద్ధరామ యోగి చెన్నబసవేశ్వరుని కడకేతెంచి వీరశైవ దీక్షను గైకొనినది వీరశైవులు మేన ధరించు లింగములకు ప్రాణలింగమనియు ఇష్టలింగమనియు పేరు వారాలింగమును ప్రాణములకంటె నెక్కుడుగ గాపాడికొనుదురు. యేదేని యపాయమువలన లింగము మైనుండి క్రిందఁబడిన వారుప్రాణములను వదలవలయును

ప్రాణలింగ వ్రతేలుప్తే ప్రాయశ్చిత్తం నవిద్యతే
ప్రాణత్యాగాత్పరం తస్మాత్సావధానే నధారయేత్ ॥

అను ప్రమాణమువారికి ప్రబలమైయున్నది వీరశైవ భక్తులయందాకాలమున చాలమంది లింగగత ప్రాణులుగా నుండిరి హాళికమారన్న కమల సంగమగురుఁడు మొదలగువారి చరిత్రములను చూడుఁడు. అందుకే వారు లింగములను శ్రద్ధగా గాపాడి కొనవలయును.

ఏకాంతి రామయ్య కిన్నర బ్రహ్మయ్య మొదలగువారి మహత్త్వము తెలుగు జొమ్మయ్య పద్మరసు దేవరసు జగదేవ ప్రభృతుల శూరత్వము తేడర దాసయ్య మొదలగువారి పాండిత్యము చామయ్య కన్నప్ప మొదలగువారి మహా భక్తియు, చక్కిమారయాదుల జంగమ సేవానురక్తియు, బిళ్ళమరాజాదుల గురు భక్తియును, కమలామారనాదుల లింగగత ప్రాణశక్తియును, మాద రాజప్రభృతుల లింగమర్మజ్ఞతయు, కలకేత బ్రహ్మయాదుల లింగవినోదమును వర్ణనాతీతము ఇట్టి మహనీయుల విశాలచరిత్రములే యీశివమహా భక్తవిజయమున వర్ణింపఁ బడినవి.

ఈ శివభక్తుల చరిత్రములు కర్ణాటాంధ్ర ద్రావిడభాషలయందు గద్య పద్యాత్మక కావ్యములుగా పూర్వకవులచే వ్రాయఁబడినవి. కాని చరిత్రములన్ని యొక్క గ్రంథమున లేకపోవుటయు కొన్ని పద్యగ్రంథములగుటయు కొన్ని సంస్కృత ద్రావిడ గ్రంథములలో నుండుటయుగల్ల నాంధ్ర మహాశయులకా భక్తుల గాథలు సులభ బోధకములు గాకుండెను. శైవతత్త్వములు విశదములు గాకుండెను. ఆలోపమును దీర్చుటకొఱకే యీ శివమహా భక్తవిజయ మేర్పడినది

సోమనాథకృత బసవపురాణము చెన్నబసవ పురాణము పండితారాధ్య చరిత్రము పెరియపురాణము మున్నగు గ్రంథములయందలి కథలను గైకొని పర మేశ్వరుడొసగిన విశేషాభిప్రాయములతో నీగ్రంథమును రచించి నాల్గు భాగ ములుగ విభజించితిని. శ్రీ బసవేశ్వరునకన్న మున్నే శైవమతమున్నను బసవేశ్వ

రుండామార్గమును విడిచి వీరశైవమను నూతన పథమున శివభక్తి సూత్రముల లోకమున వెల్లడిజేసి యీమతమును దిగంతవ్యాప్తముఁజేసెను గాన నట్టి వీర శైవ ప్రధానాచార్యుని చరిత్రము ప్రప్రమథమున లభించినంతవరకు విశాలముగా వ్రాయబడినది. ఇందువర్ణింపఁబడిన భక్తులందఱును మహత్వముగలవారే కావున వారిమానవాతీత! కార్యములయందు శంకించుట యజ్ఞానహేతువు. వారు జపతప స్వాధ్యాయ యజ్ఞాదుల కందరాని పరశివుని భక్తిచే చిక్కించికొని చేతిబొమ్మవలె నాడించికొన్నారు వీతరాగులై లింగగత తనుమనస్కులై లింగవినోదులై యున్నారు. కావున వారొనర్చు కావ్యములన్నియును సత్యములేయని సూక్ష్మ దృష్టిగలవారు నమ్మవలయును. పరిశుద్ధములైనవారి నడకలే యితరులకు ధర్మములు వారి పవిత్రనామోచ్చారణమే పాపపరిహారమునకు హేతువు అట్టి మహాపుణ్యుల చరిత్రములు వర్ణించువారి నాలుక పరిపూతము గాకుండునా ?

ఆసద్భక్తుల చరిత్రము లందఱికిని సులభముగ తెలియుటకొరకు వచన రూపముగ వ్రాయఁబడినది అందందుదాహరణము లీయఁబడినవి. బసవేశ్వరు చరిత్రమును వ్రాయునప్పుడు పాల్కురికి సోమనాథకృత బసవ పురాణము నాకెంతయో దోడ్పడినది. బసవేశ్వరుని భక్త్యతిశయమును వర్ణించు పట్టులందు దానినుండియేయభిప్రాయములను గైకొంటిని.

## గ్రంథరచనకు కారణము.

సాబాద తాలూకాలోఁ జేరిన శంకేపల్లి గ్రామాధికారులును నిరంతర శివ శైవ పూజాధురంధరులును విద్వత్ప్రియులును భక్తివంతులును మన్మిత్రులునగు మ॥ రా॥ పరమరెడ్డి మొ॥ గారు నన్నీగ్రంథమును రచించుట కొరకు చాలాకాల మునుండి ప్రోత్సహించుచుండిరి. కాని నేనన్యాఖ్యాత శైవగ్రంథ గంధుండనగుటచే గ్రంథరచనకుఁ బూనుకొన నిచ్ఛయించకుంటిని వారుమాత్రము పట్టుదలను వీడక నన్నుఁ బ్రేరేపించుచునే యుండిరి కొంతకాలమున కట్లేకానిమ్మని బసవపురాణాది శైవగ్రంథములను సమగ్రంబులుగ చదివి తన్మతరహస్యముల కొన్నిఁటిని శైవ మిత్రులవలన తెలిసికొని యాంగీరస వైశాఖమాసమున నీ గ్రంథమును వ్రాయుట కుద్యమించితిని. ఒకభాగము వ్రాయువరకు నాశరీరమందస్వస్థత గలిగి యొక సంవత్సరము పైవరకును బాధింపఁబడితిని దాన నీ గ్రంథము మూలవడియుండెను. కాలము మారినది ఆర్థిక స్థితులు లోపించినవి శక్తికిమించినకార్యముల నొనర్చుటకు ధైర్యములు చాలకున్నవి కాని యూహాలుహూతముమారనికారణమున శరీర స్వస్థత గలిగిన పిమ్మట తిరిగి గ్రంథమును సంపూర్ణముగవ్రాసి ముద్రించుటకు యత్న మొనర్చితిని. అప్పటి ప్రోత్సాహకుల కందఱికిని ఆర్థిక స్థితులయందు క్లిష్టదశ గలుగుటచే గ్రంథముద్రణము భారముగ దోచెను ఊరకున్నచో జేసిన కృషి వ్యర్థ

మగుననిమెంచి నానాప్రయాసములనొంది గ్రంథమును ముద్రింపించితిని నాల్గు భాగములు కలసి నాల్గురూప్యములు మాత్రమే చందా యేర్పరుపఁబడినది. మ॥ రా॥ పరమరెడ్డిగారు గ్రంథరచనకు ప్రోత్సాహకులే గాక యధాశక్తి ముద్రణవ్యయమునకై సాయమునొనర్చ భారమువహించిరి మరియును మ॥ గొల్లగూడెం మల్లరెడ్డిగారు నారగూడెం కృష్ణరెడ్డిగారును అంతప్పగూడెం రామరెడ్డిగారును యీ గ్రంథవ్యయమునకుఁ దగుసహాయము నొనర్పఁ బూనుకొనిరి. వీరందఱికిని పరమేశ్వరుఁడాయురారోగ్యముల నొసంగుగాక.

మతభేదములను పాటించువారికి మనవి.

ప్రపంచమున కంతటికి నీశ్వరుఁ డొక్కడే యుండునుగాని యొక్కొక్క మతమునకు నొక్కొక్క యింటి కొక్కొక్క దేవుఁడుండఁజాలఁడు. అట్లుండునని చెప్పుట లోకవిరుద్ధము. ఈమతవాదములవలననే మన సనాతన మతశక్తి కుంటిదై పోయినది ఇతరులు మనపై దాడివెడలుటకు కారణమయ్యెను. ఆపరమేశ్వరున కనంతనామములు ననంతరూపములుండునని శృతిస్మృతీతిహాస పురాణాదులు కంఠోక్తిగా జెప్పుచున్నవి భక్తులు నన్నేరూపమున నేనామమున పూజింతురో వారికానామమున నారూపమున గన్పట్టుదునని శ్రీకృష్ణ భగవాను లానతిచ్చియున్నారు

న తేరూపం నచాకారం నాయుధానినచాస్పదం
తథాపిపురుషాకారో భక్తానాం త్వంప్రకాశసే॥

అనునట్లు నామరూప రహితుఁడైన భగవంతుఁడు భక్తులకొఱకు పురుషరూపము నవలంబించి ప్రకాశించుచున్నాఁడు వానినే విష్ణువని వైష్ణవులు శివుడని శైవులు మరియు నాయామతస్థులు నాయాపేళ్ళతో పరమేశ్వరు నుపాసించుచున్నారు. వారికట్లే పరమేశ్వరుఁ డగుపడుచు ఫలముల నిచ్చుచున్నాఁడు.

బ్రహ్మత్వేసృజతేసర్వం స్థితౌపాలయ సేవునః
రుద్రరూపాయకల్పాంతే నమస్తుభ్యం త్రిమూర్తయే॥ (విష్ణుపురాణము)
బ్రహ్మేశవిష్ణ్వాఖ్యశరీరభేదై ర్విశ్వంసృజత్యత్తి చపాతియశ్చ
తమాదిదేవం పరమంపరేశ మాధాయ చేతస్యుపయాతిముక్తిం॥

(స్కాందము)

మరియు నెన్నేని ప్రమాణములు గలవుగాని గ్రంథవిస్తర భీతిచేతను పండితులెల్ల రెఱింగినవియేగాన వ్రాయలేను. దీనిచే నామరూప భేదముగల పరమాత్ముఁ డొక్కడేయని తెలియుచున్నది. ఇట్లుండ మతములయందలి యభిమానముచే శివశైవులను వైష్ణవులు విష్ణువైష్ణవులను శైవులు దూషించుకొనుటయు గాక మానవ సౌభ్రాతృత్వమును మాని దేవదానవులవలె పరస్పరము కలహించు

కుందురు. గ్రంథములయందలి ప్రమాణములను జూపింతురు. ఒకరినొకరు జూచి కొనుటయే మహాపాపమని వారితలంపు. సత్యాసత్యములు ప్రతిమతమందును కల్గి యున్నవి వాని నభేద దృష్టితో బరికించిన దొరకఁగలవు. అసత్యమును దోసి పుచ్చి సత్యమును గైకొనుటయే ప్రాజ్ఞుల లక్షణము. కాని పరస్పరము దూషించి కొని బీభత్సము గావించుకొనుట పరిహాసాస్పదము. తమకు నచ్చనివన్ని యసత్య ములని వానిని దూషించుట పాపమునకు హేతువుగాని మరొండుగాదు. ఒకరి నొకరు దూషించుకొమ్మని యేగ్రంథమునందును వ్రాసియుండలేదు. కావున సర్వ మును సత్యమనినమ్మి తమ సోదరభావమును ప్రకటింతురుగాక.

మరియు నంధుఁడు భూప్రదక్షిణము నొనర్ప బూనినట్లును, మూఁగవాఁడు వేదాది గ్రంథములను పఠింప నుద్యమించునట్లును పంగుండు పర్వతారోహణంబును జేయ సంకించు నట్లును అజ్ఞుడనగు నేనీగ్రంథమును వ్రాయనుద్యమించితిని. అల్పమతి నగు నాచే వ్రాయఁబడిన నీగ్రంథమం దేవిధములయినదోషములున్నను రాజహం చలు నీరునువదిలి క్షీరమును గొనురీతి సుజనులు దోషములను పరిహరించి యుత్కంచి ద్గుణములున్న గ్రహించి నన్ను మన్నించ వేడుకొనుచున్నాను.

ఈగ్రంథము నాసాంతముగ శ్రద్ధతోఁ జదివి దానియందలి దోషము లేమేనియున్న దీసివేసి ముద్రాపించుటకై త్వరగతిని ప్రోత్సహించిన బ్రహ్మశ్రీ వారణాశి రామయ్యగారికిని గ్రంథమును ముద్రించునెడ మిగుల శ్రమఁజేసి లేఖన ముద్రణ దోషంబులనెల్ల దిద్దుచు నెంతో సహాయము నొనర్చిన నా చిర మిత్రులగు ఉ॥ వే॥ శ్రీ॥ పం॥ తిరుమల పంచాంగము వేంకటాచార్యులవారికిని యనేక వందనముల నర్పించుచున్నాడను.

౧౭-౧౧-౪౩
మక్తా వడ్డేపల్లి
తూపూరాన్ పోష్టు
మేడిచల్ తా॥

ఇట్లు
విబుధజన విధేయుఁడు
బెల్లముకొండ నరసింహాచార్యులు
గ్రంథకర్త

## శ్రీ శివమహాభక్తవిజయమునకు

## ముఖ్యాభిమానులగు

## మ॥ రా॥ శ్రీ॥ పరమారెడ్డిగారి కాశీర్వాదము.



మ॥ హరతత్త్వంబు నెఱుంగువాఁడు గణవర్గారాధనాసక్తుఁడుం
బరమోదారుఁడు పండితప్రియుఁడు సన్మాన్యుంసు శంకేపలీ
పురవాసుండు వదాన్యశేఖరుఁడు సత్పుణ్యుండు ధన్యుండు నౌ
పరమారెడ్డిని బ్రోచుగాత గిరిజాప్రాణేశ్వరుం డెప్పుడున్॥

మ॥ ననుముఖ్యాశ్రితుఁ గౌరవించి గిరిజానాథాంఘ్రి భక్తావళీ
ఘనచారిత్రము లెల్ల నాంధ్రమునను ద్గ్రంథంబుగా వాక్యరూ
పనిరూఢిన్ సకలైకవేద్యముఁగ సెప్పంగన్ని యోగించుస
గ్గుణి శంకేపలి పర్మరెడ్డికిల నెంతో గీర్తి ప్రాప్తించుతన్॥

గీ॥ శివమహాభక్తవిజయంబు క్షితిని వెలయ ♦ ముద్రణముకు యథాశక్తిఁ బ్రోత్సహించి ♦ విత్తమర్పించి సత్కీర్తి వెలయునట్టి ♦ పరమరెడ్డిని రక్షించు బుర హరుండు॥

గీ॥ కృష్ణరెడ్డియు మరి భద్రిరెడ్డి రంగ ♦ రెడ్డియును పెంటరెడ్డి నాపృథుల యశులు ♦ పరమరెడ్డికి సుతులు నల్గురిలవారి ♦ నరసి రక్షించుగాక శశాంకమౌళి॥

కం॥ నారంగూడసిత కృ ♦ ష్ణారెడ్డిని గొల్లగూడ సదనుండౌ మె ♦ ల్లారెడ్డి నంతగూడపు ♦ రీరాంరెడ్డిని హరుండు బ్రేమున బ్రోచున్॥

ఇట్లు

ఆశీర్వాదకుఁడు

గ్రంథకర్త

శ్రీ

# కృతిసమర్పణము.

సర్వప్రపంచంబున కాధారభూతుండై
భక్తజనుల కోరికలను దీర్చువాఁడై
సర్వపాపంబులను బోగొట్టువాఁడై
భక్తులకొరకు నానారూప నామంబులను బొందువాఁడై
నాయిష్టదేవతయై యొప్పారు దేవదేవుని
పాదారవిందయుగళమునందు,
భక్తిపూర్వకంబుగా
నీ
శివమహాభక్తవిజయంబు
సమర్పింపఁబడుచున్నది.

# పండితాభిప్రాయములు.

శ్రీమద్గోపాలావధూత స్వాములవారి ప్రియశిష్యులును, మ॥ రా॥ కొండా వెంకట రంగారెడ్డి హైకోర్టు వకీలుగారి యాస్థానాశ్రితులును, శ్రీరామాచల పూర్ణబోధిన్యాది గ్రంథకర్తలునగు బ్ర॥ వారణాశి రామయ్య హరిదాసు గారిట్లు వ్రాయుచున్నారు.

శ్రీమాన్ బెల్లముకొండ నరసింహాచార్యులుగారిచే రచియింపఁబడిన శ్రీశివమహా భక్తవిజయమునందలి మొదటిభాగమును సంపూర్ణముగఁ జదివితిని ఇంతవరకిట్టి గ్రంధము త్రిలింగదేశీయులగు శైవమహా జనుల కరముల నలంకరించి యుండుట నేగనలేదు. వివిధదేశములంగల భక్తుల చరిత్రములన్నియును సంపూర్ణ ముగ భక్తిరసమును వెలిబుచ్చుచు వర్ణింపఁబడియున్నవి. దీనిని చదువ చదువ నెంతటి సంసార బద్ధులకైనను శివభక్తి యంకురించక తప్పదు. అక్షరజ్ఞులగు వారి కెల్లను తెల్లముగా తెలియునటుల వచనరీతిగా మృదుమధుర శైలినక్కడక్కడ ప్రమాణము లొసంగబడుచు నీగ్రంధము వ్రాయఁబడినది. తొల్లింటి శివభక్తుల మహాత్వము వారియుత్కృష్ట జీవనము వారివి జృంభణము శౌర్య ధైర్య సాహస ములును పాఠకుల కెంతయో నానందము నొనగూర్చుచున్నవి. శివభక్తి క్షీర ములం గోరువారికిది కామధేనువు వంటిదని నామనః పూర్తిగ దెల్పుచున్నాడను. విశిష్ట శ్రీవైష్ణవమత సాంప్రదాయులగు నియ్యాచార్యులవారు మతభేదమును పాటింపక శివతత్వము నెల్లయు నీగ్రంధమున విస్తరించి తన్మతమునకు పరిపూర్ణ కళాభి వృద్ధిని గలిగించి నందుకు నేనెంతయో సంతసించుచు వారి నభినందించు చున్నాడను.

ఆర్యవర్యా!

---

తాము మతభేదమును పాటింపక నిర్మల భావమున రచించిన శ్రీశివమహా భక్తవిజయము మొదటిభాగమును చదివి మిగుల నానందించితిని. గ్రంధమంతయు భక్తిరసముచే నిండియున్నది. ఇది శైవజనుల కెంతయో నుపకారిగా నుండునని నాభావము. శివభక్తి జ్ఞాన వైరాగ్యములును, శివమహాత్వమును, శైవుల నిష్ఠ లును, తద్భక్తిప్రపత్తులును, సదనుష్ఠానములు, శివోపాసనయు చక్కగా వర్ణింపఁ బడినది. ఆస్తిక శైవమహా జనులందరును దీనినాదరించి మిమ్ము ప్రోత్సహించుదురు గాక.

ఇట్లు
వెంకట రమణమూర్తి శతావధాని
లింగాపురం అగ్రహారము.

ఆర్యవర్యా!

తమచే రచింపఁబడిన శ్రీశివమహా భక్తవిజయ గ్రంథమునందలి ప్రథమ భాగములోని భక్తుల చరిత్రముల గొన్నింటిని జదివి యానందించితిని. ఇందలి రచన మనోహరము, భాష గ్రాంధికము, చరిత్రములు మనోజ్ఞములు, ఇందు శివ భక్తిమహిమ చక్కఁగ వర్ణింపఁబడినది. ఇది శివభక్తులకు గల్పతరు వనదగియున్న దని నాయాశయము. దీని నాంధ్రభాషాభిమానులుకూడ కొని గ్రంథకర్తను ప్రోత్స హింతురుగాక.

శికింద్రాబాద్
1-9-34

ఇట్లు
చివుకుల అప్పయ్యశాస్త్రి

---

శ్రీమాన్ బెల్లముకొండ నరసింహాచార్యులగారిచే వ్రాయఁబడిన శ్రీశివమహా భక్తవిజయమునందలి కొన్నికథలం జదివితిని. అందలి భక్తులయందలి భక్తిరూపమును గొనివచ్చి తాండవించుచున్నదా యనునట్లు వర్ణింపబడినది. శైవుల మహత్వము అత్యద్భుతము. వారినిష్ఠ లతిపవిత్రములు వారిభక్తి ప్రపత్తులు లోకాతీతములు. ఇట్టి పవిత్రగ్రంథమును నాల్గుభాగములుగవిభజించి యాంధ్ర లోకమున కర్పించినయియ్యాచార్యు లెంతయో ధన్యులు గ్రంథమంతయును వచన ముగ మృదుశైలిగనుండుటచే పాఠకుల కెంతయో సులభసాధ్యముగా నున్నది

ఇట్లు
శృంగారం కృష్ణమాచార్యులు
మహారాజు గంజ్
హైద్రాబాద్.

శ్రీమాన్ బెల్లముకొండ నృసింహాచార్యులుగారు రచించిన శ్రీశివమహా భక్తవిజయము అను వచన గ్రంథమును స్థాలీపులాక న్యాయముగా జదివితిని. భక్తిరసపూరితముగను సిద్ధష్టముగను అలరారుచున్న ఈపుస్తకము శివభక్తులగు వారికి ఆనంద సంధాయకముగా నుండుననుట నిశ్చయము. గ్రంథకర్తలగు ఆచార్యులుగారు శ్రీవైష్ణవ సంప్రదాయమునకు జెందినవారు. వీరు పూర్వపు శిష్టాచార సంపన్నమగు కుటంబము వారయ్యు, శైవమతస్థులగు మహాభక్తుల చరిత్రమును, తన్మతోపాసకులగు వారికిష్టముగానుండు విధముగ రచించి యుండుట వీరి రచనా సామర్థ్యమునేకాక భావౌదార్యమునుగూడ చాటుచున్నది. వీరి యీ సత్ప్రయత్నము శివభక్తులగు వారిచేత ముఖ్యముగను ఆంధ్రభాషాభిమానుల చేత సాధారణముగాను ప్రోత్సహింపబడుగాక.

ఇట్లు
మాడపాటి హనుమంతరావు.

# శ్రీ శివమహా భక్తవిజయము నందలి విషయసూచిక.









శ్రీశివమయం

శ్రీశుభమస్తు





# శ్రీశివమహాభక్తవిజయము.



(మొదటిభాగము.)



బసవేశ్వరావతారకారణ చరిత్రము.

శ్లో॥ నేతారం సర్వలోకానాం ♦ దాతారం సర్వసంపదాం
వందేహం స్వేష్టదేవేశం ♦ గ్రంథవిఘ్నోప శాంతయే॥

శ్లో॥ శ్రీమల్లారీశ పాదాబ్జ ♦ చింతనాపూతమానసాః
శ్రీమద్భక్తవరాస్సర్వే ♦ మహాభీష్ట ఫలప్రదాః॥

శ్లో॥ అజానన్నపితద్భక్త ♦ మాహాత్మ్యలవమున్నతం
కేవలంపరయాభక్త్యా ♦ వక్ష్యే భక్తకథావళీం॥

శ్లో॥ యథాపూర్వానుచరితం ♦ యథా గ్రంథాంతరే స్థితం
తత్సర్వంసమ్యగాలోక్య ♦ వక్ష్యేగణకథావళీం॥

శ్లో॥ నిగదంతు నిందామతయః కుతర్కాః ♦ కేచిద్బుద్ధయస్తోతుముపక్రమేరన్
నిందాస్తుతీచాపిసమేవిధాయ ♦ కార్యం కరోత్యున్నతభావబుద్ధిః

శ్లో॥ నాహం వచ్మి మతాంతరస్థగితయా ♦ బుధ్యాస్వలాభాయచ
శ్రీమచ్ఛైవగణావళీ విలసిత ♦ గ్రంథాన్ సమాలోక్యతత్
సర్వం సత్యమయం ప్రభోస్సుకృపయా ♦ సర్వప్రబోధాయచ
వక్ష్యేహం శివభక్తవర్యచరితం ♦ త్రైలింగభాషాత్మికం॥

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును, సృష్టిస్థితిలయ కారకుండును, భక్తాభీష్ట ఫలప్రదాయకుండును, తననిర్హేతుకజాయమాన కటాక్షములచే సంసారబద్ధులగు చేతనులనుజ్జీవింపజేసి కోటిజన్మంబులకైనను, జపతప స్వాధ్యాయాగ్నిష్టోమ జ్యోతిష్టోమ వాజపేయాశ్వమేధాది యజ్ఞములచేతను బొందరాని తన నివాసంబు నొసంగువాడును, పరమకారుణిక స్వరూపుండునగు పరమేశ్వరుండు, కేవల నిర్హేతుక కటాక్షముచే తన లీలావిభూతిలో నిత్యనివాసంబునుగొన్న సకలచేతనులంజూడ వారనాదియగు తన మాయం జిక్కి తనకు శేషభూతంబైన తమ [ఆత్మ] స్వరూపము నెరుంగజాలక (దేవోఽహంమనుష్యోహం) నేనేఈశ్వరుండను. ప్రభువును మనుజుడను అనిన్ని (ఈశ్వరోహమహంభోగీసిద్ధోహంబలవాన్ సుఖీ అఢ్యోభిజనవానస్మికోన్యోస్తి సదృశోమయా) అనిస్వతంత్రముగా నేనే జేయుచున్నానుతత్ఫలము నేనేయనుభవించు చున్నానునాతోసమాను లెవరును లేరనియెడివిపరీతబుద్ధులచేదిరుగుచు నేనీశ్వరునకు దాసుడను అతడునాకు రక్షకుండనుభావము నెదదలంపక నొకవేళ నాజ్ఞానమేకలిగినను యన్యథాయుపయోగించుచు (యోఽన్యథాసంతమాత్మానమన్యథాప్రతిపద్యతే ♦ కిం తేననకృతం పాపం చోరేణాత్మాపహారిణా) అనునట్లుభగవచ్ఛేషమైనఆత్మస్వరూపమునుమరియొకరీతిదలంచుటయనియెడిఆత్మాపహారమునొనర్చుచు,తుచ్ఛాతితుచ్ఛంబులైన శబ్దాదివిషయంబులకు లోబడి [విచిత్రాదేహసంపత్తిరీశ్వరాయనివేదితుం] అనునట్లు నీశ్వరుడు కరచరణాద్యవయవయుత విచిత్రదేహమును తన నారాధించుటకే యొసంగిన సద్దానిచేతనే శత్రువుల సంహరింపుమని తండ్రి తన తనయునకు ఖడ్గంబునిచ్చిన దానిచేత సుతుడు తన తల నరికికొనినట్లు నీశ్వరారాధనంబు సేయక

కేవల దుష్టసంసారిక కృత్యంబులందవిలి చెడిపోయి నానాయోని సంభవత్వమునం బొందుచు (పునరపి జననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం) అనురీతి జననమరణ ములపాలగుచు నానాక్లేశంబులం బొందుచుండుటంజూచి సహజకృపాళువగుటచే నోర్వజాలక "అయ్యో యీ చేతనులు నానంబంధులయ్యు నన్నుగానక సంసార సముద్రంబునంబడి దరిజేరకయున్నారు. వీరిని దరింపజేయకుంటినేని యెన్నటికైనను నాసన్నిధింజేరలేరు" అని మనంబున నెంచి నందిప్రముఖుల బసవేశ్వరాది రూపంబుల నవని నవతరింపంజేసి సత్యమును శాశ్వతమును మోక్షప్రదమును శివంకరమును అగు శైవమతమును వారివలన భూలోకంబంతటను వ్యాపింపంజేసి యనేక కోటిచేతనులనుజ్జీవింపంజేసి తన నిత్యనివాసంబునకు రప్పించుకొనెను. అట్టి పరాత్పరుని చరణకమలముల నారాధించుభక్తవర్యుల విశిష్టకల్యాణగుణంబులను మహత్వంబును వర్ణింపధరాధరణచణుండైన ఫణినాథునకుం దరంబుగాదు. ఆభక్తవర్యులలో ముఖ్యుండును, నందీశ్వరాపరావతారుండును, లోకాతీత చరిత్రుడును శైవమతవ్యాపకుండును జైనబౌద్ధాది దుర్మతఖండనుండును, బిజ్జలభూపాలపాలిత కల్యాణపురీ ప్రధాన మంత్రియునై రాజ్యభారంబును వహించి జగంబు నుద్ధరించిన శ్రీబసవేశ్వర మంత్రి చరిత్రంబు బ్రప్రథమున నిట్లభివర్ణింపబడుచున్నది.

శ్రీమదుమారమణ నివాసస్థానంబై, సర్వప్రమథగణ నిషేవ్యమానంబై సకల సుపర్వజనావాసంబై, నమజ్జనకలుషనిర్వారణంబై అనంతకోటి బ్రహ్మాండ నాయకుని తలపయింబాల్చినదై సర్వర్తుశోభాయమానంబైయొప్పు రజితగిరియం దొక్కనాడుమాసహితుండై పరమేశ్వరుండు కొలువున్నతరి సురమునియగు నారదుండు పరమేశ్వర నామగానంబుం జేయువచ్చి జగత్పితలగు భవానీశంకరులకు నమస్కరించి వారియానతిని యుచితాసనాసీనుండై కుశలంబునడిగిన శంకరుండును ఓ నారదా! నీవెల్లలోకంబులను సంచరించుచువు విశేషంబు లేమియన దేవముని యిట్లనియెను. ఓ దేవా! సర్వజ్ఞుడవై సర్వసాక్షివై యుండు నీవిట్లు నన్నడుగుట కేవల భక్తవాత్సల్యముగాదా! నీవడిగినప్పుడు నాకు తెలిసినసంగతిం జెప్పంబోవుట తప్పు? అన్నిలోకములందును భవదీయ పదారవింద భక్తియు భవత్పూజనాసక్తియు భవన్నామగానానురక్తియునే మిక్కిలి సాగుచున్నవి కాని భూలోకంబున నిన్నుం

బోధించువాఁడొక్కఁడును లేఁడు, భక్తి జ్ఞాన వైరాగ్యాది శూన్యులై జనులెల్ల సంసార సముద్రంబునంబడి మునిఁగిపోవుచున్నారు జైనబౌద్ధచార్వాకాది దుర్మతములు భూమండలంబెల్ల నిండిపోయినవి ప్రజాపాలకులందఱు వారేయయినారు ఎందును శూన్యవాదమే వినంబడుచున్నయది. పండితులు లేరు, యేకొందరోయున్నఁ గర్వవాదులైయున్నారు. అనేక పశుహింసలు జరుగుచున్నవి. ఆపాప భూయిష్ఠమగు భూలోకంబునఁ జూడ నాకధిక దుఃఖముగల్గి మీ సన్నిధానమున కఱుదెంచినాను. ఇప్పుడు నాలోకంబు నుద్ధరింప నీవుదప్ప నొరులు సమర్థులు గాఁజాలరు. ఓ దేవా! నీనిర్హేతుక జాయమాన కటాక్షముంజూపి పాపపంకిల నిమగ్నంబైన మానవ లోకంబు నుద్ధరింపుమనిన సర్వేశ్వరుండు వేడినిట్టూర్పువిడచి తన నిర్హేతుక జాయమాన కటాక్షంబును వెలిబుచ్చుచు నక్కటా! ప్రపంచంబంతయును శూన్యవాదులచే నిండిపోయినదా! చేతనకోటి భవసాగరమగ్నమై దరిగానకున్నదా? ఆహా! నాసంబంధులగు చేతనుల నుద్ధరింపకున్న నాకుఁ గళంకమాపాదించదా? కానిమ్ము నేనిదయే నందికేశ్వరుని భూలోకమునందవతరింపంజేసి విశిష్టంబైన శైవ మతంబును వ్యాపింపఁజేసి భక్తి జ్ఞాన వైరాగ్యములను ప్రజలందు గలిగించి సముద్ధరింపించెదను అతండును నాయంతటి సమర్థుండేగాన లోకంబు నుద్ధరించకమానడు. అని నందికేశ్వరుసంబిలచిన నతండువచ్చి యచ్చంపుబత్తిని చిచ్చఱకంటియడుగు కెందామరలకు మ్రొక్కి ముకుళితకరకమలుండై ముంగలనిలిచిన గని కందర్పదర్పహరుండగు హరుండును "వత్సా! శృతిస్మృతిమూలకందంబును, ధర్మశీలంబును, ఆచారనిధానంబును, మహత్త్వమును, కృతార్థత్వమును, ఆదిపథంబును, మోక్షదాయకంబుననగు మదీయభక్తిమార్గంబును పార్వతీ ప్రమథులకంటె నీకెక్కుడుగనుపదేశించితిని. ఇప్పుడు భూలోకంబంతయు ధర్మజ్ఞాన వైరాగ్యభక్త్యాదిశూన్యంబై దుఃఖంబుల మునుంగుచున్నదని నారదునివలనఁ దెలియుచున్నది. గావున లోకోపకారార్థము నీవు ధరనవతరించి శివభక్తివిశేషంబును వెల్లడిజేసి జైనబౌద్ధాదిదుర్మతంబులను ఖండించి తత్తన్మస్థులను మెల్లగా శైవమతంబునఁ బ్రవిష్టులఁగావించి యనంతంబులగు నాచరిత్రంబులను బ్రకాశింపఁజేయుము. నీవుసమస్త శైవాగమరహస్యంబుల నెఱింగినవాడగుటచేతనే సర్వజ్ఞుండవైతివి. నీకును నాకును భేదములేదు.

నీవు మర్త్యలోకమునం బసవేశ్వరుండను నామమున సంచరింపుము" నీకు నేను గురుమూర్తినై సంగమేశ్వరనామమున సంచరించుదును అదిగాక నీప్రాణలింగమునైనీ దేహంబున విరాజిల్లుచుందును. నీకావంతయు నాపద వాటిల్లకుండునట్లు కన్నులకు ఱెప్పలుంబోలె నిన్నుంగాపాడుచుందును. నామాటను మన్నించి భువినవతరించు" మనిన నందికేశ్వరుండు సంతోషస్వాంతుండై యుమాకాంతునిచరణారవిందములకు మ్రొక్కి— దేవా! భవదాజ్ఞను నెరవేర్చుటయే యీ సేవకునికి విద్యుక్తధర్మము. నేనెందున్నను నారక్షణము నీయదే కాదా! ఇందున్నవాడ నందులేకుందువా! సర్వము నీవవై యున్నావు. నీకృపయున్నచో నన్నియు తృటిలో సంసిద్ధమగును. అనిపలికి పునఃప్రణామంబుంగావించి ధరనవతరించ జయనంబయ్యెను.

పార్వతీపతయేనమః

మొదటి అధ్యాయము ముగిసెను.





శ్రీపార్వతీపతయేనమః

శ్రీనందికేశ్వరాయనమః

# బసవావతార చరిత్రము.



## (ద్వితీయాధ్యాయము)



సమస్త ధర్మంబుల కాధారభూతంబైన భూలోకంబునందు పరమపుణ్యాలవాలంబగు శ్రీశైలంబునకుఁ బశ్చిమ దిగ్భాగంబున గణ్ణాట దేశంబున హింగుళేశ్వరంబను నొక్క యగ్రహారంబు సర్వసంపత్సమృద్ధంబై విరాజిల్లుచుండెను అందు నిత్యనిర్మల శివాచార సంపన్నుండై జ్ఞానధనుండై స్వధర్మంబుల విడనాడక కాలమును గడపుచుండి శహాద రాజను బ్రాహ్మణుండుండెను అతనికి సకల సాధుగుణ సంపన్నయు, ననురూప సౌందర్య శోభితగాత్రియు, పుణ్యచారిత్రియునగు మాదాంబయను భార్యయుండెను వారి కన్నివిధముల సంపదలచే కొరతలేకున్నను పుత్రసంతానంబు లేమి మిగుల చింతలు కలిగెను మాదాంబయు నిత్య శివార్చనా తత్పరయై సంతానార్థ మెన్నియో నోముల నోచి యెదురైన దేవతలకు మ్రొక్కి నిరాశచే మిగుల చింతాకులయైయున్న నొక మహాత్ముండు నందికేశ్వర వ్రతము నాచరింపుమని యుపదేశించెను. ఆతెన్వ యదేప్రకారము నందికేశ్వరుని గుడికేగి భక్తిశ్రద్ధలతో సోమవారము మొదలుకొని ఎనిమిది దినముల పర్యంతము నందికేశ్వరవ్రతము నాచరించి తొమ్మిదవనా డుద్యాపనంగావించి భక్తితో నందికేశుని గొల్చుచున్నంత నందికేశ్వరుండే ప్రత్యక్షుండై ప్రసాదంబు

నొసంగి దీని మహాత్త్వంబున నన్నుం బోలుకుమారుఁడు గలుగునని జెప్పి యంతర్ధానంబుఁ జెందెను ఆమాదాంబయు మిగుల సంతసించి తత్ప్రసాదంబునుగొని యింటికి వచ్చి శుభముహూర్తంబున దంపతులును ఆప్రసాదంబు ననుభవించి సంతుష్టులై యుండిరి. నందికేశ్వరుండును తన యావిర్భావమునకు తగుమైన తావని దలచి మాదాంబికా గర్భమును బ్రవేశించెను ఆదినము మొదలుకొని మాదాంబిక గర్భచిహ్నములు గలదయ్యె యేశ్రమలేక దినంబులం గడపుచుండెను. ఇట్లు నందికేశ్వరుండు మాదాంబికా జఠరగుహాంతరమున సమాధినిష్ఠుండై ఈశ్వరధ్యానంబున మైమఱచి యుండెను. ఇట్లుండ మాదాంబిక గర్భమునుదాల్చి మూడేండ్లైనను ప్రసవించమి గర్భభారంబున మిగుల శ్రమలనందుచు దివారాత్రింబులందు నిద్రాహారంబులులేక పరితపించుచు నొకనాడు నందికేశ్వరాలయంబునకుఁజని భక్తిపూర్వకంబుగా నందికేశ్వరునకు మ్రొక్కి కేల్మోడ్చి నిలిచి "మహాదేవా! నాకు బుత్త్రుండు గలుఁగునని వరంబు నొసంగితివి నాతోటిచూలింతలగు నెలంతలు తిరిగి చూలాలులైరి నాకీయవస్థల నెందుకుగల్పించుచున్నావు యెంపైననిట్లు యేడులకొలఁది గర్భములుండుటఁగలదా? ఇది నీప్రభావంబని చెప్పుదునా? లేక నాదుర్దశయా? స్వామీ! ఇఁక నేనీగర్భభారంబును సహించ సమర్థురాలను గాఁజాలను. దయఁజేసి నాకు శీఘ్రముగాఁ గుమారుని దయఁజేయుము" అని ప్రార్థించి గర్భభారంబున మెల్లనమెల్లన నడచుచు నటునిటుం గూర్చుండుచు నింటికేతెంచి యాశ్రమచే మిగులఁడస్సి శయ్యపై బరుండి నిదురించెను. అంత నందికేశుండు లింగజంగమ రూపంబున మాదాంబికా స్వప్నంబున నేతెంచి యిట్లనియెను. ఓమగువా! నీవేల జింతిల్లెదవు వైశంబ నీకు కుమారుండు జన్మించును. ఆపుట్టువాఁడు సాక్షాన్నందీశుఁడుగాని యన్యుండుఁగాడు. ఆపుట్టిన బాలునకు బసవండని నామంబునిడుము. నీకు మిగుల శ్రేయంబుఁ గలుగునని చెప్పి యంతర్ధానంబుఁ జెందెను. అంత మాదాంబిక మేల్కాంచి చూచువరకు నెదుట నెవరు లేమింజేసి ఆవచ్చిన జంగమము నందికేశ్వరుండేయని తలంచి ఆవార్తను నిజబంధువుల కెఱిఁగించి పుత్త్రోదయంబునకై వేచియుండెను. అంత మాదాంబికకు ప్రసూతివేదన గలిగి శుభముహూర్తంబున గ్రహము లుచ్చస్థితినుండ నందీశ్వరుండు బాలరూపంబున మోడ్పుజేతులతో బయలు వెడలుచుండెను. అర్ధోదయంబు కాకమున్నే యతనిలో

నున్న సర్వేశ్వరుండు గుప్తాకృతిం దాల్చి యాయుదయించు శిశువును లింగాంగుం గావించి యొక వృద్ధతపస్వి వేషంబున పొడసూపఁ దత్పూతిగా గృహస్థులు నీగతుఁ జొరరాని యీస్థలంబునకు నీజడదారి యెటనుండి యేగుదెంచెను? అని యాశ్చర్యంబు నొందుచుండ నజ్జడదారి మాదాంబికం గాంచి "ఓ సాధ్వీ! నాకుమారుని నీకుఁ గుమారునిగా నొసంగితిని పసికిప్పుడే శైవదీక్ష నొసంగితిని యిప్పటినుండి నేనీతనికి గురువునై యుందును ఇతనికి లింగానర్పితంబగు ద్రవ్యంబు నొసంగవలదు ఇతఁడు లోకహితార్థంబుగా నవతరించిన మహాపురుషుండు నేను కూడసంగమేశ్వరుండను పేర నాగుడియందే యుందును నాయానఁ దాటకుండ"ని జెప్పి యంతర్ధానంబుఁ జెందెను పిదప కోటిసూర్యులు ప్రకాశించునట్లు మిగుల ప్రభలతోడఁ గుమారుం డుద్భవించినంత జననీ జనకులు ప్రమోదాంతరంగులై యప్పుడే భక్తులరాఁబనిచి వారికి నుచితసత్కారంబులు గావించి విభూతి తాంబూలాదుల నొసంగి తత్పాదతీర్థంబును శిశువుపయిఁ జిలుకరించి విభూతిం జల్లించి బసవండను నామకరణంబుఁ గావించి వారికి గోభూహిరణ్యాది భూరి దక్షిణల నొసంగి సాగనంపిరి.

పిమ్మట నాబాలకుండును శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుండై పెరుగుచుఁ జెంజీకటులు వెనుకనుండు నీతేజంబుతో నవసరంబేమసినట్టు దీపంబుం జూచి నవ్వును లింగప్రసాదంబును గుడ్చుచందాన చనుబాలు గుడుచును. శివసుధామృతమును వెళ్లనిముడ్చుకొనునట్లు హస్తములనోటఁ గ్రుక్కుకొనును శివపదధ్యానంబున నిశ్చేష్టుఁడై యుండుచందాన నప్పుడప్పుడులికిపడుచుండును దుఃఖదాయకంబగు సంసారంబు నశ్వరంబనురీతి జేతుల ద్రిప్పును మాయాప్రపంచంబును దూరంబు జేయురీతి పాదంబుల నేలం దన్నును భక్తులకు శరణాగతిం జేయువిధాన బోరగిలంబడుచుండును శూన్యంబైన శివభక్తి తలయెత్తెనన్నట్లు తలనెత్తుచుండును పద్మాసనాసీన వృత్తి నభ్యసించుపగిది గూర్చుండును రెండవశంభుఁడగు నందీశ్వరుండ నేనను రీతి దోగాడుచుండును వీరమాహేశ్వరాచారము ప్రోగయినిల్చెనాయను భాతి నిలఁబడుచుండును క్రమముదప్పకుండ దొల్లింటిమార్గంబున నడుగిడునట్లు నడుచుచుండును ఆడిన శివపూజలే పాడిన శివనామములే గూడిన శివభక్తులతోడనే ఇట్లు పెరిగి సప్తహాయనంబులవరకు సమస్త విద్యలను మఱచివల్లెవేసినట్లు నేర్చి సర్వజ్ఞుండై వెలయుచుండెను.

రెండవ అధ్యాయము ముగిసెను

శ్రీ బసవేశ్వరాయ నమః



శ్రీసంగమేశ్వరాయనమః

# బసవన వివాహము

## (తృతీయాధ్యాయము)

గర్భాష్టమంబున బసవనికి నుపనయనంబుఁ గావించుదమని మాతాపితృద్యుక్తులై తత్ప్రయత్నంబులఁ సేయుచున్నంతఁ బసవేశ్వరుండుఁగని తండ్రితో నిట్లనియెను

ఓ తండ్రీ! నీవు విజ్ఞుండవై ఈశ్వరారాధకుండవయ్యు నిట్లుజడుండవేలయయితివి లోకగురుండగు హరునే గురునిగా భావించుకొనువారికి మఱియొకఁడు మానవుండు గురుఁడని దలఁచుట నరకముగాదా? పూర్వజన్మ సంస్కారంబులను వదలిన పిదప నీద్విజత్వ సంస్కారంబు నొందుట బాలిత్యంబునకు హేతువుఁగాదా? గురుకృపాన్విత జన్మునకుఁ గర్మజననంబు దుష్కర్మంబుగాదా? సర్వపాపవినాశియగు పంచాక్షరీ మంత్రమును జపింపనేర్చి యితరమంత్రంబుల నుపాసించఁదగునా? కర్మబంధంబులఁ ద్రెంపికొని తిరిగి కర్మపాశబంధనుండగుట యొప్పునా? రుద్రాక్ష భస్మాది ముద్రలఁదాల్చి యితర క్షుద్రముద్రలను దాల్పబాడియా? సర్వకర్మలను వర్జించి కేవల వీరశైవదీక్షంగొన్న నన్ను గర్మబంధునిగా జేయుట నీకు ధర్మమా? బ్రహ్మశిరోహారుండగు నీశ్వరుని వశ్యుండనగు నన్ను బ్రహ్మవంశ్యుండని యెట్లందువు? జాతిగోత్రంబు లకంటకఁగురు. జాతు

డగువానికి జాతిగోత్రాశౌచాదియంటెట్లు గలుగ జేతువు? కులనిర్ణయములేని పరమేశ్వరుని భక్తునకేవలమును నిర్ణయింతువు? కర్మవలననే జననమరణాది దుఃఖములు సంభవించుచుండును. (క్షీణే పుణ్యేమర్త్యలోకేవిశంతి క్షీణేపాపే మర్త్యలోకేవిశంతి) పుణ్యకర్మ నొనర్చినను పాపకర్మనొనర్చినను అదిక్షీణించిన పిదప మానవ లోకమునందే జన్మించవలయును కదా! అట్టిగిట్టని పుట్టుకఁగలిగించు కర్మలకన్న జననమరణ సుఖదుఃఖ రహితశాశ్వత నిత్యానందమయస్థానంబు నపేక్షించుట విహితముగాదా? లింగవిహీనుడనగు నాకు వివాహఉపనయనాది కర్మలతో పనిలేదు అని పలికిన తనయునింజూచి జనకుండిట్లనియెను.

ఓ బసవన్నా! బ్రాహ్మణ మర్యాదనాలింపుము బ్రాహ్మణునకు గర్భాధానాది పితృమేధ పర్యంతము పదునారు కర్మలు విధివిహితములైయున్నవి ఆకర్మల యందొక్కటియైనను జేయకపోయిన నాతఁడు బ్రాహ్మణుఁడు కానేరఁడు అకర్మల కారంభంబుపనయనంబే ప్రణవంబు జరమేశ్వరుండుగాఁడా? బ్రాహ్మణుండు పరమేశ్వరు నారాధించగూడదా? ఈకర్మలును పరమేశ్వరనిర్దిష్టములే (నియతంకురు కర్మత్వం) అనునట్లు నియతమైన కర్మల నాచరించకున్న మానవుని మానవత్వము నకు భంగమురాదా? (అవశ్యం పితురాచార) మనిగదా ఆర్యోక్తి మనపెద్దలు నడిచిన మార్గమును మనము నడువకున్న నలుగురు పరిహాసించకుందురా? కర్మవలన భక్తియును సాధించబడగలదు కర్మ నిష్కామమనియు సకామమనియు రెండువిధములు సకామ కర్మవలన సుఖదుఃఖ జనన మరణాదులు గల్గుచుండును కాని నిష్కామ కర్మవలన నెట్టి విపత్తును సంభవించనేరదు. ఇదివరకెంతమంది మహానుభావులు కర్మలను యథావిధినాచరించి యీశ్వరభక్తులుగాలేరు? గడుసుదనంబున నీవాడినపలుకులు పాడికిరావు నీవింకను బసివాడవు మాజెప్పినంత జేయవలయునుగాని యెదురాడవలదు మున్నియాశ్రమలంజెంది నినుగాంచి మేమెంతయో సంతసించితిమి యిట్టి దుర్వాదివగుదువని దలంచలేదు (సుపుత్రస్తు కులేజాతః కులమేకం తరిష్యతి) అనురీతి సుపుత్రునిగనిన కులమెంతయో పవిత్రంబగును కుపుత్రుడుదయించిన వంగడమెల్లయింగలము

పాలగును నీవు మాకెంతో ముదుపుగూర్తువని సంతసించితినిగాని కులవృక్షమును నరికివేయు గుద్దలివగుదువని తెలియజాలకపోయితిని తోడిబందుగులందఱు నన్ను వెలిసేయరా! నలుగురిలో నపహాస్యమునొంది యెట్లుజీవించుదును? నిన్ను గూర్చి కొలఁకులవారిని విడువవగునా? నాయనా! మించినదేమిలేదు జనకాజ్ఞను నిర్వర్తించుట గొప్పధర్మము కావున నీపట్టునువదలి నామాటల నాలించుము వంశమర్యాదలం గాపాడుము నాప్రార్థన నంగీకరింపవేని నాయాజ్ఞను పాలింపవేని ధర్మంబుపై దృష్టినుంచవేని నీభక్తియు నీవు సెంద్దైనబడుదు ఇదియే కడసారి నామాట అని మాదిరాజారకున్నవిని కనుగొలుకులఁగినుకనావహింప జనకుని నిష్ఠురోక్తుల కలరి బసవన యిట్లనియెను.

ఓతండ్రీ! బ్రాహ్మ్యము భక్తియు నొక్కటేయని పెడవాదముసేతువుబ్రాహ్మ్యదర్శనమువేరు భక్తిమార్గము వేరు గురువువేరుదైవము వేరుమంత్రము వేరు ధ్యానము వేరు తంత్రము వేరు గాకున్న నగ్నిముఖంబును, బ్రహ్మశిరంబును, రుద్రుడుశిఖయు, హరియుదరంబు, పంచవాయువులు ప్రాణంబులు, క్షోణియోని, వర్ణము తెలుపు, సాంఖ్యాయన సగోత్రము చతుర్వింశత్యక్షరములు, త్రిపదంబులు షట్కుక్షులు, పంచశీర్షంబులును గలిపిన గాయత్రీ స్వరూపంబగునని మీయాజ్ఞికంబునఁగలదుగదా? ఇదే సాంఖ్యాయనమతము, ఇందీశ్వరుఁడు శ్రేష్ఠుఁ, తాను బహురూపుఁడు దానికాచార్యుండుఁ గర్మజపుండును దానికి మంత్రము గాయత్రి దీనబ్రతినిత్యమును గావించు కర్మయొక సంచయమై నిల్చుచుండునుగదా? కర్మవాసనఁ గలవానికెన్నటికిని మోక్షమబ్బనేరదు కావున భక్తికిని బ్రాహ్మ్యమునకు చాలాదూరముండును ఇఁక షడ్దర్శనాతీతమైన ఈశ్వరభక్తిని వినుము (అణోరణీయాన్మహతో మహీయాన్) (విశ్వతశ్చక్షురుత) ఇత్యాది శృతులచే పొగడ్తఁగన్న సూక్ష్మస్థూల నిత్యానంద నిర్మల నిరామయ శాశ్వత మంగళ ప్రద మూర్తియగు లింగమూర్తియే దైవంబును అట్టి పరమేశ్వర ధ్యానమార్గంబును జూపించి మంత్రంబు నుపదేశించి తద్రహస్యంబు నెఱిగించి యీశ్వరదర్శనంబును కరతలామలకంబుగ గావించెడి (నగురోరధికస్తాత్రీశా) యనబరగు గురుఁడే సకల స్వరూపంబును మంత్రంబులందుత్తమమైన సప్రణవ పంచాక్షరియును, జటాభసిత

రుద్రాక్ష ధారణంబే భవదూరంబగు మోక్షానుకూలవేషంబును భక్త జన చరణ సమారాధనయు నివియే మోక్షప్రదంబులు ఇదియే ఫలప్రాప్తికి సాధనము. ఇవియిట్లుండ లింగపూజ నోత్కృష్ట సౌఖ్యమున కంతయని చెప్పనలవియగునా? అదియే జీవన్ముక్తి తత్వాత్మకమని శృతులు వక్కాణించుచున్నవి కావున భక్తి మార్గంబును గర్మపథంబును వేర్వేరగాని యైక్యమనుట జెల్లదు ఈశ్వరభక్తున కేలాటికర్మముతో సంబంధముండదు అన్యదేవతాస్మరణ మాత్రముననే అష్టావింశతికోటి సంవత్సరములవరకు నరకము గలుగునని ప్రమాణములుగలవు. బ్రాహ్మణుండగుటచే నుదయాస్తమయములయందు సంధ్యోపాస్తిని జేయువలయును అగ్నిష్టోమజ్యోతిష్టోమాది యజ్ఞంబుల నొనర్చవలయును బ్రహ్మవిష్ణు దిక్పాలకగ్రహాదులను గొల్వవలయును అట్లు వారిని నుతింపఁడేని బ్రాహ్మణుఁడు గాజాలడు పూజించెనేని భక్తుడు బ్రాహ్మణుఁడు గాజాలడు బ్రాహ్మ్యంబున మోక్షంబు దొరకదు భక్తికి జాతిగోత్రాది నియమములు లేవు సమయాసమయంబులు సున్న వస్తువ్యయంబుతో బనిలేదు ఈభక్తివలననే ఈశ్వరుఁడు సులభుఁడై శాశ్వత పదంబు నొసంగును విత్తనంబొకటిబెట్టఁ జెట్టొండుగానేరదు కేవలేశ్వరైక్యపథానుసంధానాసక్తి భక్తి బహుదేవతాపూజ బ్రాహ్మణపథము కులసతివలెనే నిశ్చలయుక్తిగలది భక్తి పణ్యకాంతంబోలినది పాఱులత్రోవ గురుకరుణావాప్త మంత్రోపదేశంబునొంది ఆదిదేవుండైన హరుండొక్కఁడే శరణ్యమని దలంచి జటారుద్రాక్ష భసితాది ధారణంబులంగావించి యుత్తమ శైవవేషంబును దాల్చుటయే శ్రేయఃపథము యిలువేల్పయిన తొలువేల్పును వదలి పలువేల్పులుగొలువ పాపంబు గాదా? గౌతమదధీచివ్యాసాదుల శాపాగ్నిచేతప్తులగు భూసురులకు భక్తియొక్కడిది భక్త్యుద్రేకంబుచే నిల్లు బలకెవని దలంపకుము ఇది శృతిస్మృతీహాస సిద్ధంబుగాని కేవలపదక వాదంబుగాదు బ్రాహ్మణ విధంబుకర్మయగుగాక శైవమార్గంబు మాత్రముగాదు. నీవు బ్రాహ్మ్యపథమే నిజమనినమ్మినచో నీతో నాకవసరంబులేదు కాకులుబెంచిన కోకిలపిల్లలు కాకులతోనుండునా? దానింబోలునా? ఒకనికొక్క తండ్రి తల్లి నిక్కవంబా? కొడుకు నిక్కవంబా? ధర్మంబే వేరయినపుడు సంబంధ

బాంధవ్యమ్ము లేమేటనుండును. నాసంబంధులు వేరేనున్నారు చెన్నయను తాతయు చేరమతండ్రియు, కక్కయ పినతండ్రియు, నేను వారిబిడ్డండను మీకును సంబంధ మేలేదు, అని పలికి చూపరులచ్చెరువంద నింటనుండి బయలుదేరెను. సహోదర దుని వెంబడి కారణజన్మము శైవపదసమారాధకయునగు నాగాంబికయుఁ బయలు దేరెను,

ఆసంగతి నంతకమున్న బసవనప్రభుగునకైవచ్చిన మాదాంబికా సహోదరుండును బిజ్జలుని దండనాథుఁడును శివభక్తుండునగు బలదేవుండు విని, తననోము ఫలించెనని సంతసించి తనకూతురును శివభక్తునకుగాక భవికినిచ్చి పెండ్లి సేయ నని ప్రతినబూల్చినవాఁడుఁగావున బసవనన్నిధికేతెంచి యతనిం బ్రసన్నునింగావించి కొని తనకూతురును పరిగ్రహించుటకుఁబ్రార్థించి యొడంబరచి వెంటనే నిజమంది రంబునకరిగి చతురమతులగు పనివాండ్రచే గృహంబును శృంగారించి తోరణ ధ్వజపతాకాదులం గట్టించి వివిధవాద్యంబులు మ్రోగుచుండ భక్తవ్రాతంబును బిలిపించి వారికుచితపూజలంగావించి విభూతితాంబూలంబులనొసంగి శుభము హూర్తంబు నేర్పరించెను.

అంత వేణువీణాది వాద్యంబులను వాదించువారును ఆనందగీతంబుల నెగ్గించు చు శంకర గీతంబులపాడువారును, శివభక్తిమహిమను గొండాడువారును, ప్రత్న నూత్నశివస్తోత్రంబులను సలుపువారును, భక్త్యతిశయంబులచే మ్రొక్కుచు శివా నందమ్మున మైమఱచువారును, తన్మయత్వంబున సుఖసిద్ధింజెందువారును నగుచు నుండ బసవేశుండు జంగమచరతీర్థాభిషిక్తుండై వెలిపట్టుపుట్టంపుగవను మైదాల్చి చాయగా భస్మంబుబూసి నుదుట త్రిపుండ్రంబును శిరంబున బ్రసాదకుసుమంబును ధరించి రుద్రాక్షభూషణంబులంది లింగపసాయితంబను ఖడ్గంబును కేలఁదాలిచి యానందభాష్పంబులు కనుగొలకులనుండిరాల బెద్దలకు మ్రొక్కుచు దీవనలందు చు మర్యాదలంబొందుచు కేవలభక్తి శృంగార రసావతారుండోయన విరాజిల్లు చుండెను. అట్టివానింజూచి బలదేవదండనాయకుండు మిగుల ధన్యమ్మన్యమానుండై దనకూతురగు గంగాంబికను దోడ్తెచ్చి భక్తులకుమ్రొక్కించి శుభమంగళారా వంబులెసంగ శివభక్తవనితలుసేసలజల్ల శివభక్త బలంబెగ్గించు శుభలగ్నంబున

వేదోక్త శివధర్మ ప్రకారము బసవనికిని తనకూతునకును పాణిగ్రహణంబుం గావించెను. ఇదేగదా భక్తనియమంబు శివభక్త బలంబులేమి బ్రహ్మాదులును ద్రుంగుదురు తక్కిన తారాగ్రహంబుల లెక్కయేమి? ఆభక్తుల కరుణగల్గుటయే శుభలగ్నంబు మన బసవనియందు భక్తులయనురక్తిని యుక్తంబైయున్నది యని యెల్లజనంబులుంబొగడ వివాహంబాసాంతంబైనపిదప బసవేశ్వరుండు కప్పడిసంగమేశ్వరంబందుండు గురుని జూడందలంచి తాను నాగమాంబికయును దనజాయయుం గలిసి దండనాథుని పనుపున బయలుదేరి యప్పురంబుంగాంచి సాష్టాంగముగ నమస్కరించి గురుచరణారవిందంబుల నమందభక్తిని డెందంబున బొందుపరచికొని నుతించుచు భక్తికి మూలకందంబితండౌరాయనుచును భక్తనిధానమను దును పుణ్యమూర్తులును శైవపూజా ధురంధరులును అష్టాంగ యోగ నిష్ఠాగరిష్ఠులునగు నప్పురిపెద్దలుబొగడ నప్పురంబుసొచ్చి సంగమేశ్వరు నాలయముఖంబున నిలిచి గురులింగమూర్తి యడుగుదమ్ములకు సాగిలపడిమ్రొక్కి శ్రుతిహితంబులగు నర్థంబుల నభినుతించి నిలిచినంత భక్తవల్లభుండగు గురుతల్లజుండు తొల్లింటి వేషంబునం గనంబడిన బసవన బిట్టులికిపడి తద్దయుం బెద్దయాశ్చర్యంబు భయంబు ప్రమదంబు ఆనందంబు లొక్కసారి యెడలియందు బొడసూప పునఃపునస్సాష్టాంగ ప్రణామంబుల గావించుచు గురుపూజార్థంబుగా తనదేహమునే యొడ్డినచందాన పాదంబులపయింబడి లేవకుండుం గుమారుంజూచి గురుండు మెల్లన లేవనెత్తి కౌగిటం జొనిపి ప్రసాదంబునిచ్చి యిట్లనియెను.

ఓ బసవన్నా! యాతాయాత జనంబులవలన నీసుచరితంబువిని యానందించుచున్నాను నాకొన్ని నుడుగులను ధర్మవచనంబులుగా నంగీకరించుము.

గతకాల వర్తనకంటె సద్భక్తి మిక్కిడప్పి నడువకుమీ బసవన్న
శూలిభక్తాళిదుశ్శీలముల్ గన్న మేలకాగ్రహకొనుమీ బసవన్న
శత్రులైనను లింగసహితులైయున్న మిత్రులకాజూడుమీ బసవన్న
పట్టినవ్రతములు ప్రాణంబుమీద మెట్టినవిడవకుమీ బసవన్న
వేఱుభక్తులజాతి వెదకక్షుండుటయె మీఱినపథముసుమీ బసవన్న

చిత్తజాంతకుభక్తి జెడనాడుఖలుల మృత్యువుగతిద్రుంపుమీ బసవన్న
వేదశాస్త్రార్థ సంపాదితభక్తి మేదినివెలయింపుమీ బసవన్న
తిట్టినభక్తులఁ గొట్టినఁగాల మెట్టినశరణనుమీ బసవన్న
యేదప్పువట్టుదునిలఁ బరస్త్రీల మీఁదఁగన్నార్పకుమీ బసవన్న
సాధ్యమౌ భక్తపరిసాజేతరంబమేధ్యంబుగాజూడుమీ బసవన్న
నిక్కంపుభక్తికి నిర్వాంచకంబు మిక్కిలిగుణమునుమీ బసవన్న
ఏపాద్రిదుజంగమంబేనకాజూడు మీఁప్రసాదముగొనుమీ బసవన్న
యేమైనవలసిన యెడరైనదలవుమీమమ్మమఱవకుమీ బసవన్న
మోసపుచ్చుశివుండు బాసలేమఱకుమీ। సత్యమెడపకుమీ బసవన్న

అని ధర్మోపదేశంబుఁ గావించి తిరోహితుండయ్యెను అంత నచ్చటి జనులచ్చెరువందుచు ఆహా యీగుడియందెన్నఁడును మాకీ తాపసి యగుపడలేదు. ఇతఁడు కేవల మీబసవేశ్వరునికొరకే వచ్చిన శంకరుఁడుగాని యన్యుడుగాఁడు ఇతనివలన మేము ధన్యులమైతిమి కృతకృత్యులమైతిమి అని పరస్పరము సంభాషించుకొనుచు బసవేశ్వరుని బొగడుచుండ నతండు వారితోడంగూడ యిష్టగోష్ఠినిఁ శివకథాలాపంబులను సేయుచు ముప్పొద్దును గురుని పూజించుచుండెను.

శ్రీసంగమేశ్వరాయనమః

మూడవ అధ్యాయము ముగిసెను



శ్రీమత్పరశివాయనమః

# బసవన మంత్రియగు చరిత్రము.



## (నాల్గవ అధ్యాయము.)



అప్పటికాలంబున కల్యాణనగరంబును బిజ్జలుండను జైనధర్ముండు పరిపాలించుచుండెను ఆతనికడ బలదేవుండు దండనాయకుండై యుండియు తన తనయను తన మేనల్లుండగు బసవనకిచ్చి వివాహంబుగావించిన కొలదికాలంబునకే శాశ్వత కైలాసనివాసంబుఁజేయుటకుఁజనెను. అంతట బిజ్జలుండు బలదేవుని బంధుగుల రావించి సన్మానించి కూర్చుండనిచ్చి వారితో నిట్లనియెను "మీబలదేవుండు మాసంస్థానంబున నీతిమంతుండై దండనాయకత్వంబును వహించి కాలధర్మము నొందెను. ఆపదవికిఁ దగినవాఁడాతని బంధుగులెవరైనను లేక. నతని మేనల్లుండయినను సమర్థుండైనచో నీపదవి నంగీకరింపవలయును" అనినవారలో మహారాజా! బలదేవుని భాగినేయుండగు బసవనమిగులనేర్పరి విద్యాధికుఁడు బలవంతుండును కడుపుణ్యుండును, శత్రుక్షమాధర శిక్షణదక్షుండును, నిరుపమానోపాయశాలియును, సంగమేశ్వరకృపాపాత్రుండును, నీరాజ్యంబునంతయును నిష్కంటకంబుగా నొక్కండయేలఁగల సామర్థ్యంబుగల్గువాడును గాన నతనిని తమప్రధానామాత్యునిగఁ గైకొనుట దగునని పలికినవల్లెయని బిజ్జలభూవల్లభుండు నెంతయు బ్రీతాత్ముండై యొక్క మత్తగజంబు నలంకరించి బసవని దోడ్తేరనితర ప్రధానులను తద్బంధువులనంపింప వారలుసంగమేశ్వరంబునకరగి సభక్తిని బసవనికిమ్రొక్కి "దేవా దేవరకింద్రాదిభోగంబుల్లును తుచ్ఛంబుశేయఁగుట మేమెఱుంగుదుము. శివానందంబు

ననుభవించు మహైశ్వర్యశాలికి క్షీణనశ్వరభోగంబులొక లెక్కవిగావు కాని లోక హితార్థము బిజ్జలభూపాలుని ప్రధానమంత్రులై రాజ్యంబును పాలింపుడు అతనిమది నుత్సాహముగూర్పుడు సర్వంబునకు మీరలే యొడయలు మీరు సెప్పిన ట్లేయతండు మెలంగును. గాన విచ్చేయుఁడని ప్రార్థించిన బసవేశ్వరుండును దానేతెంచు కార్యంబునకిది సహాకారియని దలఁచి భక్తబృందంబుల యభీష్టంబులను బూరింప వారిప్రార్థనల నంగీకరించి వారితోడంగూడి కల్యాణంబునకు విచ్చేయుచుండెను.

అంత నిక్కడ బిజ్జలుండును బసవేశ్వరుఁ డేతెంచుట యెఱింగి ద్వాదశ యోజన విస్తారంబగు కల్యాణంబు నలంకరింపించి ఘంటాపథంబులందు ధ్వజపతాకంబులం గట్టించి మార్గంబులందు చందనాగరూ కుంకుమకస్తూరీ ప్రముఖ సుగంధ వస్తువులం జల్లించి ప్రతిగేహాంగణములయందును పచ్చల తోరణంబులును పందిళ్ళను వేయించ నియమించి తాను సామంత మండలాధీశ ప్రధాన బుధజన సమేతుండై భేరీపటహ ఢక్కామృదంగ ఝల్లరీముఖర వాద్యంబులు రోధసీకుహరంబునిండి మునువెనుకల మ్రోగుచుండ జనుదేరి మధ్యేమార్గంబున భక్తిశృంగారుని మారాకారుని తత్వవిచారుని దూరీకృతాహంకారుని దోర్బల విజితారిని పాపదూరుని లింగశరీరుని ముక్తసంసారుని, శివభక్తిసారుని, కుజనవిదారుని సద్గుణమణిహారుని బసవకుమారుని వీక్షించి పాదచారియైచని బసవనిఁగాంచి గాఢ పరీరంభణంబునొనర్చి యుచిత సత్కారంబులఁ బూజించి సప్తశతగజంబులును ద్వాదశ సహస్రతురంగంబులును, ద్వాదశ లక్షపరిమిత పదాతివర్గంబును పండ్రెండుగుర నుపమంత్రుల నొసఁగి తానేలు రాజ్యంబునను ప్రధానామాత్య పదవి నొసంగి గౌరవించి బిజ్జలుండు బసవదండనాయకునిగూడి పురంబున కేతెంచుచుండ నాగరాంగనలు సౌధాంతరాళంబులనెక్కి వారి చెలువంబులం దిలకించుచు చోద్యమందుచు బసవని మహత్వంబును వర్ణించుచు విరులను జల్లుచుండిరి. పుణ్యాంగన లెదురేగి మంగళారతులనిడి స్వస్తివాచనంబులం జెప్పుచుండిరి వందిమాగధులు స్తుతిగీతంబులం బాడుచు కైవారంబులం జేయుచుండిరి.

ఇట్లు జనుదెంచినపిమ్మట బిజ్జలభూపాలుఁడు బసవేశ్వరుని మునుపున్న

పండ్రెండ్రుగురు ప్రధానులకన్న మిన్నంజేసి వెలుఁగలుఁ గడానిగద్దెపై జలతారి పట్టుబట్టంబరిపించి బసవనంజూచి "ఓమహానుభావా! ఇదే నీసింహాసనంబు నధిష్టించి నారాజ్యమును నిష్కంటకంబుగాఁ బాలింపుము. నారాజ్యమును ప్రజలును నేను త్వయధీనులమై వర్తిల్లుదుము వేయేల నీవ నేను నేన నీవు మనయెడ, భేదంబుండఁ గూడదు నిన్నే సర్వంబని నమ్మియున్నాను అనవిని వినయంబెనయ బసవదండేశుండు నిట్లనియెను ధరారమణా! నిన్నుఁగాపాడుటకు నేనెంతటివాఁడను సర్వంబునకు కర్తహర్త యీశ్వరుఁడున్నాఁడు వానిభక్తులను మాత్రము దిరస్కరించకుము వాఁడే నినురక్షించును వానినిర్హేతుక జాయమాన కటాక్షంబుండినఁ జాలును. సమస్త ధరామండలంబునకు చక్రవర్తిఁజేసి పరిపాలింపించెదను అని యూరటబల్కి యించుక సేపు యిష్టగోష్ఠి ముచ్చటలు సలిపిరి పిదప రాజు బసవనికి సముచిత వస్త్రాలంకారంబుల నొసంగి వీడ్కొల్పెను. మంత్రిపుంగవుండు బలదేవుని యాలయంబులన్నియును తన కావాసంబులుగాజేసికొని శత్రువులకు భయంకరుండై నిష్కంటకంబుగా రాజ్యంబును బాలించుచుండెను.

శ్రీమన్మంత్రీశ్వరాయనమః

చతుర్థాధ్యాయము ముగిసెను.



శ్రీనందికేశ్వరాయనమః

# బసవనిసన్నిధికి శరణజనమువచ్చు చరిత్రము



## (పంచమాధ్యాయము)



శ్రీ బసవేశ్వరుండు మంత్రిపదవి నధిష్ఠించి రాజ్యంబును బాలించుచుఁ దన సౌశీల్య సదాచార సద్భక్తి సద్వివేక సద్గుణాదులచే నెల్లరఁ బరితృప్తులఁ గావించుచు సకలదేశంబులందును విశదయశంబులంగాంచెను అతండు దన నిత్యకృత్యంబులందీ నడివడికను గావింప బ్రమాణంబులంగావించుకొనెను. నిత్యంబు శివరాత్రి వ్రతంబు నాచరించుటయు, శివభక్తులను శివరూపంబునఁ దలంచుటయు, భక్తుల కెగ్గు దలఁపక వారి జాతిగోత్రంబులను విచారించకుండుటయు, శివునైన నొకటి యడుగకుండుటయు, తన్నడిగినదానిని లేదనకుండుటయు, చీమనేని వంచింపక దాఁదలచిన కార్యమును విడువకుండుటయు, సత్యంబును నడిపించుటయు, దానడచుటయు, బీరువోకుండుటయు, తప్పులు నడవకయు, నడిచినవారిని శిక్షించుచుండుటయును, తనపనులయందరమర లేకుండుటయు, కలనైనను శివునకుగాని మోడకుండుటయు, పరసతీ పరధనంబులపై దృష్టినుంచకుండుటయు, పరనిందా పరమర్మకర్మలందు మనంబును బోనీకుండుటయు, పరసమయంబులను పరవాదులను, నిరఁసించుటయు, హరదూషణలను వినక హరగణానర్పితంబు నంటక హరగణ పర

తంత్రుండై శివభక్తు లెట్లన్న నట్లనుచుండుటయు, జంగమంబే ప్రాణలింగంబని యెంచుటయు, భక్తికి మొక్కక ఆతనికేమియు నిడకుండుటయు, సంసార తాపంబులం జిక్కకుండుటయు, విషయేంద్రియంబులం జొక్కక నరిషడ్వర్గంబులం జయించుటయు, ఇత్యాది గుణంబులచే శోలంబుచుచు ధైర్యంబునకు గట్టయై గంభీరంబునకు దిట్టయై జ్ఞాననిధియై ప్రతిజ్ఞా పాలుండై భక్తిలోలుండై వేదాంతంబుల పాటియై విద్యల మేటియై శాంతశమదమాది గుణపరిశిష్టుడై యొప్పారుచున్నంతంగొందఱు శరణజనోత్తములు బసవండు కేవల మనుష్యుండుగాడు. అతని దర్శనంబు పాపకర్షనంబని గాంచనేతెంచువారును వ్రతములను జెల్లించవచ్చువారును బసవని దర్శించం బశుపతి దర్శనంబగుటకు సాధనంబగునని వచ్చువారునై రథగజతురగ శిబికాది వాహనంబుల నధిష్టించి వివిధవాద్యంబులు మోయ నేతెంచుచుండ మంత్రిపుంగవుండు హర్షపులకితాంతరంగుండై వైభవంబలరవారి నెదిగొనుచుభయ భక్తియుక్తులచేసానునయవాక్యంబులచేపూజించుచు తదంఘ్రిరేణువుల శిరంబునం దాల్చికొని పాదతీర్థ గ్రహణంబుసేసి వారినందఱిని యాదరించి దనయింట విడిదిసేసి వివిధ మృష్టాన్నపానంబులం దనిపి తను మనోధనంబులం గైంకర్యంబు సేయుచు తత్ప్రసాదంబుల స్వీకరించుచు వారివలన శివరహస్యంబుల నెఱుంగుచు వారేది యడిగిన నద్దాని నొసంగుచు వారితో నిష్ఠాగోష్ఠిని మెలంగుచుండెను. ఆశరణజన శిఖామణులును బసవేశ్వరుని యత్యుత్తమ భక్తికిమెచ్చి ఆనందించుచుండిరి

ఇట్లు బసవండు శరణ సపర్యలం గావించుచు పండ్రెండువేలమిండజంగమంబులకు వేశ్యలను సంపాదించియిచ్చి వారికనుగుణ్యవస్త్రాలంకారాదులనొసంగి ముప్పూట సమస్తపదార్థంబులగొనుపుచు తృప్తులంగావించుచుండెను.

అప్పుడు కల్యాణ పట్టణంబంతయు భక్త సంజుష్టంబై ప్రమథగణ సేవితంబైన సాక్షాత్కైలాసంబునుబోలి ప్రకాశించుచుండెను.

సర్వేభ్యో శ్రీభాగవతేభ్యోనమః

అయిదవ అధ్యాయము ముగిసెను.



శ్రీజగత్ప్రభవే నమః.

# అల్లమప్రభునకు బసవేశ్వరుడు విందొసంగు చరిత్రము.



## (షష్ఠాధ్యాయము)



బసవేశ్వరుండు ప్రతినిత్యము భక్తసమారాధనము గావించుచుండు నెడ సాక్షాదపరరుద్రుండు సుగుణసముద్రుండును నిర్మూలితదుర్మలుండును సర్వకర్మవివర్జితుండును, వైరాగ్యనిధియు, దూరీకృత సంసారుండును, జితారిషడ్వర్గుండును సమలోష్టాశ్మకాంచనశత్రుమిత్రస్వర్గనరకసుఖదుఃఖప్రేమాప్రేమసుజనదుర్జనుండును సుషుప్తిదూరుండును, సంకల్పవికల్పకాలమహేంద్రజాలప్రపంచ నిర్మూలకుండును పరశివానుభవుండును, అంతరయోగియు, నిరంతరభోగియు, అనంతవేదాంతవేదియు, శుద్ధసత్త్వబోధియు, శరీరియు నిశ్శరీరియు, నామియు, నిర్నామియు, శబ్దియు, నిశ్శబ్దియు, ద్వైతాద్వైతక్రియాతీతయోగాన్వితుండును, కరస్థలవిభ్రాజితలింగ నిరీక్షణానందకేళియునగు అల్లమప్రభుండు బసవనిఁజూడనేతెంచు నెడ మార్గంబున నిదిచెట్టు యనియు నిదిగుట్టయనియు, మిట్టపల్లంబులనియు, నదీతటాకంబులనియుఁభ్రాంతి లేకుండెను. అట్లువచ్చు నిశ్చలాత్మునకు వెరచిపాయలైయవి చక్కనిమార్గంబులగుచుండెను. ఇట్లు వేగంబునవచ్చు ప్రభునిసంగతిని తెలిసికొని బసవండెదురేగి ప్రదక్షిణనమస్కారంబులనొసంగి సంగమేశ్వరునియందువలె నిశ్చలభక్తినుంచి దోడ్తెచ్చి కడానిపీటపయింగూర్చుండఁబెట్టి మేనజీవమున్నను నిర్జీవునిభంగి కన్నులున్నను గ్రుడ్డివానిరీతి సచేతనుండయ్యును నిశ్చేతనునిభాతి, గుణియయ్యును నిర్గుణివలెలింగ

గళప్రాణుండై తత్త్వాతీతుండైయున్న ప్రభువర్యునకు పునఃప్రణామంబులంగావించి శ్రీపాదంబుల కభిషేకంబులగావించి తత్తీర్థంబును గ్రహించి పూజించి మంగళార తుల నొసంగి కడాని మేల్పళ్లెరంబునుముందిడి వండిన పదార్థంబు లెల్ల నంచుంచి లింగార్పితంబు గావించి మెల్లమెల్లన నొక్కొక్క ముద్దనందియ ప్రభువందికొనుచు నారగించుచుండెను.

అట్లారగించుచుండ లక్ష నెనుబదివేల జంగమములకొరకు ప్రయత్నంబు జేసిన బ్రసాదంబంతయును, ప్రభుండే యారగించిన మంత్రియును జలింపక నికముందు దన దేహమునే ప్రభువునకర్పింప నెంచి యుద్యుక్తుండైయున్నంత నతనిభక్తికి మెచ్చి ప్రభువు బసవనంజూచి "భళీ! బసవన్నా! భక్తుడవన్న నీవకాని యొరులుగారు నీకీర్తియనశ్వరంబు, అమృతంబునకు చేగయు మాణిక్యంబునకు దీపంబును చెఱుకునకు పండు దనంబును, పైడికి కమ్మదనంబును చందనంబునకు బువ్వును, బుట్టినయట్లు నీవే నిక్కంపుభక్తికి నిలయంబవై పుట్టితివి నాముద్దుల బసవన్నా! దండనాయకా! భక్తులపాలిటకల్పద్రుమంబా! కల్మషవిరహితా! జ్ఞానస్వరూపా! పండితసత్పాత్రా! జంగమనిదానా! సత్యవిధానా! తత్త్వమహత్త్వనిత్యసత్యస్వరూపా! వృషభావతారా! పరంజ్యోతీ! వివేకషట్టీ! త్వరితగామియగు జలంబునకొడలెల్లగాళ్లున్నట్లు వడిగంగాలుచిచ్చునకొడలెల్ల నోళ్లున్నట్లును, త్వరగా వీచు వాయువునకొడలెల్లతలలున్నట్లో బసవనా! నీదేహమంతయు భక్తియేనిండియున్నది బసవా! యనినంతమాత్రముననే బాలురకు పశువులకును పక్షులకును చెట్లకును గుట్టలకును వేయేలనాపరమేశ్వరునకుంగూడా భక్తియంకురించును, విషమమృతమగును వజ్రంబు పుష్పంబగును, శత్రువు మిత్రుడగును, కార్చిచ్చు వెన్నెలయగును నీయందున్నలింగైక్యకేళీలోలభక్తియు జంగమప్రాణానుసంధానశక్తియు ప్రసాదభక్తియు, మూడులోకములయందెవరియందైననుగలదా! నీవుజగంబునుద్ధరింప నవతరించు నందీశ్వరుండవుగాని మానవమాత్రుండవా? నిన్నుంగన్నులార గన్నవారికి నరకంబులున్నవా? యని పెక్కుభంగుల నుతించుచున్న యల్లమ ప్రభుని

గాంచి భయభక్తివినయంబులెసఁగ నమ్మంత్రి పుంగవుండతనికిమ్రొక్కి "ఓభక్తవత్సలా ! సర్వజ్ఞ ! సర్వదర్శీ ! పరమాత్మస్వరూపా ! గురులింగజంగమా! ప్రమథవరేణ్యా ! నీవిట్లు నన్నాగ్రహించుట భవదీయప్రేమవిశేషంబేకాని నాకృత్యంబేమియు లేదు దేవరకారగింపిడి సంతుష్టులంజేయ నాకుసమర్థతగలదా? తొల్లిపార్వతీదేవి యొకనాడు శంకరరూపధారులగు ప్రమథులంగాంచి యందునిజభర్తను గనుంగొనలేకఁగింకర్తవ్యతామూఢయై యాజగన్నాథుని నుతింపవెంటనే యతని సెలవైన ప్రమథులు దమతమరూపంబులగు గోవ్యాఘ్రసూకరవలీముఖసర్పజంబూక శ్వాన గృధ్రకాకమహిషాశ్వగజశరభాదిము ఖైకముఖద్విముఖైక పాదద్విపాదాదివేషంబులఁ దాల్చిరి అంతనయ్యుమసంతసించి వారికివిందువెట్టుదునని మగనినడిగియనుమతింగొని మహాకాశంబనెడి బయల తత్వంబనెడి పందిళ్ళవేసి సకలాజాండంబులను భాండంబులందు వివిధపక్వాన్నంబులంగూర్చి కల్పవృక్షపల్లవంబుల దివ్యామృతంబున దాలించి క్షీరేక్షురదధిఘృతవార్ధులనుండి క్షీరేక్షురసదధిఘృతంబు స్వీకరించి చింతామణివలన పదపదార్థంబులజిత్రించికామధేనువువలన వస్తుసముదాయంబునుగొని యొకచోఁగూర్చుండఁబ్రమథులునొకకుజ్ఞవానింజేరినాయనా! మనకీవేళ పార్వతీదేవివిందువెట్టునట వంటలయ్యెనోలేదో చూచిరమ్మన నగ్గడుసుబాలుండు యుమకడకువచ్చి తన్నంపిన కారణంబునుదెలుప నాతల్లియును , కుమారా! పదార్థంబులన్నియు సిద్ధపడినవి నీవేగి మీవారిఁదోలుకొనిరమ్మన నాపృథుకంబోయమ్మా ! నాకాకలి మిక్కుటంబుగ బాధించుచున్నది పట్టెడంత యన్నమును బెట్టితివేని నేనారగించి వారిం దోడ్తెత్తును. వారందరును గూడువరకు నాలస్యంబగుననిన ధరాధరాత్మజయట్లే గాకయని లింగార్చనంగావించి విస్తరివేసి వడ్డించిన నాబాలుండు కులగిరులబోలి ముద్దలంగట్టి ప్రమథులకొఱకుగావించిన సకలపదార్థంబులను , త్రుటిలోసమాప్తము గావించెను . అదిగాంచి పార్వతియచ్చెరువంది యింకేమిసేతును, ప్రమథులెల్లరు భుజింతురని యింతపదార్థంబును స్వీకరించితిని దానినంతయు నీబాలకుండొక్కండే యారగించెను. ఇఁకముందు వారికేమిబెట్టుదును అని చింతించి తనవిభునివద్దికేతెంచి నందనంబిడి జరిగిన వర్తమానంబునువినిపింప నాతవుడుదరహసితవదనుండై "ఓదేవీ! ప్రమథులశక్తిసామర్థ్యంబులనువర్ణింప వేదములు గడగడవడకును, వారక్షు

యులును అనపాయులును మహిమావంతులును, జరామరణశూన్యులును వేదాంత వేద్యులును లింగాంశసంభూతులును, లింగమూర్తులు మహాలింగైకతనులును లింగాశ్రియులును, ప్రాణలింగసంగతులును లింగసదర్థులును, లింగానుభవులును, లింగసత్ప్రాణులును, వేయేలనేనేవారును వారేనేనైయుందును, ఒక్కప్రమథుండలిగెనేని సర్వబ్రహ్మాండంబులును నశించిపోవును బ్రహ్మాదాదులొక లెక్కయా? వారిమహిమను వర్ణింపనాతరమౌనా! అని శంకరుండు ప్రశంసింప శాంకరియును చకితమానసయై యుట్టివారికి నేనువిందుబెట్టుదునా? యని మిన్నకుండెను గావున నోప్రభూ! దురితహారా! దూరీకృతసంసారా! శుభకరా! నిర్మలాకారా! సర్వశరణ్యా! నీకువిందుపెట్టనాతరంబగునా! యని పెక్కుభంగులనుతింపనాలకించి యల్లమప్రభుండు మెల్లన తనచల్లనిచూపుల బసవనపయిబఱపి నాయనా! సురభిచింతామణుల కోరులవరంబులవసరంబులా? కాని నాయనుగ్రహంబున నీతలంచిన పదార్థంబక్షయంబుగాఁజేకూరవలయును, పలికిన వాక్యంబు పాటిగావలయును ముట్టిన బయలైనను మూర్తిగావలయును మెట్టినమార్గంబు దిట్టంబుగావలయును మెదిచ్చిన శివునైన గెలువవలయును మొట్టిపరీక్షలయందైన నెగ్గవలయును అని పలికి తత్త్వార్థంబుల నుపదేశించి మోహవిభ్రాంతుల గెడపించియు ప్రాణలింగంబున లీనంబుగావించి శివభక్తిమార్గంబున మిక్కిలి జిక్కించు దివ్యానందసుఖంబొనఁగూర్చిన నబ్బసవండు ప్రభూపదేశంబున చందనంబునకు కర్పూరంబలవినట్లు బంగారంబునకు పరిమళంబబ్బినట్లును యనుభవజ్ఞానియై మిగుల బ్రకాశించుచుండెను ప్రభువును తిరోధానుండయ్యెను.

ఆఱవఅధ్యాయము ముగిసెను.



శ్రీమత్పరశివాయనమః

# బసవేశ్వరమహిమావర్ణన చరిత్రము.

## (సప్తమాధ్యాయము)



బసవేశ్వరుండు భక్తిసామ్రాజ్యంబునం దోలలాడుచు నిరత జంగమార్చనంబుల గావించునెడఁ గొందఱు బందిపోటు దొంగలు దండనాయకునింట బందివెట్ట నూహించి కృత్రిమ జంగమ వేషధారులై లింగవంతులుగానిది ప్రధానమంత్రి యిలుసొరరాదనియెంచి వంగకాయలంగొని మెడలో లింగములుగాధరించి యేతెంచ బసవనిఁజూచి గుండెలు గుభిల్లుమన భయంపడి మ్రొక్కి నిలిచిన మంత్రీశ్వరుండు వారిఁజూచి నగి లింగవంతులుఁగాని వెంగలుల కీశ్వర మందిరంబును జొరవచ్చునా? భక్తులై లింగపూజన సేయుడు గూర్చుండుడనిన నమ్ముచ్చులు దిగులుఁజెంది యొండొరుల మొగంబులఁజూచికొనుచు మన పాపంబున మనమే కట్టువడితిమి ఇకమనకు జావుదప్పునా? మఱలిపోవచ్చునా యని గలంగుచు గూర్చొని పూజావసరంబుల లింగవంతులుంబోలె కరంబులసాచుడు గట్టుగొంగుల నున్న వంగకాయలు లింగంబులయ్యెను.

ఔరా! బసవేశుని తలంపు! మున్నిట్లె బల్లేశుని మల్లయ్యయను భక్తుఁడు వ్యవహారంబునకేగి సాయూరలింగంబు లేకున్నంగాంచి సంతత లింగసంస్పర్శన

నియమంబుగ లాడు గావున నచ్చోట నొక పూరిగుడిఁబన్ని తాఁగొల్చు మానుకను లింగంబుగాఁబెట్టి పూజించి విడిదికివచ్చి భుజించినంతఁదోడి వారుకొందఱు ఆహా! మల్లని యుపాయంబేమి? ఆకటఁ జచ్చుచు నుపాయంబునుబన్ని కుంచమును లింగమనిపూజించి భుజించినాడు ఆకుంచమునుదీసుకరండు ధాన్యమును గొల్వవలయును అని పరిహాసముగాఁ బలికిన వారిమాటలనువిని మల్లయ కోపించి "ఓసుంతలారా! లింగమూర్తిని గుంచముగా భావించుచున్నారా! శివుఁడొక్కచో నుండిమరొక్కచో లేఁడా? (సర్వంఖల్విదంబ్రహ్మ నేహనానాస్తి కించన)అనిశ్రుతులుఁ జెప్పుచున్నవి(యాదృశీభావనాయత్రసిద్ధిర్భవతితాదృశీ) అనునట్లు మనభావమెట్లున్న నట్లేసిద్ధించును మీరాకుంచమునులింగముగాభావించుచులేరా! చూపించెదనురండు అచటసాక్షాత్పరంధాముఁడున్నాఁడు అని పలికి వారినిగొనితానొనర్చిన పూరిగుడిశ వద్దికివచ్చువరకు నయ్యది స్ఫటిక ప్రాకార గోపురముఖమంటపములతో స్వర్ణ శిఖరంబులతోఁ బ్రకాశించుచుండెను. ఆగుడిలో నెదుట వృషభంబును లోన లింగంబును గనఁబడెను. అప్పుడు వారందఱాయద్భుతంబున కాశ్చర్యంబు నొందిరి.

మఱియు కాటకోటండను గొల్లండొక యేటియందు పెంటిక్రను తన యీశ్వరుఁడనితలఁచి మందలంబితుకు పాలనెల్ల నాపెంటిక్రపైఁ బోయుచుండిన వానితండ్రి కోపించి గేలిసేయుచువచ్చి యాపెంటిక్రం గాలందన్నెను. ఆగొల్లండు కోపించి నేలంబుడి పొరలిపొరలి యేడ్చి యట్లే లేచి తన కేలనున్న గొడ్డలిచే తల నరికి కొనెను అంతఁ గైలాసంబున ద్వారంబులు ఝుర్ఝురితంబులైపడి యెల్ల రాశ్చర్యంబునొంద నాగొల్లండు కైలాసంబుఁ జేరెను పెంటిక్రయును లింగంబై ప్రకాశించెను. గాన భక్తులభావంబేకదా పరమేశ్వరునకు జన్మస్థానంబు వారి భావంబు ననుసరించి యీశ్వరుఁడుసంచరించును (భక్తువెంబడి నేను ప్రబలి సంచరియింతు గోవువెంటదగులు కోడెభంగి) అనురీతిని (అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే ♦ తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమంవహామ్యహం) అని పరమేశ్వరుని వాక్యముగలదు కావున బసవేశుని మహాత్మ్యమున నిది యెంత గొప్పకార్యము? (అనాదరేణశాఠ్యేన చిత్తవిభ్రమణేనవా ♦ స్మరేద్యః పురుషో లింగం సద్యోముచ్యేతకిల్బిషాత్) అనాదరముచేతనైనను శఠముచేతనైనను

నైనను, భయముచేతనైనను, శివునిదలంచినవారికి ముక్తిదొరకును (అనిచ్ఛయాపి సంస్పృష్టోదహత్యేవహిపావకః) అను నట్లగ్ని హోత్రము యిష్టములేక స్పృశించినను కాల్పకమానదుగదా? యట్లే పరమేశ్వరుం డొనగ్చను అట్లె బసవండును దొంగలను భక్తులంగావించి యభిమతంబుల నొసంగి పంపించెను.

మఱియొకనాఁడు బసవన స్నానంబుఁ జేయుచుండునెడ నొక శరణుండు వచ్చి "ఓబసవనా! నాలింగపూజనకు ముక్తాచూర్ణంబు కావలయును నీవిటనుండి కదలకయే గాని నాకొసంగుము ఇప్పుడు పదిపుట్ల ముత్తియములు నిప్పించితేసి చాలును" అని పలికిన మంచిదని లింగపసాయిత శస్త్రంబును కేలఁగొని ముంగల నున్న జొన్నలరాశిజూచిన ముత్తెపుపోగై కనబడినఁ గసి నవ్వుచు "ఓ శరణవర్యా పదిపుట్లేమిలెక్క వలయునన్ని ముత్తెములం గొనిచనుము" అనిన బసవని యద్భుతకృత్యంబునకు విస్మయంబందుచు తనకు వలయునన్ని ముత్తెములంగొనిచనెను.

ఇట్లే మున్ను మొఱదట వంకయ్యయను భక్తునింటికొక భక్తుండు నడిరేయి విచ్చేసిన వంకయ్య యాభక్తునకు నమస్కరించి పూజలఁగావించి యుచితాసనంబునఁ గూర్చుండనిచ్చి సముచితాలాపంబుల నాడుచున్నంత నాభక్తుండిట్లనియెను "ఓ మహాత్మా! నేను లింగపూజ గావించుకొనవలయును నాలింగపూజనకొక్క నేమంబుగలదు. యొక్క మొదవుపాలును, యొక్క చెట్టుపత్రియును కావలయును పూజావేళ మించిపోవుచున్నదనిన వల్లెయని వంకయ్య యొక్క గొడ్డావును యొక మారేడు మొరడునుదెచ్చి యాయావునకు బిందెడు పాలను బితికి యామొగడునకు వలయునంతఁ బత్రి గోసియిచ్చెను ఆశరణుండా యద్భుతంబున కాశ్చర్యంబునొంది లింగపూజ గావించుగొనెను. ఇది తొల్లింటిముచ్చట గాని నేడుమన బసవేశుని వలన నిట్టికార్యము ప్రత్యక్షముగా గంటిమనికొని యచ్చటివారంద రాశ్చర్యంబునొంది బసవని వినుతించుచుండిరి.

అద్భుత కార్యాయనమః

ఏడవ అధ్యాయము ముగిసెను.



శ్రీసంగమేశ్వరాయనమః

# బసవేశ్వరునిసంగమగురుడుమూడవకన్ను నడుగుచరిత్రము.



## అష్టమాధ్యాయము



బసవేశ్వరుండు భక్తులుగోరినవస్తువులఁగూర్చి యిచ్చుచుండుట జూచిసంగమేశ్వరుండుబసవేశ్వరునివలన దానొక్కకోరిక నీడేర్చుకొన దలఁచి జంగమరూపంబున మంత్రికడకువచ్చి యతనిచేఁ బూజింపఁబడి నాకు మూడవకన్ను గావలయును నీవు భక్తులేదియడిగిన నద్దానిని లేదనక నిచ్చు మహాదాతవు గాన నాకోర్కె నరమర సేయక నీడేర్పుము అని యడిగిన బసవండత్తెఱంగెఱింగి లింగపసాయిత ఖడ్గంబును గేలంగొని "ఓదొంగా! నీమాయ నేనెఱుంగలేదనుకుంటివా? ఇదిగో యీ యద్దంబుఁజూడుము అని లింగదర్పణంబుఁ జూపించిన నందు దన మూడవ కన్నగుపడినంత నద్దేవుండు లజ్జించి యదృశ్యుండయ్యెను. అంతఁ బసవండులేచి "ఓ స్వా మోసకాడా! పారిపోకుమునిలువుము నీవలన నాకుగావలసినపనేమియు లేదు నాసత్యనిష్ఠను నీవెఱుంగవు కాబోలును. సిరియాళుంబోలి కొడుకునడుగను కరికాలునట్లు కనకవృష్టి నడుగను కుమ్మర గుండయ్యనుబోలి మిండపాయంబునడుగను లేక స్వర్గాపవర్గంబుల నిమ్మనను నీభక్తులయిండ్లముంగిటంబడిన ప్రసాదంబేజాలును అదిమేగలకాలమునకు గరువుగాకయున్నది ఓసర్వఘక్తాంతర్వర్తీ! నీకు జలకంబులర్పించుఁ గాటకోటయ్యయు, భవదీయమాలాకారి పుష్పదంతుండును మాపూజారి

కన్నప్పయు, దీపంబు నొసంగు నమినందియు దీపించి విభూతింబెట్టు పిళ్లెనాయనారును గంధము నర్పించు యేణుమూర్తియును, దూపంబునొసంగుమాచయ్యయు, గంట వాయించు నోహిళుండును, నీరాజనంబునొసంగు సోముండును, వంటచెఱుకులనిచ్చు మారయ్యయు, బానసమునది సంగళవ్వయు, పళ్ళెరమిడు కరికాలచోళుండును, కావటివాఁడు హొన్నయ్యయు, ఓగిరంబుల వడ్డించు చెన్నయ్యయు, ఆరగింపఁబెట్టు వీరచోడాంబికయు, అడసంబెత్తు రేచయ్యయు, వైద్యుండు నాట్యనమిత్తండియు, వేడీడు కల్లిదేవయ్యయు, పురోహితులు సామవేదులును, పౌరాణికుడు మాయిభట్టును, పరిహాసకుఁడు కళియంబనారును, పాఠకుఁడు వాగీశ నాయనారును, ఆస్థానకవి శ్రీపతి పండితుడును, పండితుఁడు పండితుఁడును, వీణాపాఠకుఁడు మాదిరాజును, నాదరసజ్ఞుఁడు శంకరయ్యయు, వ్రాయసకాఁడు కేశిరాజును, దండనాయకుఁడు జగదేవుండును, ప్రధానమంత్రి గణనాథుండును, నీప్రభువగు ప్రభువును, గజసాహిణి యిఱునతుఁడును, అశ్వసాహిణి చేరరాజును, బంటగు శంకరదాసును, చక్రరక్షకుఁడు సేనాధినాథుఁడును, సుంకరిమంచయ్యయు, వేత్రహస్తుండు సుంకేశ బంకయ్యయు, దాది జజ్జమ్మయు, మంత్రవాది రుద్రయ్యయు, వినోదకాఁడు కక్కయ్యయు, బోగకాఁడుశివరాత్రి సంగయ్యయు, కింకరుడుదాసయ్యయు బచ్చువాఁడు కిన్నరబ్రహ్మయ్యయు, సేద్యకాఁడు మడివాలు మాచయ్యయు, దివ్వెలవాడు కడుమలనంబియు, ఉప్పరిగోడల మల్లయ్యయు, కుమ్మరి కుమ్మర గుండయ్యయు, వేటకాఁడుజొమ్మయు, అమ్మలవాఁడిల్లహణబొమ్మయ్యయు, పాలుబిదుకు వంకయ్యయు పాలుఁగాచుగొడుగవ్వయు, మొదలగునీని యోగంబున మెదలుభక్తులందఱునునావారలై యుండ నాకేమిటనుకొఱంతలేదునీకేమైన వలయునేని యడుగుము నేనిచ్చెదను ప్రమథుల యానసుమా! పారిపోకుము నీవు విసము మెక్కకమున్న పురములం గాల్పకమున్న గౌరీకల్యాణముఁ గాకమున్న, బ్రహ్మాండములు బ్రబలకమున్న అంతంతకమున్న నాకును నీకును చుట్టరికంబు నేను నీకుబంటును నీవునాస్వామివి యేల భయంపడెదవు, రిచ్చపడెదవు, మ్రానుపడెదవు, ఆయాసపడెదవు, అని పల్మారుపిలిచినను సంగమేశుండగుపడమి విసికి యెప్పటియట్ల భక్తజన పూజా

ధురీణుండై యుండెను

పిదప నొకనాఁడు బసవేశ్వరుఁడు బిజ్జలుని కొలువుకూటంబునఁ దన యాసనంబునఁ గూర్చుండి "ఓడకోడకు" మని కడవనెత్తునట్లు బాహువులం జాపిన బిజ్జలుండునవ్వి "ఓ బసవన్నా! నీకేమి పిచ్చియెత్తినదా? లేక బత్తి తలకెక్కినదా? ఇసుమంతఁబూడిద నుదుటఁబూసినఁ గొండంత మరులుగల్గెనన్నట్లాయెను ఈనిండుకొల్వున సిగ్గైనలేక "ఓడ కోడకుమని కూసితివే! ఆబాహువుల సాచుటయేమి? స్వగుణోత్కృష్టతఁజూపుట నగుబాటుగాదా? యనిన సచివశేఖరుండు నిట్లనియెను ఓరాజా! త్రిపురారిగుడికిఁ దూర్పుననున్న గపిలేశ్వరమునందొకతపసి లింగమునకు బ్రతినిత్య మాఱుపుట్ల పాలచేత నభిషేకమును జేయుచున్నాఁడు ఆపాలు కాలువగట్టి మార్గములందు రథగజతురగ మానవుల పదఘట్టనలచేత నడుసు మెండయ్యెను ఆత్రోవనొక గొల్లెత చల్లనమ్ముచుఁబోయి కాలుజారి నేలఁబడఁబోవుచు "బసవన్నా!" యని నన్నుబిలిచెను కావున దానిని గ్రిందఁబడనీక తక్రఘటంబును లేవనెత్తితిని మీరిచ్చగించిన యథార్థమును గనుఁగొనవచ్చును అని యాగొల్లెత నివాసంబును జెప్పిన రాజభటులు సత్వరఁబపోయి యాగణికఁ గొనితెచ్చి రాజసమ్ముఖంబునంబెట్టిన నయ్యది జరిగినవర్తమానంబంతయుఁ బసవన జెప్పినట్లేజెప్పి యిట్లనియెను ఓరేడా! ఈమహాత్మునకిదియొక లెక్కయా! ఇతఁడు కేవల మీశ్వరుండే! ధర్మ సంస్థాపనకొరకై నిలనవతరించినాఁడు నేను మున్నొక్కనాఁడు సొన్నలాపురి కేగితిని. అందు సిద్ధరాముఁడను భక్తోత్తముఁ డొక్కఁడున్నాఁడు అతండు బ్రత్యక్షముగ మల్లికేశ్వరుని శ్రీగిరినుండి గొనితెచ్చి లక్షతొంబదివేల లింగంబులతో సొన్నలాపురమునందు బ్రతిష్ఠించి మర్త్యలోకంబునందలి యాహారంబుల నొల్లక నిరాహారుండై యష్టాంగ యోగనిష్ఠాగరిష్ఠుండై సమాధ్యంతంబున గైలాసంబున కేగుచు నట తత్త్వరహస్యంబుల నెఱుంగుచు వచ్చుచుండును ఆతండొకనాడు బసవని మహాత్మ్యము నుగ్గడింపుచు నిందుండిన బసవఁ డందున్నాఁడో లేడో కనుగొని వచ్చెదనని బల్కి కైలాసంబున కేగి మఱలివచ్చి తానిట్లు సెప్పెను "నేను కైలాసమున కేగి నిగమోక్త ప్రకారంబుగ శివుని సన్నుతించి యిట్లంటిని దేవా!

భక్తోద్ధరింప మర్త్యంబుననున్న బసవన యిచ్చటగూడ నుండునాయని నన్ను మర్త్యులడిగినారు ఆసందియంబును దెలియుటకై నేను తమవద్దికి వచ్చితి" ననిన నద్దేవుండో భక్తవర్యా! బసవండు లేనితావున్నదా? అన్ని లోకములయందుఁ దానయైయున్నాఁడు ప్రమథులందును, భక్తులయందును, నాయందును, నీయందును అందఱియందును బసవఁడేనిమిడియున్నాఁడు. నీవిదేజూడుము. అని తనహృదయంబునఁవిప్పి బసవనిజూపించెను అందు బసవండు పద్మాసనస్థుండై కరస్థితలింగంబును వీక్షించుచు, సంతతశివధ్యానపారీణుండైయుండెను. ఆతనిఁజూచి ప్రమథులు హర్షించిరి నేనానందసాగరంబునమునిఁగితిని అంత శివుండు శివానింజూచి "ఓసుందరీ! ఈమహాత్మునిమహిమంబును వర్ణింప నేరికితరంబగును? ఈనిలుకడయెందునుగానరాదు ఈతనికిని నాకును భేదంబులేదు నన్నుఁగూర్చి తపంబాచరించిన శిలాదునకు తవపుత్రోభవిష్యామి, యని వరంబిచ్చునట్లు వృషభేంద్రుండనై జన్మించితిని అట్టి వృషభుండనగు నేనే భక్తోద్ధరణార్థము వసుధను బసవండనై జన్మించితిని నేనీశ్వరుండను బసవఁడు నాబంటు లోకనాయకుండను నేను. లోకపావనుండతఁడు కారణలోకసంహారకుండను నేను కారణలోకోపకారియతఁడు భక్తవత్సలుండను నేను. భక్తనిధానమతఁడు నేను భక్తైకదేహుండను, అతఁడు భక్తజనప్రాణియు నేను ముక్తిరాజును,ఆతఁడుభక్తిరాజును నేనులిగపట్టబద్ధుండను అతడు భక్తిపట్టబద్ధుండును నేనచరలింగంబును ఆతఁడుచరలింగంబును నేనాది శంభుండను, ద్వితీయశంభుండతడు నన్ను గొలుచుటకంటె నతనిగొల్చినచో ముక్తిసత్రంబుగ గలుగును భక్తులునాకు ప్రాణార్థంబుల నొసంగుదురుబసవండుభక్తులకు ప్రాణార్థంబుల నొసంగును యేనరుండైన నొకసారి "బసవా! యని స్మరించినఁజాలును భవపాశంబులు ద్రెగిపోవును ఆతని మొగంబున మేమందఱముందుము బసవనికృపలేనిదినాకృపకు పాత్రుఁడుగాడుబసవని కీడగుభక్తులులేరు భక్తియే బసవండును, ఇతఁడు నాయొక్కహృదయంబునందే కాదు భక్తజనులందఱి హృదయంబులయందును నివసించును అనిపలికి తనహృదయంబునందున్న బసవనింజూచి "ఓబసవేశ్వరా! నీవుమర్త్యలోకంబున సంసారమునందిష్ట

మున్నదా! భక్తులున్నారా! యనిన, బసవేశ్వరుడును" ఓదేవా! నీభక్తియుండిన జాలును మెచటనున్ననేమి? జంగమలింగప్రసాదంబుగల జన్మలెన్నిగల్గిన సరే జంగమప్రసాదలబ్ధిగల సూకరాదిజన్మలైననుమేలేనాకింతకన్న వేరేమికావలయును" అని పలుకు బసవనినాకుంజూపిననేనును శివునకుమ్రొక్కియే లెంచితినని సిద్ధరాముడు చెప్పగావింటిని గావున ఈబసవనభక్త సంరక్షణార్థమై అవతరించిన యీశ్వరుండు గాని యన్యుండుగాడనిన బిజ్జలుండును ముదంబంది యమూల్యవస్త్రాభరణాదులను గొల్లలకిచ్చి బహూకరించి పంపి బసవేశు ననేకవిధంబులం గొనియాడెను.

ఆపదుద్ధారకాయనమః

ఎనిమిదవ అధ్యాయము ముగిసెను.





శ్రీమత్పరశివాయనమః

# బసవఁడొక భక్తునకు తనభార్య చీరనిచ్చు చరిత్రము.

## (నవమాధ్యాయము.)



ఒకనాఁడు బిజ్జలాదులకు తంత్రంబునఁ బన్ని యొక మిండజంగమంబును బసవనికిఁ డకంపిననాతఁడు మంత్రికడకువచ్చి నాజీవితాంతమువరకుఁదగిన ధనమునొసంగుమని యడిగిననట్లేయని బసవండు కోశాగారంబుననున్న ధనంబునంతయు నిచ్చెను దానింగొనియతఁడితరమంత్రులకుఁ జూపించినవారును బిజ్జలునికడకేగి "దేవా! నిజంబు సెప్పకున్న రాజద్రోహులమగుదుము. అట్లుచెప్పిన కొండెలమగుదుము యెట్లయినను తెప్ప చెప్పకఁదప్పదు. నేఁడు బసవన మనబొక్కసంబుననున్న రొక్కమునంతయు నొక్కమిండజంగంబున కిచ్చెను. ఇట్లుఁగల ధనంబెల్లనశించినపిదప మన మేమిపని జేయగలము అని పలికిన యులికిపడి యిలానాయకుండు మంత్రిని రాబనిచి "ఓయీ నేటికి నీతో బనిసాలును మాద్రవ్యంబంతయు నొప్పించిపొమ్ము దండించెదనని భావంబునఁగదా మాబండారమును బాడుజేసితివి పరధనంబునంటని బాసఁగలవాఁడవు మాధనంబెట్లు హరించితివి? యెట్లయిననేమి నిన్ను దండించుటకు వెరతుముగాన మాధనంబునొప్పగించి కొలువునుండి వెడలుమనిన జిఱునగవునగి బసవండిట్లనియెను "ఓరాజా! నీక్షుద్ర ద్రవ్యంబున కెవఁడాశించును, పార్వతీరమణపదభక్తియను కల్పద్రుమంబును, హర

భక్తియను చింతామణియును, శంకరభక్తిజూను సురధేనువును, శివసేవసంబను కనకాద్రియునుండ నేనీక్షణికవిత్తంబున కాశించితినా? సింగంబు పూరిమేయునా? పాలసంద్రంబులోఁ జరించుయంచ ఱేడుబల్వలోదకంబున కాశించునా? తియ్యని మామిడిపండ్లందినురాజిలుక బూరుగుపండ్లకై కోరునా? పూర్ణిమాచంద్రికలఁ జుంబించు చకోరంబులమానసనాటినిసినిదానివునా? అట్లనేజసవఁడు భవులయింట్లకేడధనంబుము ట్టునా? మీకంత యనుమానంబుండినబొక్కసంబును సరిచూచుకొనుఁడు ఇవిగొ మే తాళపు చేయులు సిదే లెక్కపాత్రము అని నూపించిన రాజాను బొక్కసంబులఁ దెఱచి చూచువరకు నపారధనంబు లెక్కకు మిగిలియుండెను పత్రింబులందలి లెక్కలు సరిగానుండెను అదిజూచి రాజువిస్మయాక్రాంతుండై యితండు బరమేశ్వరాంశసంభూతుండుగాకున్న యిట్లగునా? యని జింతించి సభికులంజూచి "మీరెన్నఁడును బసవనపై నేరంబులను! గనఁబరచకుఁడు. ఆఁతడు మహానీయుఁడు ఆతఁడలిగిన మన కంతయు నంతంబు వ్రాటిల్లును అనిచెప్పి మంత్రిపుంగవుని వివిధవస్త్రాలంకారంబులచే బహూకరించి మొలగంబు సాలించెను.

మఱియొక నాఁడొక్క మిండజంగంబు దనవేశ్య యింటనుండి యొకదాసిని బసవనింటికి బడిదేఁబనిచిన నదిజని బసవేశ్వరుని భార్యయగు గంగాంబిక ధరించిన యమూల్య దుకూలచేలంబునుగాంచి విస్మయంబంది పడిఁగొనకఁ దిరిగివచ్చి వెలసానింజూచి "ఓయక్కయ్యా! నేనేమని సెప్పుదును? బసవని పట్టఁపుదేవి గట్టిన పట్టుపుట్టంబు నేమనివర్ణింతును అంత మనోహరమైన చీరె నెందును గాంచలేదు సిరివన్నె, మహాచీని, చీని, ఖావజతిలకము, పచ్చపట్టు, రాయశేఖరము, రాజవల్లభము, మేగవన్నెము, గజవాళము, గందవడి, హంసవడి, వీణావళి, పల్లడ దట్టికాళి, వాయు గనయు, గౌరిగనయు, క్షీరోదకపట్టు, రత్నంపుపట్టు, సంకుపట్టు, మరకతపట్టు, పొంబట్టు, నెఱిపట్టు, వెలిపట్టు, నేత్రింపుపట్టు, చంద్రాతపంబును, సాంధ్యరాగంబును, ఇంద్రనీలము, మహేంద్రనీలము, సన్నంచును, మేగవన్నెయు, రుద్రాక్షవన్నెయు, కాంభోజి, పులిగోరుపట్టును, భూపతి రుద్రతిలకము, మలయజసిరియు, గజావళియు, హయావేళి, పలిపమ్మ, పరిగమ్మ తెలుపు, దివ్యాంబరంబు, నుపయరాగంబును, దేవాంబరంబును, గుజరాష్ట్రంబును మొదలగు పట్టువస్త్రంబుల

నెన్నియో గాంచితిని గాని దీనికి సరిబోలవు. బావగారుజని ఆచీరె నిమ్మని బస వన్న నడిగిన దప్పక నిచ్చును" అనిన నాలసించక నావేశ్యమిండనింజూ చి ఓక్షపియుడా! నీకు నామీద నిక్కంపు ప్రేమయున్నయెడల గంగాంబికఁ గట్టినచీర నడిగి తెమ్ము" అనిన నాశరణుం డట్లకాకయని బసవని నన్నిధానంబునకుఁజని యతనింజూచి "ఓబసవన్నా! నేఁడు గంగాంబికఁ గట్టిన బట్టుపుట్టంబును నాకిప్పింపుము, అనిన నతంపుదడయక దనపడతింబిలిచి " ఓతన్వీ ఈభక్తుండు నీగట్టిన పుట్టంబు నిమ్మని గోరెను పుట్టుసావెఱుగని మహాసీయునకు నీపుట్టంబునిచ్చిన నికముంచు మనము పుట్టంబోము అని పలికి తానలేచి గంగాంబిక పైవలువను వలచినంత రెండవ విలువంగల వలువ యొకటుండెను అచటి వారందఱు నాశ్చర్యంబున చూచుచుండ వస్త్రంబులు పోగై కన్పట్టెను ఆశరణుండును బసవనివారించి దామోచినకొలది వస్త్రంబులగొని దన వగలాడికడకేగి యావస్త్రముల మూటంజూపి బసవని భక్తిని మహాత్వమును జెప్పి కొనియాడుచుండెను.

అభీష్టదాయకాయనమః

తొమ్మిదవ అధ్యాయము ముగిసెను.





లీలావినోదాయనమః

# ముగ్ధసంగయ్య చరిత్రము.



## (దశమాధ్యాయము)



ఒకనాటి రేయి భక్తబృందమంతయు ప్రదోషపూజఁ గావించుకొని సాపడిన పిమ్మట కొందఱు మిండజంగమలు జందనకుసుమాదులధరించి తాంబూల చర్వణంబును గావించుచు విలాసం బొప్పగ విలాసవతులగు వేశ్యలకడకుఁ జనుచుండ ప్రపంచవాసనారహితుండగు ముగ్ధసంగయ్యయను శరణాగ్రణి " వీరందఱు నెచటనో పరమేశ్వరారాధనంబుగావించఁ జనుచున్నారు నేనుఁగూడా వీరినిగలియ బోదు" నని మనంబునం జింతించి బసవనింజూచి "ఓభక్తవర్యా! నేను వీరిం గూడి పోవుదును సెలవిమ్మనిన" మంత్రినవ్వి "ఓస్వామీ! యట్లేకానిండు" అని పలికి వారికి శృంగారింపఁజేసి పరిచారకులతోనిచ్చి యొకసానియింటికి బంపించెను. ఆసానియును ముగ్ధసంగయ్యనఁజూచి గారవించి పాదప్రక్షాళనంబుగావించి తడివత్తి పాదోదకంబును సేవించి కేలూతనిచ్చి వివిధశృంగారోపేతంబగు శయనమందిరమ్మునం జేర్ప నచ్చటి రత్నఖచిత స్వర్ణమయంబగు మంచంబును, పుష్పసంచితంబగు పాన్పునుజూచి యమ్మహానుభావుండు ఓహో! యిది శంకరుండుఁ గూర్చుండు సింహాసనంబుఁగాబోలును లేక గౌరీరమణుని విమానంబుఁ గాఁబోలును, లేకశృంగార గృహంబుఁ గాఁబోలునని యెంచి భ్రమించి తలపంకించి విస్మయంబెంచి యియ్యంచ

యాన లింగార్చనసేయు మందిరంబని మదిఁదలంచి మించినభక్తి నమ్మంచంబునుదిగి నేలనొక గంబళింబఱచికొని యందుగూర్చుండి మేనవిభూతిం బూసికొనుచు నాసానిం జూచి "ఓయుతివా! నీవేల విభూతింబూసికొనవు" అనవుఁడు "ఓస్వామీ తొలిజామునసే నాకొక్క జంగమయ్య గారి తన మేనఁబూసికొను పచ్చవిభూతి నొసంగిన నిదేబూసికొంటిని" అని చూపించిన దారుదాక్షులం ధరించుచు నీవేల దాల్పవనిన నాసాని "ఓయయ్యా! లవణసాగర తీరంబున బొడమిన రుద్రాక్షలు బాగుండవని పాలకడలికడనుదయించిన రుద్రాక్షల నొక్కయ్య దెచ్చియిచ్చెను ఇదేచూడు" మని ముత్యాలహారంబును జూపించిన నాయయ్యయు "నోమహాత్మురాలా! రుద్రాక్షను దలపైఁ దాల్తురుగాని ముక్కున ధరింతురా? ఈసోద్యమును మేమెప్పుడును గాంచలేదు" అనిన నత్తలోదరి "ఓస్వామీ! నావిశేషంబేమని చెప్పుదును వేదములును దేవుడుగూడా మెఱుంగజాలడు" నావు "డోతర లాక్షీ! నన్నుంబోల నీవేల జడఁ దాల్పకున్నావు" అనిన నాసాని "యోజంగమయ్యా! ఇదిగో నున్నగదువ్వి సగము బూవుల దండలకును, సగము సన్ననిజడను దాల్చినాను ఇదిగో జూడుము అని తన కీల్జడను జూపించిన "మఱియు నీవు కచ్చడాలేల దాల్పకున్నావు నీవు మహాభక్తురాలవు అనిన ,, నోమహాత్మా! లింగాంగేతరుల దృష్టినాపై బడకుండ సర్వాంగ కచ్చడంబుం గట్టితినని యత్తెఱవజూపింప శరణుండచ్చెఱువంది ,, ఆహా! యిమ్మహాత్మురాలి నిష్ఠ గడుయద్భుతంబు గూర్చుచున్నది " అని లేచి సాష్టాంగ నమస్కారంబుగావించి ,, ఓపూజ్యురాలా! యీనిష్ఠ కెవరాచార్యులు? మీసాంప్రదాయంబెద్ది? మీనియమంబెట్లు? మీతపంబునకుతావేది మీగోష్ఠి యేలాటిది? నాకు విన్నవింపుమనిన నవ్వనిత "ఓస్వామీ! వామదేవయోగిచే శివదీక్షంబొంది పార్వతి శంకరుని తపంబు సేయుచున్నతరి మెప్పించి యీదృగ్లాంఛనంబులఁ బడసెను అట్టి శ్రీకుమారుని గెలిచిన మగనిసామేను గైకొన్న జగదంబ సంతతివారము శివునిచే శైవరహస్యంబుల నెఱింగిన గిరిజా శిష్యురాండ్రము జన్నావుపాల నష్టావశేషంబుగగాచి యిక్షు చూర్ణంబు నింతఁ గలిపి లింగార్పణంబు గావించి భుజింతుము అదిదప్ప వేరుపదార్థంబును భుజింపము ఒకవేళ

భక్తులేవరైనను గంధమాల ఫలాదుల నర్పించిన వానిని లింగనివేదనంబు గావించి భుజింతుము. ఇంతటి ఘోరమైన తపముమాని సర్వసంగ పరిత్యాగులై వేదాంతులై రసికులైన జంగమోత్తములతోడ మాకూటము త్రికాలములయందు లింగార్చనలం గావించుటదప్ప మఱొండుపనులు లేవు ఇవియే మానియమములు మావారెల్ల శివ క్షేత్రములందున్నవారు" అని వినిపింప ముగ్ధసంగయ్య ముగ్ధుండై యప్పర్యంకంబు నందున్న స్రక్చందన తాంబూలాది వస్తుసంచయంబును శోధించి యమ్మంచంబును శివ సింహాసనంబని వానిక ధూపంబు వేయం గడంగిన నయ్యువిద నవ్వి యీయయ్య యిచ్చవచ్చినట్లు మెలంగెదనని దలంచి పూజాద్రవ్యంబుల సమకూర్చి కాంస్య తాళంబులను గంటలను మ్రోగింపుచు ధూపానంతరమున సంగయమంగళారతి నొసంగుచున్నంత నాసానితోడిచెలులం బిలచి మద్దెలతాళంబులను గంటలను మ్రోగింప నియమించి దాను మంగళంబులం బాడుచు సంగయ్య చిత్తంబును బొం గించుచుండ నావుడు భక్తిచేనొడలుమరచిశివానందంబు ననుభవించుచుతదేకవినోద పరుండై యుండెను అంతలో దివాకరుండుతూర్పుకొండపైనిలిచినగని ముగ్ధసంగయ లింగావసరముజాలించి తీర్థప్రసాదంబులను స్వీకరించి బసవనికడకేగి యిట్లనియెను.

ఓ బసవనా! లంజెతీకమున సుఖంబేమని చెప్పుదును ఆవైభవానందములను వర్ణింప బశుపతికిని వశముగాదు అయ్యో! నీవును రాకపోయితివే! లంజెతీకముం జేయుచు నిన్నేదలపోసితిని ఆహా! యేమియానందము యేమివైభవము నేబుట్టిన నుంచి యీలాటి పరమానందమును జూడలేదు శివునికృపలేనిది యేది లభించునా! జేయింబవలు లంజెతీకముం జేసినను దనివిదీరదు నాయెన్నిజన్మముల శివపూజ ఫలమో నేటికి నీకతన ఫలించినది. బసవన్నా! నేనిజముం జెప్పుచున్నాను. యెంత కాలమో శ్రీశైలమున నుంటిని అందలి యేకాంతవాసములందు దపముసేయు మహాత్ములను ఫలాశులను పాదాశులనుగూడ జూచితిని వారికీవైభవము దొర కదు ఆ విభూతి దొరకదు ఆమహాత్మురాలు ధరించు విభూతి పచ్చనిది మైదాల్చు రుద్రాక్షలు తెల్లని మెఱుఁగులవి. సర్వాంగకచ్చడంబులు మనోహరంబులు ఆచెలువకు బరిచర్యలంజేయు లలనలందఱు నటేయున్నారు వారిమహాత్మ్యమును గో

రమణుండే యెఱుంగును అని ” దారాత్రి గావించిన చర్యలనన్నింటిని దెలిపిన దోడి జంగమములందఱును ముసిముసి నగవులునగిరి బసవండును సంగయ ముగ్ధత్వమునకు భక్తికిని సంతసించి యతనితో నిష్ఠాగోష్ఠిని సలుపుచుండెను.

ఆనందమయాయనమః

పదియవ అధ్యాయము ముగిసెను





శ్రీపార్వతీపతయేనమః

# చెన్నబసవేశ్వర చరిత్రము.



## (ఏకాదశాధ్యాయము.)



మహీమండలంబెల్ల పాపమండితంబగుటయు జైన బౌద్ధాది దుర్మతంబులు వ్యాపించ చేతనులు నరకాలయులగుటయుంగని సర్వలోక పితామహుండును భక్త సుఖంకరుండునగు శంకరుండు నందీశ్వరుని బసవరూపునిగ భువిని జన్మించె దోలియు దనివిదీరక లోకోద్ధరణ చరణులను మఱికొందరిని బసవనికి సహాయముగ భువినవతరింపజేయనూహించి యొక్కనాడు తనకుమారుండైన గుమారుం జేరంజీరి యిట్లనియెను.

"ఓ తనయా! చూడుముర్వీలోకంబు భక్తివిహీనంబై సత్యమగు వైదిక మతమందవిశ్వాసము గలదియై జైనాది దుర్మతంబులు వ్యాపించుటచే నన్నియుంగళ చెడిపోయియున్నది. చేతను లజ్ఞానులై నరకాలయులగుచున్నారు కావున చేతనులనుజ్జీవింపఁజేయుటమనకర్తవ్యము నందీశ్వరుడు బసవేశ్వరుడై నామతంబును వ్యాపింపం జేయుచు జనుల నుద్ధరించుచున్నాఁడు నీవును నాయానతిందాల్చి ధరణియందు బసవేశ్వర భాగినేయుండవై జన్మించి చేతనుల నుద్ధరించుము" అని సెలవిచ్చిన వలిమలల్లుని పలుకుల కులికిపడి తండ్రికి నమస్కరించి కార్తికేయుం డిట్లనియెను.

"ఓమహాత్మా! నీవు సర్వజ్ఞుండవు, సర్వేశ్వరుండవు, పరమకారుణికుండవునై నన్నిట్లుజూచుట న్యాయమా? సకల పాపాల వాలంబగు భూలోకంబున మానవుండై యవతరించుటకంటె వేరే శిక్షకావలయునా! యెల్లప్పుడును భవదీయ

చరణారవిందంబులే దాపుయని దలంచు నాపై నీకలుకయేల జనించినది ఓయయ్యా జనకాజ్ఞం దాటుట మహాఘోర పాతకంబు క్షణికసుఖము, క్షణిక జీవితముగల మానవజన్మము నొందుట యంతకంటె మహా రౌరవంబు నాకెందుబోయినను యిక్కటులే గల్గెను మీరు సమర్థులు గాన నెదురాడంజాలను అని విన్నవించి, విన్నవోయిన మోముతోనున్న షణ్ముఖునిగాంచి సర్వేశ్వరుండిట్లనియెను. ఓకుమారా! నీవేల దుఃఖపడెదవు జన్మములలో నుత్తమజన్మము మానుష్యము దాననే యనేకములగు నసాధ్యపదార్థములు సాధ్యములగుచుండును. అదిగాక నీవుపతితోద్ధరణము కొరకే స్వయము స్వీకారివై నిరీహుండవై యథగత ప్రభావంతుడవై జన్మించి సర్వజనులకు శరణ్యమవై సర్వలోక పూజ్యుండవై వెలయుదువు అన్నా! నామాటను మన్నించి ధరణి నవతరించి పరమపవిత్రంబైన శైవమతంబునుద్బోధించి భక్తి యోగమే ప్రధానమని స్థిరీకరించి పతితుల నుద్ధరించుము అని ముమ్మారు పలికినను జనకాజ్ఞను మీరుటకును మానవత్వము నంగీకరించుటకు గార్తికేయుం డిష్టపడక దలవాంచి నేలం గోటంగీటుచుండ గుమారుంజూచి యతని యభిప్రాయంబు నెఱింగి వీనికి నేజెప్పటకన్న నేతజ్జననియగు గిరిజతో జెప్పించుట మేలని తలంచి మలచూలిం బిలువబంచిన సర్వజ్ఞయగు కాత్యాయని మందహాసంబొప్ప ముందర నిలిచి కందర్ప దర్పహరుండైన హరుని చరణారవింద ద్వంద్వముల కభివందనంబులు గావించిన కపాలధరుండును ప్రియంబు సేకూరగ సగౌరవంబుగా గౌరితో నిట్లనియెను ఓ దేవీ! యీకుమారుని భూలోకంబునకుజని మద్భక్తి విశేషంబు నశేషంబు జనంబులకు నెఱింగించి వారినుద్ధరించి రమ్మనిన గొంకుచున్నాడు గావున నీవాడంబరపుము అనిన నల్లెయని శర్వాణి పన్నగ హారార్ధ్వాని తన పజ్జందిగిచికొని బుజ్జగించి కుమారా! మాకు నీకు నెందును భేదంబులేదు యిప్పని మీయప్పకును నీకునుందప్ప మఱేరి వశంబుగాదు గాన నిదితప్పని యెంచక నొప్పికొని యప్పుడమికిజని శివమతంబును శివభక్తులను లోకంబునందంతటను వ్యాపింపజేసిరమ్ము నీకు బసవేశ్వరుకు బొసటమై యుండును నామాటకు మారుబలుకకుమని యెంతేని చెప్పిన నెట్ట

కేలకు వల్లెయని తలనూచి మల్లికాబాణ సుకుమారుండగు కుమారుండు పితరుల యానతిం దలఁడాలిచి లేచినిలిచి నంత గౌరీదేవియు నిట్లనియెను ఓయికుమారా! యింతకుమున్నె నాపరిచారికయగు నాగేంద్రగమనకు నిన్నుఁ గుమారునిగా నొసంగ ననుగ్రహించితిని ఆవిడ యిప్పుడు బసవేశ్వరుని సహోదరియై నాగాంబికయను పేర విలసిల్లుచున్నది దానికి నీవు కుమారుండవై జన్మించిన తద్వారంబును నీయొన ర్చంబోవు కార్యంబును జేకూరును అనిన విని శిఖివాహనుండు భవానీ భవులకు వందనంబుల నాచరించి "ఓజననీ జనకులారా! మీపనుపున నీక్షణంబె క్షితినవత రించి దుర్మతంబుల ఖండించి వెండియు ఖండేందుమౌళి భక్తులనెల్ల నుద్ధరించి శశ వాదుల నిర్మూలించి క్ష్మాతలంబును పవిత్రంబుగ నొనర్చివచ్చెదను అనుజ్ఞ నొసంగు డని పునఃప్రణామంబు గావించి తదాజ్ఞంగొని చనియెను ఆకాలమున నఖండ మహీ మండల మండనాయమానంబై విబుధజనానీక పరిశోభితంబై యరిని కరసంహరణ పాండితీమండిత. క్షత్రవతంసవిలసితంబై, రొక్కములయెక్కిమీనినైన నేకసక్కెము లాడు వైశ్యసముదాయముచే సంజుష్టంబై స్వధర్మోచితవేషానురంజిత శూద్రజన నిబిడితంబై సంతత చిరంతన పురుష త్రిపురాంతక పదచింతానపూత స్వాంతగణ జననికురుంబ సమాలంబితంబై రవిరథనేమి సంఘట్టన ద్విగుణీకృతరుచి విలసద్భర్మ గోపురంబై శోభాజిత గోపురంబై శాత్రవాభేద్య వప్రప్రాకార విలాసంబై సంతత శ్రీనివాసంబై కల్యాణంబను నగరంబొప్పుచుండెను.

అప్పటభేదనంబునకు జైన ధర్మాభిమానియైన బిజ్జలుండనురాజు రాజై యొప్పారుచుండెను అమ్మహారాజునకు నందీశ్వరావతారుండై కేవల మీశ్వర భక్తియే ప్రధానమని జగమంతయుం జాటుచు నసత్యంబులగు జైన బౌద్ధాది మతం బుల నిర్మూలించి యుత్కృష్టతమంబై సత్యంబై వెలయు శైవమతములు ప్రబో ధించుచు గురు లింగార్చనయు జంగమారాధనము పంచాక్షరీ మంత్రపఠనము నివియే ముఖ్యముగాని తదన్యములు శిష్టాంగీకారములుగావని వొదదలంచి ప్రతి నిత్యము లక్షతొంబదాఱువేల శివభక్తోత్తముల కారాధనల సలుపుచు వారి నిష్ట మృష్టాన్నపాన తాంబూల వస్త్రభూషణాదులం దనుపుచు పండ్రెండువేల విండ జంగములకు తదనుముక్త వేశ్యాగృహంబుల నిర్మించి వారికారాధనలను సలుపుచు

సంతత శ్రీమదుమాకాంత భక్తి సామ్రాజ్యముతోడ బిజ్జలుని సామ్రాజ్యంబును
తలందాల్చిన బసవేశ్వరుండు ప్రధాన మంత్రియై వెలయుచుండెను అమ్మహామంత్రి
బ్రాహ్మణ కులోత్పన్నుండైనను యిహ సుఖదుఃఖమ్ములనొసంగు కర్మములు
మోక్షమునకు విఘ్నకారణములు కేవల భక్తి ప్రపత్తులే మోక్షదాయకమని
యెంచి కర్మ సన్యాసంబు నొసరించి జంగమాచారతుండై తద్గోష్ఠియందు
భగవద్గుణానుభవుం గావించుచు భవక్తశేషంబునుగ్రహించుచు సంతతామోదంబు
తోడనుండి యీ కల్యాణపురంబున వెలయు శరణాగ్రగణ్యుండును కామక్రోధాద్యరి
షడ్వర్గంబుల జయించి మించిన భక్తిచే రజితశైలవాసుని తద్భక్తులను పూజించుచు
పరమ భక్తుండగు కక్కయగారి దివ్యప్రసాద శేషంబు నెట్లయినను పొందవలయు
నని యూహించి ద్వాదశాబ్దంబులనుండి ప్రయత్నించుచునొకనాడు కక్కయ్య
గారి మందిర ద్వారముం బ్రవేశించి "ఓ సర్వేశ్వరా ! ఓ జగత్పతీ! యిమ్మహా
బ్రహ్మవేది ప్రసాద శేషంబు నెట్లయినను నాకనుగ్రహించి నన్నురక్షించవేయని
తన మనంబున నీశ్వరుని ధ్యానింపుచు నటునిటు దిరుగుచుండ నొక్క పిపీలికంబు తన
ముక్కున నొక్క మెతుకునుగ్రహించి తద్గృహ గేహళిం దాటివచ్చుటం గాంచి యిది యే
భగవంతుండొసంగిన కక్కయార్యుని ప్రసాద శేషంబని దలంచి ధన్యమన్య మాన
సుండై "అహా! నేటికి నాజన్మంబు పావనంబయ్యెను నాజేసిన కలుషంబులు
తొలంగిపోయెను" అని సంతసించి తనపిడికిట నిండ సిసుకం గొనిచల్లిన నది శర్కరమై
చీమముంగటంబడ నాచీమ యీ మెతుకును వదలి శర్కరకై చనియెను పిదప
బసవన భక్తితో తత్ప్రసాద కణంబునుగొని కనుల కద్దికొని నిజోత్తరీయాంచలమున
గట్టిగా ముడి వేసికొని "ఆహా! పేదకు పెన్నిధి లభించినట్లయ్యెను దీని నిష్టలింగమునకు
నివేదించినగాని నాకనుభవ యోగ్యంబుగాదని యెంచి భక్తశ్రేష్ఠుండై నకక్కార్యుని
సన్నిధిం జేరి సభక్తిగ నమస్కరించి "ఓ యీశ్వర స్వరూపా! నేను నాటికిం గడు ధన్యుడ
నైతిని దేవ దుర్లభమైన భవదీయ ప్రసాదంబును పిపీలికా మూలకంబున నీశ్వరు
డనుగ్రహించెను నేగృతార్థుండనైతినన సద్భక్త శిఖామణి సంతసించి "ఆర్యా! ఆచా
ర్యానుగ్రహంబునొందిన వారలకేదియలభ్యంబు కోటియశ్వమేధ

ముల నొనర్చినను పదివేల సంవత్సరములు వాతాంబు పర్ణాశనులై ఘోరతపంబు నాచరించినను లేక సృష్టికిఁ బ్రతిసృష్టి నొనర్ప శక్తిని సంపాదించినను ఆచార్యానుగ్రహంబు నొందక నిశ్చలమై యాశా రహితమైన సద్భక్తిని ఈశ్వరునియందును తద్భక్తులయందు నుంచనివానికి మోక్ష మబ్బనేరదు నీవు నన్నింతమాత్రమున గొప్ప సేయుట యుచితముగాదు మహాత్మా! నీవు లోకోద్ధరణ మొనర్చుటకై యవతరించిన మహానుభావుఁడవు ” అని కక్కయ బలికిన బసవేశ్వరుండు తదనుజ్ఞాతుండై నిజ గృహంబునుసొచ్చి లింగార్చనవేళయగుడు స్నానముఁ జేయుటకై వస్త్రములను విడిచి పైయుత్తరియము నొకచోనుంచి తాన మాడుచుండెను.

శ్రీబసవేశ్వరాయనమః

ఏకాదశాధ్యాయము ముగిసెను





శ్రీ బసవేశ్వరాయనమః

# చెన్న బసవేశ్వరావతార చరిత్రము



## (ద్వాదశాధ్యాయము)



బసవేశ్వరుని సహోదరియగు నాగాంబిక సుగుణగణనికురంబమై శివ చరణ సమాసక్త మానస్తంభమై ఘనతర కలుషగిరి వజ్రిశంబమై తన సోదరుని వలెనే భక్తవర్య సపర్యలం గావించుచు బసవనింటనే యుండుచుండెను అట్లు బసవేశ్వరుడు తన యుత్తరీయమును వేరుగానుంచి తానవహాడుటంజూచి "నాతమ్ముడు మహాత్యాగి గాన మూటగట్టి మెఱుంగడు నేడెద్దియో మూట గట్టి తెచ్చినాడు యిదియేమో చూతమనియెంచి కొంగుముడినివిప్పి యందు బ్రసాదముండుటంగని సంతసించి "ఆహా నాసోదరుం డెక్కడనో జంగమోత్తముల ప్రసాదంబు లభించిన తాననుభవించి నాకొఱకు తత్ప్రసాద శేషంబును గొనివచ్చినాడు భక్తశేషంబు సర్వాభీష్టప్రదంబు సమస్త కల్మషమహా ధరాధరంబులకు వజ్రాయుధంబు మోక్ష మార్గంబునకు నిశ్రేణికయగును గావున తత్ప్రసాదంబు నేవగించినవారి కిహపరంబుల

రెంటియొక్క భంగంబు వాటిల్లును నాజన్మము నేటికి పవిత్రితనొందినది నాకీశ్వరుని సాన్నిధ్యము కరతలామలకమైనది [ఆలస్య మమృతం విషం] అనగా ఆలసించిన యమృతము విషమగును గాన నిప్పరమప్రసాదంబును స్వీకరించెదనని భక్తిపూర్వకంబుగా నప్రసాదంబు ననుభవించి కార్యాంతరాసక్తుఁడైపోయెను.

అంత బసవేశ్వరుండు స్నానమాడి ధౌతవస్త్రంబులం ధరించి పవిత్రంబైన విభూతి మేననలంది రుద్రాక్షలందాల్చి స్వేష్ట లింగంబును కరకమలంబున నిడికొని నియమంబు ననుసరించి (వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమశ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికర్ణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమస్సర్వభూతదమాయ నమో మనోన్మయాయ నమః) అని వేదవాక్యములచే తదేకచిత్తుండై పరమేశ్వరు నారాధించి స్తుతించి తా దెచ్చిన భక్తప్రసాదంబును లింగోపభోగంబుగావింప నెంచి నాగాంబం బిలిచి ;; అప్పా ! నాయుత్తరీయాంచలమునందు గక్కయ్యగారి ప్రసాదంబున్నయది లింగ నివేదనంబు గావింప వలయును యిటు దెమ్మనిన నాయమ "ఓ తమ్ముడా! నీవాప్రసాదంబును నాకొఱకే తెచ్చినావని నేను భక్తిపూర్వకముగా ననుభవించితిని" అని చెప్పిన మాత్రమున నే బసవండు "అక్కటా! నాకెంతచేటు వాటిల్లినది యెన్నిసంవత్సరములనుండియో నేనీప్రసాదంబుకొరకు ప్రయత్నించుచుంటిని దరిద్రునకు పెన్నిధి యబ్బినట్లు నది నాకు లభించినను యనుభవ ప్రాప్తము లేదు. శ్రీమదుమారమణ పాదారవింద మరందాస్వాదనోన్మత్త చిత్తుండును సకల కలుషదమన సమర్థుండునగు కక్కయ ప్రసాదామృతపాన సౌఖ్యమీ పాపాలవాల మక్షికంబున కబ్బునా ? ఇసీ ! లోకోద్ధారకావతారుండగు కక్కార్యుని ప్రసాదంబు లభించె గదాయని సంతసించితినిగాని యిటుజలరుగునని యెఱుంగనైతిని యిక నాజన్మమునకు తరింపు లేదు. గార్దభంబునకు సౌరభంబబ్బునా? అదృష్టవంతులకయత్నంబుగనే ఫలంబు సిద్ధించును నాబోటి హీనజనులకు పీయూషంబు విషకుంభంబగును అబ్బిన వస్తువు నటనే యనుభవించక నింటికేల దెచ్చితిని? దెచ్చిన నది నాగాంబిక కేల

దొరుక వలయును ఇదియంతయు శ్రీసంగమేశుని కృపదప్పుటవలననే కాదా ! అయ్యో ఇట్లు మూఢుఁడనై చింతించిన ఫలమేమి? పామాడిన జోగిపోసికొనెనట్లు యినది అని చింతించి భుజించి నిత్యకృత్యంబునకై వెడలిపోయెను.

అంత శరణవర్య ప్రసాదమహిమంబుచే నవివాహితయు, ధర్మచారిణియు, సంతత శివధ్యాన పారీణయు, నిరత.శరణజన చరణార విందారాధికయు, నగునాగ మాంబిక గర్భంబుదాల్చెననందు. గార్తికేయుండు శివాజ్ఞచే బ్రవేశించెను అమ్మహా భాగురాలు తన గర్భిణీత్వమునకు లోలోన వగచుచు "ఈశ్వరా ! జగన్నాథా ! నీకేమి యెగ్గులొనర్చితిని యనన్య శరణ్యనగు నాకేలనిట్టినింద్యత్వమును గల్గించితివి సాటివారిలో తలవంపులు గలిగెను నేనేమిజేయుదు" నని మిగుల గుందుచుండ నీసంగతిని బసవండెఱింగి దిగులుపడి మొగము వెల్లవెలబార విచారగ్రస్తుడై "అక్కటా ! అన్యము నెఱుంగని యిక్కన్యకామణికి గర్భంబెట్లు గలిగెను. యెవ్వరేని యెఱింగిన నెంత యపహసింతురు? సత్కులంబున నీలాటిదుశ్చరితంబులు గలిగినవని శరణగణంబు నన్నెంత దూషించునో? ప్రధాన మంత్రియింటనే యిట్టి చెట్టలు గలుగుచున్నవని పురజనంబులు సామంతులును నన్నెంత యపహసింతురో? అయ్యో! యీనింద్యంబైన బ్రతుకునాకు గలుగవలసి వచ్చెను ఓ సంగమేశ్వరగురూ? నాపై నేల కరుణదప్పితివి? నిను పూజించకుంటినా? భక్త గణంబున కపరాధంబు నేసితినా? అనృతమాడితినా? పరులకపకారము గావించితినా? ఓదేవా! యీవిపత్తును దాటించ నీకన్న నన్యంబు శరణంబులేదు ఓ భక్త వత్సలా! ఆపన్నరక్షకా! ఆర్తులనుద్ధరించుట నీపనిగాదా? నన్నుగాపాడుభారంబు నీదేయంటిని యీయవమానంబున కోర్వజాలను కరుణించుము" అని యనేక భంగుల జింతించుచుండ త్రికాలవేదియు భక్తరక్షాపరాయణుండును సాక్షాత్త్ర్యక్ష స్వరూపుండునగు సంగమేశ్వరుండు బ్రత్యక్షంబై నిలిచినంత బసవన మంత్రి పుంగవుండులేచి సభక్తిపూర్వక ప్రణామంబుల నాచరించి యభినుతించి యుచితాసనా సీనుంగావించి యర్ఘ్యపాద్యాదులచే పూజనలం గావించి వినమిత శిరస్కుడై విచార మగ్నుడై యెదురు నిలిచియున్నగని సంగమగురుం డిట్లనియెను.

..................

"ఓ బసవన్నా! యెన్నఁడైనను విచారం బన్న నెఱుంగని నీమోమున విన్నదనంబు గాన్పించుచున్నది. మన్నించివిన్నవించ వేయన్న మంత్రి తనసోదరీ వృత్తంబునువినిపింప ధీధిక్కృత నిలింప గురుండగుసంగమగురుండు చిరునగువు మోమునదోప నిట్లనియెను.

ఓ మహాగుణశాలీ! నీవు సర్వజ్ఞుండవయ్యు నేలజింతించెదవు? సాక్షాదీశ్వరాంశ సంభవుండై నిగ్రహానుగ్రహ సమర్థుండై శుద్ధసత్వస్వరూపుండై వెలయు నక్కయగారి ప్రసాద మహిమచే మీ నాగాంబిక చూలాలయ్యెను ఆమెగర్భము నందొక్క మహా తేజశ్శాలి జన్మించగలడు. ఈనాగాంబిక వృత్తాంతంబునువినుము.

తొలిజన్మమున నీనాగాంబిక పార్వతీదేవి సఖురాలై నాగేంద్రగమనయను పేరుతో విలసిల్లెను. ఒకనాఁడు గిరిజాదేవి తన సఖులతో గూర్చుండి సౌందర్య విజితమారుండగు గుమారుండురా నతిప్రేమచే గౌగలించికొని మూర్ధంబు నాఘ్రాణించికొని కుమారుని మరుమాటలకెంతయో సంతసించుచు బుత్రప్రేమాబ్ధి నోలలాడుచున్నంత నీనాగేంద్రగమన మందాత్మురాలై యొక సఖియతో నెక సక్కెముగా నిట్లనియెను ఓమదవతీ! యీపార్వతిం జూచితివే! తనకు జన్మించిన గుమారునివలెనే యీకుమారుని ముద్దాడుచున్నది. యీవింత నెందును జూడ లేదు" అని నవ్వినంగని యద్దేవిమిగుల గృద్ధయై "ఓసీ! దురాత్మురాలా! సకల భువనాధీశ్వరుండును, పరమపావనుండును, అగు పరమేశ్వరుని దివ్యతేజంబున దురితసంహరణార్థంబవతరించిన నాకుమారుని కుమారునింగని యోర్వఁజాలక యిట్లు దూషించుచుంటివిగాన నీవు భూలోకంబున మానవజన్మము నవలంబించి నిందలపాలగుదువు పొ"మ్మనిన నాగేంద్రగమన భయాక్రాంతమానసయై గిరిజా చరణారవిందంబులపయింబడి "ఓతల్లీ! నేనజ్ఞానురాలనై యిట్లాడితిని నాతప్పును క్షమింపుము పాపాకరమైన మానవజన్మమునొందజాలను నిగ్రహానుగ్రహసమర్థురాలవు రక్షించినను శిక్షించిననునీవేదిక్కు నీకరుణాదృష్టుల నీదీనురాలిపయిఁ బరపకున్నచో నేనెన్నటికిని దరింజేరను" అని యనేక భంగులవినుతించుచు విలపించుచున్నంత కరుణార్ద్రహృదయయై ధరాధరాత్మజ నాగేంద్రగమనతో నిట్లనియెను

" ఓ సుదతీ! నామాట యెవ్వంతయుఁ దిరుగదు గాన వివాహ రహితవై యొక పరమభక్త ప్రసాదమహిమచేఁ బండ్రెండు వత్సరంబులు గర్భంబుఁదాల్చి యొక్క వరపుత్రునింగాంచి యతనిచే లోకాపవాదంబును బాపికొని శివగణార్చనలచే నతి పవిత్రవంతురాలవై మగుడి నాసన్నిధికి వత్తువు పొమ్మనిన నమ్మగువ తిరిగి వందనంబిడి ,, ఓ దేవీ! నీయానతిఁ దప్పించు కొనుట కేరికిఁ దరమగును? కాని నాకొక్క విన్నపంబుగలదు మన్నించి సఫలంబుగఁజేయుము, అదేమనిన నీకుమారుండు జన్మించవలయును ఇదియే నాకోరిక రిత్తపుచ్చకుమని ప్రార్థించినవల్లెయని జగజ్జనని యానతిచ్చెను. అప్పుడా నాగేంద్రగమన గిరిజచే నానతింగొని నాగాంబికయై జన్మించినది యామె పవిత్రురాలు ఈవిడ గర్భమునందు శిశువు పండ్రెండేండ్లవరకు పెరిగి సభాస్థలిని సమస్త జనంబు లచ్చెరువంద జననీ దక్షిణ కర్ణంబునుండి జననంబునొందును అమ్మహనీయునకు చెన్నబసవరాజు" అను నామంబు బ్రసిద్ధంబు గావింపుము నీమదిని సంశయంబుడుగుము అని యంతర్ధానంబు జెందినంత బసవయ్య తన లింగదర్పణంబున సోదరీగర్భస్థుడైయున్న బాలకుని చందంబరసి సంతసించితద్వృత్తాంతంబును నాగాంబిక కెఱింగించిన నత్తరుణి సంతసించియుండెను

ఇట్లు నాగాంబిక గర్భంబుదాల్చిన సంగతి కింవదంతిగా పట్టణమంతయు వ్యాపించెను యనేకు లనేకరీతులవాడుచు మిన్నకుఁడినంత పండ్రెండు సంవత్సరములు గడిచిన నొక్కనాడావార్తను రాజభటుండువిని బిజ్జలుని సన్నిధికేతెంచి జోహారు లొనర్చి నిలిచినంత నాగూఢచారునిగని రాజు " ఓ చారుడా! పట్టణ సమాచారంబులేమి! నీవు భయంపడక దాచక వచింపుమనిన నాగూఢచారుండిట్లనియెను.

"ఏలినవారా! పట్టణ సంగతు లేమని చెప్పుదును పేరుగొన్నవారింటనే యకార్యంబులు జరుచున్నవి విన్నసంగతులను జెప్పకుండుట మావిధిగాదు మీప్రధాన మంత్రిగారి సోదరి నాగాంబికయవివాహితయయ్యే గర్భంబుఁదాల్చినది. బసవ

మంత్రియు తానొక్క శైవ శ్రేష్ఠుండననియు, తనతో సమాను లెవరును లేరనియు గర్వించుచునో సోదరీ ప్రేమచేతనో నిలువెడల నడపక తోబుట్టు రంభన కోర్చి యున్నాడు పురజనులందఱును బసవని యధికారమునకు భయముజెంది మిన్నకున్నారు, నాకుదెలిసిన సంగతిని దేవరకు విన్నవింపవచ్చినాననిన విని బిజ్జలుండు బసవని వ్రిభావంబు సర్వంబు నెఱింగియు మతాంతరుఁడు గాన మిగుల కోపించి "ఔరా! ఇదేమన్యాయము అన్నియు దెలిసినవారియింటనే యింతటి యన్యాయము జరిగినచో నితరుల నేమనవచ్చును (రాజారాష్ట్రి కృతం పాపం) అనునట్లు రాజ్యమందలి జనులుజేయు పాతకములు వారిని శిక్షింపకున్నచో రాజును బొందునుగదా! (అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చైవాప్యదండయన్ ♦ లోకనిందామవాప్నోతి రాజ్యభ్రష్టోభవిష్యతి) అనునీతి రాజు దండించ తగనివారల దండించుచు తప్పుగలవారల శిక్షింపకున్నచో లోకనిందను బొందుటయేగాక రాజ్యభ్రష్టుండగును మఱియు (యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరేజనాః ♦ సయత్ప్రమాణంకురుతే లోకస్త దనువర్తతే) అనగా పెద్దవాఁడేకార్యము నొనర్చునో ఆవిధినే యితరులు గావింతురు వారికా యాచరణము ప్రమాణమూలంబగును కావున యిప్పుడు మాత్రము బసవని యథావిధిగ దండించకున్నచో నాకపయశంబు వాటిల్లును రాజ్యమంతయును ధర్మశూన్యంబగును" అని దూతం బిలిచి యమాత్యుం బిలువఁబంచిన బసవండును నిజపరివార సమేతుండై విభవంబు మెఱయ సభాస్థలికి విచ్చేసి నిజాసనంబున గూర్చుండెను. బిజ్జలుండును పట్టరాని యాగ్రహంబుగలవాడై కనుగొలకులనుండి యంగారకణంబులురాల గొంతవటి కూరకుండి ప్రగడమగనింజూచి యిట్లనియెను.

ఓ మంత్రీ! నీవొక గొప్పయధికార పదమునొందియు, నధిగత సకలశాస్త్రుండవయ్యును, శివభక్తులలో నగ్రేసరుండవయ్యును నీయప్ప నాగమ యనుచితకార్యమునాచరించి దౌహృదవతియైన నెరింగి నీవెట్లూరకుంటివి? ఈపాతకమున కెట్లోర్చుకుంటివి? ఈనిందల నెట్లు వీనుల విందొనరించితివి? నీమతంబెంతయో శ్రేష్ఠతమంబని వాకొందువు. నీమతస్థులేలయూరకున్నారు? (స్త్రీషుదుష్టాసువాష్ణేయ జాయతే

వర్ణసంకరః ♦ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ) అనగా స్త్రీలు వ్యభిచరించి దుర్వర్తనగలవారైనచో వారిచే వర్ణసాంకర్యము గలుగును దానివలన నరకము సంభవించును మరియును కులధర్మములను పాలించక స్వోచితాచారములను దిగనాడిన మనుష్యులకు నరకములో శాశ్వతనివాస మేర్పడునని! పెద్దలు చెప్పగా వినుచుందుము ధర్మవేదినని విర్రవీగు నీవు నీయింట జరుగు దుష్కృత్యము నేల నిల్లు దాచిపెట్టితివి ఇద్దానికి నీకు తగినశిక్ష రాజధర్మానుసారము విధించఁబడును అనిన విని బసవన చిఱునగవునగి "ఓ రాజా! శైవుల మాహాత్మ్యము నీకెన్నియో సారులు జూపించితిని గాని నీమనంబుకుదుటగాంచలేదు. ఇందలి నిజానిజంబుల నెరుంగక నిందించి పలుకుట యుచితంబుగాదు. నేనిదే మా యక్కగారి నీసభకు రప్పించెదను తద్వృత్తాంతంబును నీవే యొఱుంగుదువుగాకయనిన వల్లెయని భూవల్లభుండు తలయూచినంత మంత్రిపుంగవుండు నొక్కదూతం బుత్తెంచి నాగమం దోడ్కొనిరమ్మన వాఁడుజని యప్పరమపవిత్ర చరిత్రియగు నాగాంబిక కడకేగి సభక్తిగ నమస్కారంబుగావించి "ఓ దేవీ! బసవ సచివాగ్రణి దేవరవారిని రాజసభకు దోడ్కొని రమ్మని సెలవిచ్చి నన్నుపంపించినాడు" అనిన నమ్మగువ యట్లేయని తల యూచి మేలగు కనకాందోళికలో గూర్చుండి ఝుఝుగెలంకుల చిఱుతపాయపు తెరుణు లిరుపురు నడవ పురంధర సుందరీ వైభవంబు చెన్నొంద! శ్రీగురువర చరణాంబు రుహంబుల ,మదిందిరంబు గావించుకొని ప్రేని కొలువుంజేరి యవనికాభ్యంతరంబున నిలిచినంత ధరావరుండు స్మరహర భక్త ప్రభావంబు నెఱుంగక దఱిఁగిన బుద్ధిగలవాఁడగుట నాగాంబికతో నిట్లనియెను.

ఓ యువతీ! నీవవివాహితవై కులధర్మంబులను మఱచి యాత్మ గౌరవంబును విడిచి సర్వనాశనంబు గావించి యిట్టి యనుచిత కార్యంబు నొనర్ప నెట్టులోడిగట్టితివి? నీకి గర్భమెట్లు గలింగెను నీవసత్యమాడక నిజము నెఱింగించుము రాజ్యమునందిట్టి యన్యాయము జరుగుచుండఁజూచి యూరకుండుట రాజధర్మంబుగాదు. తప్పుగల్గినప్పుడు తనకుమారునైన శిక్షించవలయును కావున నీసంగతిని వచింపు

మనిన నాగాంబిక నాగచర్మ ధరుని మనంబున దలంచి క్షితీశ్వరునితో నిట్లనియెను.

"ఓ రాజా! యేపాపంబు నెఱుంగని నేనేమని తెల్పుదును అయీ గర్భస్థ శిశువునేయడిగినచో నన్నిసంగతులు దేటఁబడగలవు" అనిన నవనిపాలుఁ డచ్చెఱు వంది యీయద్భుతంబు నెన్నఁడెఱిఁగియుండను కాని విచారించిచూచినగదా నిజా నిజములు తేటబడునని గర్భస్థశిశువు నుద్దేశించి "ఓ శిశువా! నీవెట్లీ తరుణీమణి గర్భమున బ్రవేశించితివి? నీసంగతిని యిచ్చటి పిన్నపెద్దలు వినవివరింపుము" అనిన నజఠరస్థ బాలకుండు సభాసదు లచ్చెఱువంద విమతుండగు క్షితిపతి యతిభయ మతిగాగ నిట్లనియెను.

ఓ ఱేడా! సాధుచరిత్రయు బ్రహ్మచారిణియు నిర్మల శివాచార సంపన్న యును భక్తపూజా ధురీణయగు నీ నాగమాంబికయందు కుబుద్ధిచే నీవు నిందా రోపణంబు గావించితివి నీవంటి హీనులయిండ్లలో నకృత్యంబులు జరుగునేమోగాని శుద్ధసాత్వీక శివభక్తులిండ్లలో నట్టికార్యములు గానేరవు శ్రీమదజితగిరి వరగిరిజా రమణ చరణ సరసీరుహ సమారాధకుండును, దురితారిషడ్వర్గంబును జయించిన వాఁడును అగు కక్కయార్యుని దివ్యప్రసాద శేషంబు నీవిడ యనుభవించుటచే తన్మహత్వంబువలననే నీతనువునుధరించి ఈమెగర్భమందు జొచ్చితినిగాని మీరను కొనినట్లు వేరుమార్గంబుగాదు" అనిన విని సభవార లచ్చెఱువందిరి ఱేడును ఈత డీశ్వరాంశ జాతుండే కాని యన్యుండుగాఁడని మనంబున విచారించి తిరిగి యాడింభ కునితో నిట్లనియెను "ఓయీ! ఈసభవారును నేనును నీపలుకులకు మిగుల సంత సించితిమి కాని భవద్దివ్య దర్శనమునకై యందరు నమందకుతూహలంబు నొంది యున్నారు గావున దర్శనంబొసంగుము" అనవిని రాజుప్రార్థనమాలించి యాశిశు రూపకార్తికేయుండు శివగణమహిమంబుఁ జూపనిదే సమయంబనితలఁచి హరుని చిత్తంబుననాయత్తపరచికొని (నమాతుఃపరదైవతం) అనెడి ప్రమాణంబు ననుసరించి తల్లికి కష్టమునుగల్గించఁగూడదనియెంచి నిజమహిమంబున తనతనువును తనువుగనొనరించి శరీరరుచులనద్దెసల నాక్రమించి ప్రకాశించ జననీదక్షిణ

కర్ణమునుండి బయలుదేరి ద్వాదశాబ్దంబుల బాలుఁడై నిలచినంత సభికులందఱును విచే తనులై చిత్తరువులంబోలి చూచుచుండిరి ఆకసంబునుండి వేల్పులు విరిసోనలం గురిసిరి సకలదిక్కులును మిక్కిలి తెలివిదాల్చినవి నదీనదంబులు నిర్మలజలంబులై బ్రవహించినవి దేవదుందుభులు మ్రోసినవి అచ్చరలేమలు నాట్యంబును సలిపిరి గంధర్వులు గానంబు సేసిరి శైవగణంబులెల్లయానందసాగరంబున మునిఁగినవి బిజ్జలుఁడును తదేకదృష్టితోఁ జూచుచు గిమ్మనకఁ గూర్చుండెను.

అంత నబ్బాలకుఁడు నిజజననికిఁ మ్రొక్కి తదనుజ్ఞచే జనకమంత్రికిని మ్రొక్కిన నతండపార సంతోషంబున మేనల్లుని లేవనెత్తి యెదఁగ్రుచ్చి కౌఁగలించికొని నుదుట విభూతినలంది గళంబున దివ్యలింగంబును సంధించి ఓంకారపూర్వకముగ పంచాక్షరీమంత్రము నుపదేశించి దనకుశిష్యునిగాఁ జేసికొనినంత ధరణీధరుఁడీయద్భుతంబునుగని "అక్కటా! యీబసవేశ్వరునిమహిమను నేనెఱింగియు నెందుకు పరీక్షం జేసితిని? మహాత్ములయెడ నపకారము నొనర్చినవారికి సిలుగులుదప్ప మఱొండేమియు లేదు" అనుకొని బసవేశ్వరునకును నయ్యర్భకునకును నాగాంబికకును అనేకవస్త్రభూషణాదుల నొసంగి బహూకరించినంత మంత్రివర్యుండు నమితవైభవంబుచే భగినీభాగినేయులంగూడి నిజగృహంబున కేతెంచుచున్నంతఁ బురజనులు నయ్యర్భకునిజననంబును బొగడుచు పరస్పరముముచ్చటించుచు నీలాటిచిత్రము నెందుగానలేదని యనుకొనుచు మహోల్లాసంబున జయపెట్టుచు వారివెంబడి నడుచు చుండిరి.

ఇట్లు మహావిభవంబుతోడ నిలుసొచ్చి మంత్రిపుంగవుండు వేలకొలది భక్తలకు వస్త్రాలంకారాదుల నొసంగి దృప్తిబరచినపిదప మాచయ్యయును, మోళిగ మారయయు, గిన్నరయ్యయు, మాదిరాజును మొదలగు శరణశ్రేష్ఠులు విచ్చేసినంత మచ్చికమీర నవ్వచ్చినవారి కర్ఘ్యపాద్యాదులనిచ్చి యుచితాసనాసీనులంగావించిన వారలామోదభరితులై బసవేశ్వరునిజూచి యిట్లనిరి.

"ఓ మహానుభావా! కారణ శరీరుఁడవైన నీమహాత్మ్యమును వర్ణింప బ్రహ్మదులకును తరమగునా? నీతో బుట్టువైన నాగాంబిక మహత్త్వము నేమని వర్ణింపఁగలము. ఈశ్వరుఁడు జగదుద్ధరణము కొఱకు మిమ్మందఱ నొక్కచో నవతరించ

నియమించెను జగంబెల్ల యచ్చెరువంద జననీ కర్ణరంధ్రమునుండి యవతరించిన యీ యర్భకుఁడు నాదర్శపురుషుఁడై మాబోంట్లను దరింపఁజేయువాఁడనుటకు సందియంబేల? ఈనిర్మలాత్ముఁడు ఈదివ్య తేజోనిధి ఈయసమాన బ్రహ్మజ్ఞాని శర్వభక్తులకు శరణ్యుండై తాపత్రయాగ్ని నిర్దగ్ధ జనులకు మహాఘనంబై యీశ్వర స్థాన ప్రదర్శకుఁడై నెగడును గాన నీమహాత్ముని దర్శనమున మేమెంతయో ధన్యులమైతిమి బౌద్ధాదులచే నాక్రమింపఁబడిన మానవలోకముపునీతమయ్యెను ఈతని దర్శనమాత్రమున నెంతటి మహాపాతకియైనను ముక్తికాంతను బొందకపోనడు. కేవల భక్తి జ్ఞాన వైరాగ్యానుష్ఠానములకు నిలయమైన నీతని నీపేరట బిలుచుటయే మాకందఱికిని సమ్మతంబు" „ అనిన గడుముదంబంది "ఓ యార్యులారా! మద్గురువర్యు నానతియు మీయానతియు నొకరీతియే నయ్యెంగాన మీయాజ్ఞానురీతి నట్లే కానిండని బసవంకయ్యర్భకునకు „ చెన్నబసవరాజు" అను నామకరణంబు గావించెను. పిదప నాబాలకుండును సర్వవిద్యాపారంగతుండై బసవనితోడంగూడి సద్గోష్ఠిం దేలుచుండెను.

పన్నెండవ అధ్యాయము ముగిసెను.

ఆదిమధ్యాంతరహితాయనమః

---



శ్రీమత్పరశివాయనమః

# మడివాలు మాచయ్య చరిత్రము.



## (త్రయోదశాధ్యాయము)



హిప్పరిగెయను గ్రామంబున శుద్ధసాత్విక స్వరూపుండును శమదమాది సంపన్నుండును, ఇందుధరపదాంబుజలగ్నమానసేందిందిరుండును గాఢాద్వైరభద్రావతారుండును రజకజాత్యావృత్తుండును అయోనిసంభవుండును, సత్యనిష్ఠురవాక్యాండును, నగు మడివాలు మాచయ్యయను భక్తుండుండెను. ఆతండు లింగధారణార్థంబై కల్పినాధుండ నెడి మహాత్ముని పజ్జజేరి భక్తితో మ్రొక్కి వినుతించి " మహాత్మా ! నాకొక్క గొప్పలింగంబును ధరింపఁజేయుఁడు" అని ప్రార్థించిన నితని భక్తికి మెచ్చి కల్పిదేవుఁడు కొన్నిలింగంబులం దెచ్చి చూపించిన నందేదియు దనకిష్టము లేమి వలదనుచుండ గురుండు వేసరిల్లి యొక ఘురట్టంబును (తిరుగలి) దెచ్చి చూపించిన నిది బాగున్నదని తల పంకించి దీనిని నాకు ధరింపసేయుమని ప్రార్థింప నతండు నవ్వి యట్లే కానిమ్మని వేదోక్తమార్గంబున నాలింగంబును మెడలోధరింపజేసిన సంతసించి యగ్గురునివలన శైవరహస్యముల నెఱింగి భవుల నంటని వ్రతంబును బూని నిత్యంబు జంగమార్చనలం గావించుచు గల్యాణపురంబున బసవేశ్వరుండు భక్త పూజా

పరుండై యుంటఁ దెలిసి యతని సేవింప గల్యాణంబునకు జనుదెంచి బసవనిచే బూజితుండై తానును భక్తజన సేవను గావింపనెంచి తదీయవస్త్రంబుల నుదికి యారవేసి మడుతలు సేసి యనుష్ఠాన సమయమునందేవరివి వారి కందం జేయుచుండెను. ఇట్లుండ నొకనాడు వాడుకప్రకారము భక్తులయంబరంబుల నుదికి యారవేసి మడతఁజేసికొని వచ్చుచుండ జంగమేతరుడొక్కండు తన్నంటుకొనిన గోపించి తన వస్త్రంబుకొద్ది నామనుష్యుని బట్టిచంపెను అంతట నయ్యూరివారు రాజుకడకేగి మ్రొక్కి "దేవా! యొక్క చాకివాఁడు దానొక భక్తుండనని వీగుచు కటారిఁగొని త్రోవఁజనుచు దానొదుగక నెదురైనవారి నొగుదుమనుచు లేకున్న వానిఁ జంపుదునని బెదరించుచు దిరుగుచు నేడొక్కని జంపినాఁడు వాని దుండగములు భరింప శక్యములుగావు" అని మొరబెట్టుకొనిన బిజ్జలుండు జ్వలనేత్రుండై తనయందలి జంగమద్వేషంబును వెలిఁబుచ్చుచు నట్టిజెట్టను యేనుగు గ్రిందఁబడవేసి చంపిరండని దూతల నాజ్ఞాపింప వారును మావటికి దెలిపిన వాడును గజమునుగొని మాచిదేవుని యంతికంబు సేరి తద్వధార్థంబుఁ గరినిఁబురికొల్పిన నాక్రోశించి మాచిదేవుఁడు నిజభుజబలంబే పారమహాత్వంబు బ్రకాశింప తద్గజంబును సాహిణిని దునుమాడి కేవల వీరభద్రుండో యనునట్లార్చి పేర్చి మహాభాగ్యంబున నెదురగువారికిజమునివలె గానంబడుచు భక్తులకు సంతసంబును బుగిగొల్పుచు "నాపై కేనుగును బుత్తెంచిన దురాత్ముని బీచమడంతు" నని వడివడిగా వచ్చుచున్నంత బిజ్జలుండు గడగడ వడకుచు బసవని శరణము వేడిన నతండు నవ్వి "ఓ రాజా! నేజెప్పినది వింటివా? శైవుల మహాత్మ్యంబు నీవేమెఱుంగుదువు? నీకు శైవాపచారంబును శివాపచారంబును సంఘటించెను.

మున్నిట్టే బావూరి బ్రహ్మయ్యయను నొక భక్తశిఖామణి యుండెను అతఁడు జంగమ లింగపదార విందపరిపూజనా క్రియాపరతంత్రుండై పెక్కు పూదోటలంగూర్చి తొలికోడి కూయువేళ లేచి యాయా తోటలోని పువ్వులం గోసికొని మాలలంగ్రుచ్చి యవ్వాటిని భక్తులిండ్లలో నమ్మికొని తల్లబ్ధధనంబుచే

జంగమారాధనంబు గావించుచుండెను ఇట్లుండ నాయూరిరాజు సైన్యసమేతుఁడై పరమండలంబును జయించఁజని మగిడివచ్చుచు నాతోటల సమీపమున సైన్యమును డించుకొని యుటవిడిసెను. అందలి మదగజంబొక్కటి మత్తిల్లి కట్లను ద్రెంచికొని యెదురైనవారలం జంపుచు చెట్లను బెరకుచు మావంతులను తుండముచే గొట్టుచు చిందరవందర సేయుచు వేకువఁజామున పువ్వులుఁగోసికొని యాత్రోవనే వచ్చు బ్రహ్మయ్యపైకిరాగా నా శైవాగ్రగణి నిజమహత్వంబున దాని నట్లే నిలిపిన నయ్యది భయంబున ఘూర్ణిల్లుచు నిజమదంబునుడిగి యంగంబులు వికలత్వమంద వెనుకవెనుకకునడచి యాయాసపడుచు నెట్టకేల కొకనదీతీరంబునుఁజేరి ప్రాణంబులను విడిచెను. ఆసంగతిని గనిపెట్టుచున్న రాజభటులు కొందఱుచని జరిగిన వర్తమానమును నరపతికి నివేదింప నతండులికిపడి "అయ్యో! శరణవర్యున కపచారమును గావించితిని వారెంత యాయాసపడిరో నన్నేమి నిందించిరో" యని త్వరగా బ్రహ్మయ్యకడకువచ్చి సాగిలపడి మ్రొక్కి స్వామీ! మీకానాయేనుఁగెంతటియపచారముఁ గావించెనో ఆ పాడుయేనుగునకీ దుర్మార్గుడు యజమానిగాన నాయపరాధంబును సైపుఁడు అని యనేకభంగులఁ బ్రస్తుతించిన నాభక్తుండు రాజు వినయంబునకు మెచ్చుకొని యతని మన్నించి యాయేనుఁగును బ్రతికించెను గావున భక్తులతోఁటి విరోధంబు గావించుకొనుట స్వనాశన హేతువగును వారినిగ్రహమే జగత్ప్రళయము వారియనుగ్రహమే నిత్యకల్యాణము శరణమును బొందిన ..నేలాటి పాపియైనను రక్షించకమానరు. నీవిష్టపడితేని యతనికడకేగి శరణాగతిఁబొందుము బ్రదుకుమవు లేదేని నీయిష్ట" మనిన ధరణీధవుండు సేయునదిలేక మంత్రి వెంబడిజని మాచిదేవు నెదుటకుఁ బోఁజాలక వెనునిలిచిన బసవండే మునుజని మాచిదేవునకు మ్రొక్కి భక్తిరసంబు బొంగార యిట్లనియెను "ఓ మహాత్మా! ఈదురాత్ముఁడు భవదీయ మహాత్మ్యంబు నెఱుంగఁజాలక మీకెగ్గుసేసెను పిచ్చుకపై బ్రహ్మాస్త్రమును బ్రయోగింపఁదగునా? యీభూపాలుఁ డెంతటివాఁడు మిమ్మెదిరింప నీశ్వరుండైన సమర్థుఁడు గాజాలఁడు శరణాగతుల రక్షించుటయే తమవంటి దయాపరుల ....

విధి మన్నించుమనిన మాచిదేవుండు నెమ్మనంబున సమ్మతించి తత్క్షణంబ నయ్యేను గుమాంసాస్థులను దెప్పించి ప్రోగుఁజేసి భసితంబును జల్లిన నయ్యది నిదురనుండి మేల్కొను చందాన లేచెను మొదటఁ జంపినమానవునిగూడఁ బ్రదికించెను. అంత నచ్చటి జనులు భయచకితులై వేవిధంబులఁ గీర్తింపుచుండిరి బిజ్జలుండును మాచి దేవుని పాదంబులకు మ్రొక్కి నిజనివాసంబునకుఁ జనియెను.

ఇట్లు కొన్నిదినంబులు గడచినపిదప బసవేశ్వరుండు మాచిదేవునందలి భక్తిచే నతనిపై నాల్గులక్షల యఱువదివేల గీతంబులను రచించి జంగమోత్తము లకు వినిపింప సంతసించుచుండిరి. ఆత్మస్తుతిరూపకంబులగు నాగీతంబులు దనకుఁ గిట్ట మిచే మాచిదేవుఁడు కోపించి వాని విననొల్లక "శివశివా" యని చెవులు మూసి కొని "ఔరా! వీడింతటి యవినీతుఁడయ్యెనా! వీనికెన్నఁడీ యధికారంబు గల్గెను. నన్నెగ్గించుట యపహాస్యంబుఁ జేయుటఁగాదా! ఇఁకముం దీలాటి ప్రసంగముల నాముంగలఁ గావించినచో వీనిపనేమియగునో చూతమని తన నిత్యకృత్యమునకై బోయెను. ఆసంగతిని బసవండువిని భయంపడి భక్తజన సహాయుండై మాచిదేవుని కడకేగి సాగిలిపడి మ్రొక్కి "దేవా! సంతత దురహంకార నిరతుండును, అక్రమాలాపుండును, నిర్వక్రాపరాధుండును, వర్జిత సత్యుండును, అర్జిత కోపుండును, దురాచారుండును, దుర్భాగ్యుండునగు నీభక్తుఁడు దేవరవారిని శరణము వేఁడు చున్నాఁడు గాన మన్నించి వీని యపరాధసహస్రంబుల క్షమించుఁడు నాగర్వమెల్ల మాయించుటకు నాయొనర్చిన నాల్గులక్షల యఱువదినాల్గువేల గీతములఁ దామం గీకరించక పోవుటయే చాలును ఓ గురువర్యా! ఈశ్వరస్వరూపా! యాదీనుని గాపాడుమని యాత్మనిందాతిశయమును వెలిబుచ్చుచుఁ బ్రార్థించుచున్న బసవనిం జూచి మాచిదేవుండు ఓయధమా! నీకింతగ్రొవ్వా? హరభక్తులందరు నధములును నీవొక గొప్పయా? అడిగెడువాఁడు లేకయేగదా నీవిట్టు విఱ్ఱవీగుచున్నావు. ఈజంగమ ముఁకు నీవిచ్చుతొత్తులు గుఱ్ఱములు వికారభూషణములుచింపిరిగుడ్డలు లక్ష్యములను కున్నావా? నీవొక దాతవనుకున్నావా? ఇవిగో చూడుము నాజంగములకిచ్చుపదార్థంబు లను అవియనశ్వరములు అనిపలికి యొకసారి జలంబునువిసరినంత నాజారిన యుదక కణంబులన్నియు, మరకతపుష్యరాగ వజ్రవైడూర్యాదిముఖ్యరత్నంబులై ప్రకాశించు

చుండెను తత్కాంతుల యందినుఁడు ఖద్యోతంబువలె బ్రకాశించుచుండెను తచ్చి త్రంబునుగని యెల్లవారు మిగుల నచ్చెరువంది మాచిదేవు నభినందించుచుండిరి బసవండును మాచిదేవునకు పునఃపునః ప్రణామంబుల నాచరించి సదమల భక్తి యుక్తుండై "స్వామీ! అకించనుఁడను మూఢుఁడనగు నేను మీమహిమంగల నెంత వాఁడను. నీమహాత్మ్యమును బొగడ నాతరమా? నీవు జ్ఞానివి నేనజ్ఞానిని నీవు నిర్మ లుఁడవు నేను దుర్మలుఁడను నీవు త్యాగివి నేను లుబ్ధుండను నీవు శ్రీమంతుడవు నేను నిర్భాగ్య చూడామణిని నీవు సుగుణివి నేను దుర్గుణిని కావున గర్వితుని నన్ను కనికరించి నాయపరాధ శతసహస్రంబుల మన్నించి రక్షించుము" అని పాదంబుల పయిఁబడి లేవకున్న మాచిదేవుండు దయాంతరంగుండై "బసవేశ్వరా! లింగ సద ర్థులకు గర్వంబుండఁగూడదు కరిగినను గాని సువర్ణంబునకు వన్నెరాదు ఉమకు చుండినగాని వస్త్రంబు ధావళ్యంబు ననుకరించదు పిప్పిఁజేసినగాని చెఱుకున రసము వెడలదు అరగించినగాని శ్రీగంధమునకుఁ దావియబ్బదు వరబట్టినగాని రత్నమునకు మెఱుపురాదు కావున భక్తుఁడు గర్వించరాదు గర్వించినచో నాపదల పాలగును పరమేశ్వరుడుఁగూడా మన్నించఁజాలఁడు అని పలికిన బసవేశ్వరుఁడు తన యపరా ధంబునకు వేవిధంబుల మన్నించుమని బ్రార్థించుచు నిజనివాసంబునకు జనియెను. అచ్చటి భక్తులెల్లరును మాచిదేవ బసవరాజులను గొనియాడుచు తమతమ నివా సంబులకుఁ జనిరి.

భక్తవత్సలాయనమః

పదమూడవ అధ్యాయము ముగిసెను.



శ్రీ భక్తాంతర్యామినే నమః

# కిన్నర బ్రహ్మయ్య చరిత్రము.



## [చతుర్దశాధ్యాయము.]



బోడూరను గ్రామమున కిన్నర బ్రహ్మయ్య యనునొక భక్తశిఖామణి వీరశైవనిష్ఠాగరిష్ఠుఁడై లోకైకపూజ్యుండై (సర్వంఖల్విదంబ్రహ్మ) యనురీతి సర్వప్రపంచము శివస్వరూపముగ భావించుచు సమలోష్టాశ్మకాంచనుఁడై సర్వజీవసమభావుండై నిరంతరము భక్తార్చనం గావించుచు శరణుల కెల్లమేటియై ప్రకాశించుచుండెను అమ్మహానుభావుండు సమస్తవిద్యాపారంగతుండుఁగాన శక్తివంచనలేక సంపాదించిన ధనమంతయు జంగమార్చనలకు వెచ్చించి కేవలమునిస్స్వుఁడై తన వీణాపాండిత్యమున శివుని మెప్పించిన నప్పరాత్పరుండు దన్ను నిత్యంబుఁ గీర్తించు నారదుని గానంబునకన్న మిన్నయగు కిన్నెరబ్రహ్మయ్యగానంబునకు మెచ్చి ప్రతిదినంబొక్క మాడ వంతునని చ్చుచుండెను తద్ద్రవ్యంబుచే బ్రహ్మయ్య భక్తజనారాధనలం గావించుచుండెను.

అంతఁ గల్యాణంబున బసవేశ్వరుండు నిత్యజంగమారాధనపరుండై భక్తశిఖామణియగు కెఱింగి కల్యాణపురంబునకుఁ జనియెను ఆమహానుభావుని రాక నెఱింగి బసవేశ్వరుండు యెదురేగి సాష్టాంగనమస్కారంబులఁగావించి భక్తియుక్తుండై యర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి చేయిసాచి తత్పాదతీర్థంబును గ్రహించి తనయింటికిఁ దోడ్తెచ్చి విశేషతత్వానుభవగోష్టి యందివ్యమై వర్తించుచుండెను.

అంతనొకనాడు కిన్నరబ్రహ్మయ్య శివానందము ననుభవించుచు నప్పురంబున నున్న త్రిపురాంతకదేవాలయ గోపురాంతరముననున్నతరి యొక్కకాముకుఁడు దన యింపుడుకత్తెకొఱకు గొఱియనొక్కటిఁగొనిపోవుచుండ నయ్యదిమొకతాడుం ద్రెంపుకొనిపాఱి దేవాలయంబుసొచ్చినంత వెంటనే వాఁడు గొఱియంబట్టికొనిపోవ యత్నించ నద్దానింజూచి బ్రహ్మయ్య గోపురంబుఁదిగివచ్చి వానితో నిట్లనెను "ఓయీ దీనిని నీవెందుకు శ్రమఁపడి పట్టుకబోవుచున్నావు ఇదిప్రాణభీతిచేతనే ఈగుడిలోఁజొచ్చినది శరణాగతులను రక్షించుట శరణులమార్గములు ఈతుచ్ఛమైనజిహ్వారుచికేల యింతటిపాపమున కొడిగట్టెదవు (మాహింస్యాత్సర్వాభూతాని) (అహింసాపరమోధర్మః) అని వేదములాజ్ఞాపించుచున్నవి ఈపశుదేహము మనదేహమునకన్నఁ జిన్నదియైనంతమాత్రమున మనము వానిని వధించఁదగునా? అందున్న జీవుఁడు మనకంటెఁ జిన్నవాఁడుగాఁడు మనలనొరులు హింసించినచో మనకాయాసముఁగల్గదా ? అట్టే యితరులకనుకొనవలయును ప్రతిశరీరమునందును జీవునితోబాటు నీశ్వరుఁడు బ్రవిష్టుఁడైయుండును వానికి మన మపరాధముఁ గావించినవారమగుదుము కావున నామాటలనాలించి దీనినివదలిపెట్టుము దానములలోనుత్తమదానము ప్రాణదానందే అంతకంటె వేరేపుణ్యంబులేదు నీకొకవేళ నీయుంపుడుకత్తెవలన భయంబుండిన నిదిగో రొక్కమును బుచ్చుకొనుము. ఈగొఱియ నేదినవలెనని నీకేమియును నేమములేదు. నీకనుమానముండిన నిదిగో పసిడిమాడను బుచ్చుకొనుము" అనిన నక్కాముకుండు "ఓమహాత్మా! మాభోగ్యవస్తువు

నకు మీరేల నడ్డగించెదరు దానివలన వచ్చెడి పాపపుణ్యంబులు మాయవియే కాని మీకేమియును లేవుగదా? ఒకవేళ మీరిద్దాని వెలనిచ్చిన నిత్తురుగాని మాకు నచ్చినవస్తువును మేమెట్లు వదలుదుము. నీరొక్కమున కాశించితినా? వేయిమాడల నిచ్చినను నాకువలదు" అని చెప్పి గొఱియను పట్టుకొనఁబోవఁ బ్రహ్మయ్య యిట్లనియెను "ఓ పిచ్చివాఁడా! ప్రాణరక్షణకన్న నెక్కుఁడు పుణ్యములేదు నీయిష్టముచొప్పున నిదే వేయిమాడలఁ గైకొనుము. నేనుమాత్రము ఈప్రాణిని వదలను" అని యాతనికి వేయిమాడలిచ్చిన నాతడు బ్రహ్మయ్య యుదారమునకు సంతసించి వేయిమాడల నెంచికొని మందకఱిగి మఱొక్క గొఱియనుగొని చని జరిగిన సమాచారమును తన విటురాలికి విన్నవించిన నదిగోపగించుకొని "ఓయీ! నీవెంత వెఱ్ఱివాఁడవు? రొక్కమున కాసపడి నలుగురిలో నగుబాట్లఁ దెచ్చితివి నీయంతటి విటుడుండిన నాకేమిఁ దక్కువలేదులే ఇంతమాత్రము చేతఁగాని పందవు నావద్దికేల రావలయును. విత్తముపైఁ జిత్తముండిన నేటినుండి నీయింటనే యుండుము దేవతలకు బలియిత్తుమని యేర్పరించిన పశువును విడిచి మఱొక్క పశువునుదెత్తువా దైవము మనల సేవగించదా? నలుగురు వినిన డబ్బునకాసించి చెడుపనిఁ జేసిరని నవ్వరా? నీనేస్తముఁ జాలించుము పిరికిపందా" యని యమందముగ నిందించిన నమ్మొం దుండు లంజెమాటలకదరి "ఓ ముద్దులగుమ్మా! నన్నేలఁ దిరస్కరించెదవు? నీవడిగి నంత ద్రవ్యమును వెచ్చించుటకు నేను వెనుదీయువాఁడనా? ప్రేయసీ నీకన్న నాకన్యం బేమున్నది? నాతనుమనోధనములు నీస్వాధీనంబులైయున్నది నీదాసానుదా సుండనుగానా పరులు నగునట్లు నీకవమానంబునుగూర్చి నేనుజీవించజాలుదునా? యని పలికి తత్క్షణంబలేచి (కామాతురాణాం నభయం నలజ్జా) యనురీతి వాఁడు నుఁగానమి దమిచే దబ్బిబ్బుఁబడుచు నత్వరంబునగుడికడకుఁజని గొఱియనుబట్టబోవఁ బ్రహ్మయ్య కోపించి "ఓ తుచ్ఛమానసుఁడా! నీచిత్త మిప్పుడే యధర్మాయత్తమై నదా? నీవా గొఱియను ముట్టితివేని బసవని యానసుమా! శరణాగత జనంబులవిడు చుట మాధర్మముగాదు. నీవువినక గొఱియను బట్టితివేనినీతల నఱికెదనునామాటను వినుము ఊరక చెడిపోకుము అని నొక్కివక్కాణించినను వినక నక్కాముకుఁడు శరించి గొఱియనుపట్టవచ్చినఁ బ్రళయరుద్రుభంగి మీఁదఁబడి భయంకరాకారుండై బ్రహ్మయ్య

తన నిశితకరవాలంబున నతని తల నఱికిన నది గుడిలోపలంబడియెను. పీనుగు గుడి లోనుండఁగూడదని దీయించి యగడ్తలో వేయించెను.

ఈసంగతిసంతయుఁ జూచుచున్న వానిబందుగు లేడ్చుచు ధరణీశుని కడకఱిగి సాగిలిమ్రొక్కి యిట్లనిరి దేవా! కిన్నర బ్రహ్మయ్యయను నొక్క భక్తుండన్యాయముగా తప్పేమియును లేకున్న మావానిం జంపినాఁడు శివభక్తులమని చెప్పువారింత యన్యాయముం జేయువచ్చునా? ధర్మమూర్తులగు మీరు న్యాయమును విచారించవలయును" అని మొరబెట్టుకొన్న బిజ్జలుండు గోపించి బసవరాజుంజూచి "ఓయీ, ఇదే మన్యాయము శివభక్తులు కేవలము సత్వగుణోపేతులును అహింసా పరులును దయాగుణాన్వితులును సత్యసంధులును అని పల్కారు నాతోఁ బొగడుచుందువు ఇట్లు నిరపరాధులఁజంపఁ బాడియగునా? మీయిష్టమువచ్చినట్లుఁ జెలరేగుచున్నారు రేపు నన్నుఁగూడా జంపుదురు, ఒకనిఁ గాలఁదన్నుట బాలకుని జంపుటయు. మాంసంబుఁ బెట్టుటయు, ఆలనువ్వుటయు, కులశిలంబుల నంతరింపఁజేసి యందఱేకమై పంక్తిఁగుడుచుటయు, తలల నఱుకుటయు, సుదతినొసంగుటయు, నీలాటి దుష్కర్మ లన్నియును మీధర్మములు పరులనమాత్రి మపహసించుదురు ఇట్టి దుండగులతో రాజ్యంబునేయుట నాచేతగాదు నేటినుండియు మీరే రాజ్యము నేలి కొనుండు అని నిష్ఠురంబుగా బలికిన బసవన యిట్లనియెను "ఓతేడా! కల్లనిజంబుల నెఱుంగకఁ బలుకఁ దగునా? బ్రహ్మయ్య యొకని నన్యాయముగఁ జంపుటకు మూర్ఖుఁడుగాఁడు ఇందలి కార్యాంశమేమో నిజము నెఱుంగవలయుననిన వల్లెయని భూవల్లభుండుఁ గొందఱ మంత్రులం బిలిచి కిన్నర బ్రహ్మయ్య సంగతి నఱసి రండని తోలించెను.

అంత వారు త్రిపురాంతకుని గుడినొచ్చి బ్రహ్మయ్యకు మ్రొక్కి "మహాత్మా మీరు కేవల సాధువృత్తులై యహింసాపరులై పరుల నన్యాయముగా నిట్లుఁజంపుటఁ బాడియగునా? గొఱియకొడుకు నిలపరాధుం జంపితిరట ఆసంగతిని విచారించి రమ్మని మారాజు మీకడకు మమ్మంపెను యిందలి నిజంబేమో యెఱింగించుండనిన

బ్రహ్మయ్య వారింజూచి "ఓ ధర్మాత్ములారా! మీ పెడుగు మాటలం జాలించుడు. శరణు లోకరి కవమానముఁ జేయువారుగారు నిరపరాధులను దండించువారుగారు ఈశరవాది దానోకగౌరియనుజంపబట్టుకొని పోవుచుండెను. అయ్యదిభీతిల్లి క్రాటిని త్రెంపికొనియీగుడి సొచ్చెను. దాని నేగాపాడ నెంచి వానికి వేయిమాటలసిచ్చి దీనిం గొంటిని అదియిప్పుడు శైవరక్షితమై శివముద్రిలచే బ్రదుకుచున్నది. ఆ పెడుగువాఁడు లోక్కమును బుచ్చుకొనియు విటురాలి మాటలనువిని తిరిగి నీగోటియును బట్ట వచ్చెను నేనెన్ని రీతుల బుద్ధులుఁజెప్పినను వినలేదు దాననే గోపించి వానితల నఱికి తిని ఇంతియే నిజంబు సెప్పితిని నామాట నమ్మకున్నచో నీదేవుని సాక్ష్యమిప్పించెదను అని పలికిన నతని వాక్యములకందఱచ్చెరువంది సని బిజ్జలున కెఱింగించ నాతఁడును విస్మయంబంది బసవనిఁ దోడ్కొనివచ్చి యచ్చోటం జేరెను. బసవేశ్వరుండు భక్తి యుక్తుండై బ్రహ్మయ్యకుమ్రొక్కి "జయము జయము మహానుభావా! సుప్రభావా! సుగుణంబులప్రోవా! విమలభక్తినిధానా! సత్యసత్వస్థానా! సకలాగమ మోక్తాచార విధానా! శాంతినికేతనా! శుభశైవ నిష్ఠైకతానా! నీకు ప్రణుతించుచున్నానని వినుతించి నిలిచెను భక్తగణంబంతయు నీయుదంతంబునువిని తండోపతండంబులుగా వచ్చి గుడింజేరెను అంత బ్రహ్మయ్య నిజమహాత్వంబును సూపింపనెంచి దన యందలి నిశ్చలావ్యాజ భక్తిచే బరమాత్ము నభినందించి ,, ఓ పరాత్పరా! సర్వలోక శరణ్యా! కల్యాణ గుణగణ్యా! త్రిగుణాతీత! భక్తిక్రీత! ఈ మందభాగ్యునిపై యమంద కటాక్షంబులఁ బఱపి సురతాంతమున గాంతా కుచంబులపయిం జెయి వేసి నీవని భ్రాంతిచే బిలిచిన యొడయ నంబికో యన్నట్లును బావురి బ్రహ్మయ్యకు జొన్నలై గనబడినట్లును, వాదంబులో కేదర దాసయ్య బిలిచిన చీమనుండి బలికినట్లును, ఇప్పుడు సాక్షిలుపున కుత్తరంబియ్యవే త్రిపురాంతకా! యని పెల్లార్చి పిలికిన భక్తమనోవాంఛితార్థదుండగు పార్వతీ నాథుం ,,ఓ" యని మారు బలికెను. అంత నక్కడనున్న లింగాంగులుదప్ప దక్కిన నరమృగపశుపక్ష్యాది జంతువులెల్ల విగత జీవులై పడియెను కటకంబంతయు నల్లకల్లోలమై విగత ప్రాణమయ్యెను ధరణి కంపించెను. జలజలజుక్కలు రాలెను. సూర్యుండస్తమించెనుగిరులుఁడొల్లెను నద నదీ సహితంబుగ గూపారంబేపుఁదక్కియుంకెను. ఆదికూర్మంబు దలంకెను. లోక

పలురు జీకాకుబడిరి అప్పుడు ప్రళయంబుభాతి జగంబునంతయు సుషుప్తింజెందించి పరశివుండు ప్రమథులు దానును భక్తులతోఁగూడి యానందంబు ననుభవించు చుండెను. ఇట్లహోరాత్రింబు లేడుదినంబులును ప్రపంచంబంతయు నంధకార బంధుర బై వ్యవహార శూన్యంబై యుండుటంగని పరమకారుణికుండగు బసవేశ్వ రుండు భక్తియుక్తుండై బ్రహ్మయ్యకు మ్రొక్కి "దేవా! ఇట్టే జగంబంధకార బంధురంబై వ్యవహార శూన్యంబైన మిగుల బరితాపంబు గలుంగును. దేవరలు గనికరించిననే జగంబులు దమతొంటి స్వరూపంబును బొందును భవదీయ ప్రతా పంబునకు నెదురు నిల్వ నేరితరంబగును. ఓ సజ్జనమౌళి శృంగార! జలధిగంభీర! సమస్త జగదాధార! సాక్షాచ్ఛంకరాకార! కల్యాణగుణధామా! నిరవధిక భక్తిస్థేమ దురితదూర! దూరీకృత సంసార! నిర్జితాహంకార! అఖిలజగదుపకార! వీరశైవ ప్రతాచార్య! భక్తజనవర్య! కారుణ్యజలనిధీ! ఈదీనజనులఁ గరుణించి పాలించు మని ప్రార్థించిన సంతసించి బ్రహ్మయ్య బసవేశ్వరునభినందించి గుడితలుపుల దిక్కు క్రేగంటంజూచి "ఈశ్వరా! సర్వలోకశరణ్యా! కరుణాకరా! నీలీల నుప సంహరించి జగంబును రక్షించుమని ప్రార్థించెను వెంటనే సూర్యుండుదయించెను. అంధకారము మాయమయ్యెను. మూర్ఛను మునింగిన సకల జీవులును సప్రాణులై లేచిరి అంత బిజ్జలుండునులేచి బ్రహ్మయ్య పాదారవిందంబులపయింబడి మ్రొక్కి "మహాత్మా! ఈ దీనుల సంరక్షించ నభయంబీయుఁడు, అజ్ఞానులమై మేముజేయు నపరాధంబులను క్షమించుడు మీరలిగినంత మాత్రముననే చతుర్దశభువనంబులు నంధకార బంధురంబులై దీర్ఘసుప్తింజెందెను మీరొకఘటనాఘటన సమర్థులు సాక్షా దీశ్వరాంశసంభూతులు మమ్ము నీటముంచినను పాలముంచినను మీరేదిక్కు మీకన్న మాకన్యధా శరణంబులేదు (క్రియాసిద్ధిస్సత్వేభవతిమహతాంనోపకరణైః) అనునట్లు మహాత్ముల కేదియు సాధించరానిది లేదు. మేమో జడమానవులము మీమాహాత్మ్య మును దెలియంజాలము కావున మమ్ము గటాక్షదృష్టులం బరికించి పాలింపుడు యని యనేక భంగుల ప్రార్థింప (ఉత్తమస్య క్షణంకోప) మనునట్లు సాధువులు

కేవల దయావరులు గాన బ్రహ్మయ్య తన మానసమును నిర్మలముగ జేసికొని ,, ఓ రాజా! బ్రతుకుపొమ్ము శివభక్తుల పాదచ్ఛాయనైమనుము అని చెప్పిపంపించి భక్తులును బసవండునుబోగడ నిజనివాసంబునకు జనెను కలజనంబెల్ల బ్రహ్మయ్య మహాత్మ్యమును గీర్తింపుచు నిజనిలయంబులకు జనిరి.

లోకాతీతాయనమః

పదునాలుగవఅధ్యాయము ముగిసెను.



లోకాతీతాయనమః

# కలకేత బ్రహ్మయ్య చరిత్రము.

## [పంచదశాధ్యాయము.]

కల్యాణపురంబున కలకేత బ్రహ్మయ్య యను శరణజనోత్తముఁడుండెను. ఆ పుణ్యచరిత్రుండు గణ్యజంగమ లింగవిశ్వాసియై నిర్మూలిత కర్మవాసనుండై సమలోష్టాశ్మకాంచనుండై (దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషువిగతస్పృహః । వీతరాగభయక్రోధస్స్థితధీర్మునిరుచ్యతే) అనునట్లు దుఃఖకాలమున దుఃఖింపక సుఖకాలమున సంతోషింపక అరిషడ్వర్గంబులకుఁ జిక్కక కేవల శివధ్యానపరాయణుండై (విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని । శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః) అనునట్లు సర్వభూత సముఁడై లింగైక్యనిష్ఠాపరుండై (తృణీకృతవిరించ్యాదినిరంకుశవిభూతయః) అనునట్లు బ్రహ్మాదిలోక సౌఖ్యములను గడ్డిసమానముగా జూచుచు బరిశుద్ధ లింగానుభవుండై అద్భుతశీలుండై బరగుచు నొక గిల్కను, తగరుకొమ్మును, గదను, చేపట్టి కలకేత వేషంబును దాల్చి భక్తులిండ్లకుజని భిక్షంగొనుచు బ్రతిదినంబు నిరుసధాన్యంబును సంపాదించి తెచ్చి దాన భాగవతారాధనం గావించుచుండెను ఇట్లుండ నొకనాడొక భక్తుండు బ్రహ్మయ్యమగాంచ నేతెంచుచుఁ గడుడస్సి యాకలింగొని యాయాసపడుచు నవ్వాలి కడుగిడగజాలమి కలకేత బ్రహ్మయ్యకడ నిల్చిన నాతడబ్భక్తున కుచితసత్కారంబులం గావించి పథశ్రమంబును దీర్చి మజ్జనభోజనాదులం జేయించి కూర్చుండబెట్టి "యోయయ్యా! నీవింత శ్రమలంబడుచు నెక్కడికేఁగుచున్నావు? నీకార్యంబేమో సెలవిమ్ము? అనిన నాతఁడో మహాత్ముఁడా! నేనేమి చెప్పుదును నాశ్రమలింతంత యనరాదు (దారిద్ర్యం జనతాపకారణమిదం కేనాపి దగ్ధం నహి) అనునట్లు

లోకమునంతయును మ్రింగుచున్న దరిద్రదేవతను నశింపఁజేసిన వాఁడెవ్వఁడును లేఁడు. ఆ దారిద్ర్యదేవతకు నేను గురినై మిగుల శ్రమఁబడుచున్నాను ఆశ్రమల పడిన కాలంది (జీర్యంతే జీర్యతః కేశా దంతా జీర్యంతి జీర్యతః । చక్షుశ్శ్రోత్రే చజీర్యేతే తృష్ణైకా నిరుపద్రవా) అనునట్లు వెంట్రుకలునఱిసినను దంతము లూడినను, కనులు గానరాకున్నను, చెవులు వినరాకున్నను, ముదిమి యొచ్చినకాలఁది తృష్ణనిరుపద్రవమై బ్రబలుచున్నది. అట్టి యాశచే బాధింపఁబడి సుతదారోదర పోషణార్థమై ద్రవ్యములేక నిందుఁ గిన్నరబ్రహ్మయ్యయను మహానుభావుండు శివుని బలికించినాడని విని ఆతండు నాదరిద్రమునుబోఁగొట్టుననుపేరాసచే వచ్చితిని ఆతడింకెంత దూరముననున్నాఁడు అతనింగాంచినఁగాని నాయాయాసము దీరదు అని పలికిన కలకేత బ్రహ్మయ్య యిట్లనియెను. ఓ స్వామీ! మీరింత శ్రమపడనేల! మీశ్రమ కెంత వెలనిచ్చినను దక్కువయే? కూలిజేసినవానికి దగినకూలి నియ్యకపోవుట యుచితముగాదు. మీరంతదూర మఱుగపనిలేదు. మీవలసినంత ద్రవ్యంబును గొనిపోఁడు అనిచెప్పితనచేతి గుదియను గిల్కునొంకొంటితోఁ దాకించినంత దంగెడు పువ్వుల చందన సువర్ణనిష్కంబులు కుప్పలు కుప్పలై రాలుచుండిన నయ్యర్థంబుపైఁ బట్టలంగప్పి మూటలఁ గట్టియిచ్చిన నయ్యాగంతుకుఁడు తామోయు కొలందిధనంబును గట్టికొని బయలుదేలి బసవని నగరువరకువచ్చి మోయజాలక మూటను క్రిందఁబడవేసి బసవని వద్దికిఁజని ఓ మహాత్మా! నామూటను మోయుట కొక పరిచారకుని దయచేయుడు ఇదే కలకేతబ్రహ్మయ్యగారు నాకు ధనంబు నొసంగినారు మోయజాలకున్నాను. అనిన బసవండాశ్చర్యంబునొంది ఆహా లింగ సదర్థులకు కానిపనిలేదు. బ్రహ్మయ్యను నేనెఱుంగనా? కాని ఆతని మహాత్మ్యము నెన్నఁడెఱుంగనైతిని కల్పవృక్షంబేయున దానిది మందభాగ్యంబు చింతామణియందు శాశ్వతములేదు. కామధేనువు నాశ్రయించువారి కార్యములు క్షణికములుకాని బ్రహ్మయ్యగారి యీవికంతములేదు. కిన్నరబ్రహ్మయ్యకు కలకేత బ్రహ్మయ్యకు సాటిఁజెప్పనచ్చును. అని తనమనంబున జింతించి యా శరణున కొక్కపరిచారకు నిచ్చి పనిచి కలకేత బ్రహ్మయ్యగారింటికిఁజని యత్తనికి సాగిలిపడి మ్రొక్కి యిచేక

విధంబుల నుతించి "ఓ స్వామీ! దేవరవారి ప్రభావంబుఁ దెలియక నేనెంతయో వెఱ్ఱినై తిని ఇంతవరకును భవదీయ పాదతీర్థ గ్రహణంబు సేసి కృతార్థుండఁ గాక బోయితిని. అని వినయంబొప్పపలికిన బసవేశ్వరునిగాంచి కలకేత బ్రహ్మయ్య యిట్లనియెను. ఓ మంత్రీశ్వరా! ఈయల్పజ్ఞు నేలనిట్లు బొగడెదవు. కిన్నరబ్రహ్మయ్య కన్న నేనెక్కుడుగాదు అతఁడు జేసిన శివపూజాఫలంబునకు శివుని మారు బలికించు చున్నాడు శివపూజంజేసిన ఫలంబునకే నింతవరకు శివునివలన బ్రతిఫలంబు నేమియు బొందక చెడిపోయితిని ప్రతినిత్యమును చెమ్మటలోడువ గాయకష్టంబుఁజేసికొను నాకుఁ గుంచెడు ధాన్యమైనఁ దొరకనేరదు. శివానుగ్రహంబునొందిన కిన్నర బ్రహ్మయ్యగారికి కొదువయేమి? గాని ఆతని పేరు ప్రసిద్ధమగుటచే నతనివద్ది కనేకులు వచ్చుచుందురు వారి వ్యయమునకుఁదగినంతద్రవ్యము నావద్దలేకున్నను శంకరుడిచ్చిన నాకాయకష్టలబ్ధధనం బించుకగలదు. మీబ్రహ్మయ్యకుఁజెప్పి వేలకొలది బండ్ల నంపుమనుము ఈద్రవ్యంబునును జూడుమని గుదియను వేసినంత నపారద్రవ్యంబు రాసులై గానంబడెను. దానింగాంచి బసవన మంత్రి యాశ్చర్య చకితుఁడై ఆనంద పారావారంబున మునింగి చూచుచుండెను. ఇంతలో గిన్నరబ్రహ్మయ్య యీ వృత్తాంతమునువిని కలకేత బ్రహ్మయ్య యింటికివచ్చి యతనికి సాష్టాంగ నమస్కారంబుగావించి నంత నతండు కిన్నరబ్రహ్మయ్యను బిగ్గరఁగౌఁగలించుకొని కూర్చుండ నిచ్చిన నాయిరువురును లింగానుభవానందంబున గొంతవడి మునింగి యనంతరము కలకేత బ్రహ్మయ్య యుచితాలాపంబుల నిరువురనిం ద్దనిపి వీడ్కొలిపెను. బసవనయు బ్రహ్మయ్యయు కలకేత బ్రహ్మయ్య మహత్వంబున కచ్చెరువందుచు నిజనివాసంబులకుఁ జనిరి కలకేత బ్రహ్మయ్యయు తొంటియట్ల తన కాయికంబు నాచరించుచు జంగమారాధనలం గావించుచుండెను.

అభీష్టఫలప్రదాయనమః

పదునేనవ అధ్యాయము ముగిసెను.



శ్రీలక్ష్మీప్రదాయనమః

# మోళిగ మారయ్యా చరిత్రము.

(షోడశాధ్యాయము.)

---

కల్యాణంబున మోళిగ మారయ్యాయను భక్తోత్తముండు నిరవధిక శివభక్తియుక్తుండై విమల శైవాచార సంపన్నుండై అరిషడ్వర్గంబులఁ జయించి లింగైకనిష్ఠ చేమించి నిరంతర శైవార్చనలం జేయుటయే భవతారకమని యెంచి ప్రపంచవాసనల నెల్ల నడంచి నిరవధిక శివతత్వంబు నెఱింగి కేవల రుద్రావతారుండో యన విలసిల్లుచుండెను. అమ్మహానుభావుండు ప్రతినిత్య ముదయంబు లేచి (పంచాక్షరజపంభస్మ స్నానంలింగార్చనంత్రయం కదాచిదపిన త్యాజ్యం యథాశక్తి సమాచరేత్) అను న్యాయము ననుసరించి పంచాక్షరీ మంత్రము నుచ్చరించుచు భస్మస్నానముఁ గావించుకొని (నమఃపరాయై పరమేశ్వరాయ గుణాత్మికాయై గుణవర్జితాయ శుభప్రదాయై సుఖమోక్షదాయ నమశ్శివాయైచ సదాశివాయ) అని పరాత్పరుని ధ్యానించుచు నరణ్యంబునకేగి చేతనైనంత కట్టెల మోపును శిరంబున నిడికొని పురంబుం జేరి దానిని విక్రయించి దానవచ్చిన ధనంబుచే భక్తార్చనం గావించుచుండెను

ఇట్లుండ నొకనాఁడు బసవనింటం గుడుచు జంగమకోటిం బ్రార్థించి మారయ్య భక్తి పురస్సరంబుగా లింగార్చనం గావించిన వారందఱు సంతృప్తులై బసవనివద్దికివచ్చి "బసవన్నా! మనపట్టణంబున మారనంతటిభక్తులు లేరుగదా? నీయింటి

రసరసాయనంబులకన్న వానియింటియంబలి యెంతయో రుచిగానున్నది అతండు భక్తనిధానము సత్వస్థానము, భక్తరాజము ఆహా! అతఁడు కష్టించి తెచ్చునది యిసుమంతయునులేదు. కాని తూములకొలది తనయింట నిత్యము జంగమారాధనకై వెచ్చించుచుండును. అతని నుతింప మావశమగునా? యని పలికిన బసవండాశ్చర్యచకితుండై మారువేశంబునూని మారనింటకేగి యతండు లేకుండుటయు నతని యిల్లాలింగాంచి సాష్టాంగ ప్రణామంబు నాచరించిన నయ్యువిదయు ప్రతివందనంబు నాచరించి యర్ఘ్యపాద్యాదులిచ్చి యుచితాసనాసీనుం గావించి నంత బసవండు "ఓ యమ్మా! నాలింగని కాకలివేళ యయినది ప్రసాదంబు నొసంగుమని లేచి సత్వరంబుగ లింగార్చనను ముగించి రెండువేల మాడల పొట్లములంగట్టి లింగపూజా పేటికక్రిందనునిచి లింగప్రసాదంబునుగొని ధన్యమన్య మానసుండై పెన్నిధానంబునుగన్న పేదభంగి మిక్కిలి యానందంబునొంది నేఁడుగదా నాజన్మము పావనమయ్యెను. ఈగృహంబేకదా ముక్తికితావు ఈప్రసాద భోగంబేకదా భక్తికి మూలంబు ఈపావన గృహాంగసీమనిల్చి ప్రసాదంబు ననుభవించువానికి దోషంబులుండునా? ఈయింటనుండి వెడలువాఁడు కృతార్థుండుగాఁడా! ఆహా ఈవాడం జరించు జంతువులకు కైలాసంబు కరబదరీ ఫలసమానంబుగాదా? ఈయింటివాకిలి పరాగంబు యిసుమంతఁ దలసోకినవానికి భక్తిసామ్రాజ్యము దానంతటవరించదా! ఈయింటి జలదారి నీరైననుపుడిసెడుద్రావిన నిర్మలత్వము సంభవించదా! యెంతటి మాహాత్మ్యము? యెంతటి పుణ్యము? నేనెంతయో ధన్యుఁడనైతిని అని తలపోయుచు నిజమందిరంబునకుం జనెను.

అంతట మారయ్య మధ్యాహ్నంబగుడు నింటికేతెంచి కట్టెల మోపును డించి యిలుసొచ్చి తానమాడి మడుగులంగట్టి పంచాక్షరిం జపించుచు విభూతినలంది శివపూజా పేటికందీసిన దానిక్రింద బసవనయుంచిన రూకలపొట్లములంగని తన పత్నింబిలిచి యివి యెక్కడనుండివచ్చినవి యిందెవరుంచినారు అనిన నయ్యువిద విస్మయపడి "ఓ నాథా! యిపుడొక్క భక్తవర్యుండువచ్చి లింగపూజం గావించి

చనినాఁడు ఆవలఁ జరిగినసంగతి నేనెఱుంగ" ననిన మారయ్య సంతసించి "ఓహో యింతటి భాగ్యశాలి బసవన్నగాక మఱెవ్వరున్నారు అతఁడు నెఱదాతి గావున బీదభక్తులఁ బాలించ నిట్లుఁగావించియున్నాఁడు కానిమ్ము ఈధనంబు నాకేందుకు? ఈశ్వరుఁడిచ్చిన కాయకష్టలబ్ధమే మిగులనున్నది. అని రెండుపొట్లముల నిరువురి జంగములకిచ్చి భక్తానుగ్రహంబు గలవాఁడగుటచేఁ దత్పాదంబులఁగడిగి తత్పావనోదకంబును కట్టెల మోపుపైనం జల్లినంతమాత్రమున నే నది బంగారమై కన్పడెను అంతఁ దానిని వేయిమూడలమొత్తుచొప్పున తునకలునఱికి శరణోత్తము లందఱికిని శివార్పితంబుజేసి దానానంద పరిపూర్ణుఁడై యున్నంత నాశరణవర్యులు సంతోషస్వాంతులై మంత్రికడకుఁజని జఱిగిన వర్తమానంబంతయు నెఱింగించిన బసవేశ్వరుండులికిపడి తటాలున లేచి మారనింటికిజని యతనింగాంచి సాష్టాంగ సమస్కారంబుగావించి దేవా! ఈదీనుని రక్షింపుము నాజేసిన యపరాధంబును క్షమింపుఁడు (అకించనోనన్యగతిశ్శరణ్యస్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే) అని ప్రార్థించిన బసవనింజూచి మారయ్య యిట్లనియెను. ఓ ప్రభూ! నీవేల నిట్లానతిచ్చెదవు నీవు గావించిన యెగ్గేమున్నది! బీదభక్తులకెల్ల నీవేఁగదామనుగడ! మాబోంట్ల కెల్లరకు నీవేకదా యుద్ధారకుఁడవు. మున్నెన్నఁడును కనివినవిమాడల పొట్లమును నేడు నీవలనగదా గనులారఁజూచితిని. నీయంతటి భక్తుఁడు పరోపకారియు, జంగమార్చకుఁడును నీలోకంబునఁగలడా? బాపురే! నీవు ప్రతినిత్యమును శరణులకు నేఁడు నాకిచ్చినట్లే యిచ్చుచుందువుఁగదా! నీయేలుబడిలోనున్న మమ్ముల నుద్ధరించుచుందుము. నీవు యెల్లప్పుడును మాకుపెద్దవు. అని యనేకభంగుల నుతించుచున్న మారనింగాంచి బసవరాజు తనకను గొలకులనుండి యశ్రుకణంబులురాల నతని పాదంబులపైఁబడి "ఓ తండ్రీ! మూర్ఖుండనగు నన్నిట్లు మీరుబల్కుట భవదీయ కృపకు దూరుఁడనైతినని భీతిల్లుచున్నాను. మేరువునకున్న గుణంబు కాకఁబునకును బంగరుకున్నకాంతి యినుమునకును, మల్లెపూవునకున్నతావి కింశుకంబునకుండునా! ఆవమున రాగిముంత, కుంపటిని కమలము జన్మించునా! దయానిధీ నన్ను వెలిసే యక రక్షింపుము. వివేకశూన్యుఁడను అల్పమతిని ఆచారము లేనివాఁడను, కేవల

మజ్ఞుఁడను. అని విన్నవించిన మారయ్య కౌతుకంబంది బసవని లేవనెత్తి కౌఁగిటం గ్రుచ్చి " ఓ యన్నా! నీవిప్లేల విన్నవోయెదవు. మనలనందఱిని రక్షించుట కాక ప్రభుఁడున్నాఁడు. మనము ప్రభువులముగాము, రక్షకులముగాము, (ఏకో దేవస్సర్వ భూతేషుగూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ♦ సర్వాధ్యక్షస్సర్వభూతాధి వాసస్సాక్షీ నేతా కేవలో నిర్గుణశ్చ ♦ నభాతిసూర్యోనచతారకాశ్చ నభాతివిద్యు న్నచభాతిపావకః ♦ ప్రకాశమానేహి సదాత్మవస్తుని ప్రభాతిసర్వం పరమాత్మనా సదా ♦ ఏతద్వస్తు పరంబ్రహ్మ తద్వస్తు పరమంశివః ♦ శివఏవపరంబ్రహ్మశాశ్వత) పరమశ్శివః ♦ శివోగురుశ్శివోదేవ శ్శివోబంధుశ్శరీరిణాం ♦ శివఆత్మాశివో జీవశ్శి వాదన్యంనకించన) అనునట్లు ఈశ్వరుఁడే సర్వాధ్యక్షుఁడై సర్వాధారుడై సర్వ వ్యాపియై త్రిగుణాతీతుఁడై సాక్షియైయుండును. ఆ ఈశ్వరుని ముంగల సూర్యాగ్ని తారకాదుల ప్రకాశ మేమాత్రము పనిఁజేయఁజాలదు. అట్టి పరశివుఁడే గురువు, తండ్రి, తల్లి, బంధుగు, యజమాని, కర్త, హర్త, జీవుఁడు, పరమాత్మ, ఆ శివున కన్న నన్యమైన వస్తువెద్దియును లేదు. మఱియును (తత్సృష్ట్వా ♦ తదేవానుప్రవిశత్, అనునట్లు నాపరశివుఁడు సకల ప్రపంచమును సృజించి వానియందుఁ దాను జీవుని వెంటనే ప్రవేశించి యేకీకింగన్పట్టకుండ నున్నాఁడు. వాఁడు (అణోరణీ యాన్మహతో మహీయానాత్మాగుహాయానిహితోస్యజంతోః ♦ తమక్రతుంపశ్యతువీతశోకోధాతుః ప్రసాదాన్మహిమానమీశం) అనునట్లు అణువునకంటె నణువై ప్రపంచసజంతు హృదయకుహరమున నిమిడియున్నాఁడు. మహత్తుకంటె మహత్తై ప్రపంచమును తనపొట్టలో నింపికొనియున్నాడు. అట్టివాని నిర్హేతుక జాయమాన కటాక్షముననే లెద్దర్శనమును జేసికొనఁగలము. వాఁడులేనితావు లేదు. మనముజేయు మంచి చెడుగులకు శివుడు సాక్షియై తత్తత్ఫలంబుల నిచ్చును. వానికి మనవలెనే జరా మరణాదివికారగుణంబులులేవు. శివుఁడు కేవల నిత్యానందకల్యాణగుణ పరిపూర్ణుడు వానియెదుట నితరదేవతల యాటలు సాగిరావు. వాడే సర్వమున కధిపతిగాని వాని కొక నాయకుడు లేడు. (యతోవాచో నివర్తంతే ♦ అప్రాప్యమనసాసహ ♦ ఆనందం బ్రహ్మణోవిద్వాన్) అనునట్లు వాని యానందమును ఘనత్వమునుగుఱిలించుటకు

పరమాత్మునివలన బుట్టినవేదములే జాలకనుండెను. మనమెంతటివారము వాఁడు శాశ్వతముగా నుండును మనము నశ్వరులము అపరబ్రహ్మాభిధానుఁడైన శివుఁడే మనకు కర్త వానిని విడిచి మనమన్యుల నుపాసించఁదగదు వానిభక్తులే మనకు బంధుగులుగాని యితర దైహిక బంధువ్రులు బంధువులుగారు. (ఋణానుబంధరూపేణా పశుపత్నీ సుతాదయః ఋణక్షయేక్షయఁయాంతి కాతత్రపరివేదనా) అనునట్లు భార్య, కొడుకులు, అన్నలు, దమ్ములు, మాతాపితృలు, నితరబంధువులు ధనము పశువ్రులు మొదలగునవి ఋణానుబంధ సంబంధములు ఇవి ఋణముదీరినపిమ్మట నుండనేరవు కాన వారికై మనము చింతింపవలదు ఈజగమంతయు శివస్వరూపమని భావించి పూజించవలయును. (ఆత్మవత్సర్వభూతానియఃపశ్యతిసపండితః) అనునట్లు సర్వభూత సముఁడై యున్నవాఁడేజ్ఞాని వాఁడే భక్తుఁడు వాఁడే ఈశ్వర ప్రియుఁడు కావున నిన్నుక్షమించుటకు నేనెంతటివాఁడను" అని పలికిన బసవేశ్వరుండు సంతసించి "ఓ గురూత్తంసా! భవదీయోపన్యాసంబువలనఁ గడుపావనుఁడనైతిని. నాజన్మంబు సార్థకమయ్యెను. శివానుగ్రహంబు గలిగెను. అని పలికి పునరపునః ప్రణామంబుగావించితదనుజ్ఞంగొని నిజనివాసంబునకు జనియెను. మారయ్యయు నిత్యకృత్యంబులం గావించుచు భక్తారాధనలం జేయుచుండెను.

వేదాంత వేద్యాయనమః

పదునారవ అధ్యాయము ముగిసెను.



శ్రీభక్తాంతర్యామినేనమః

# కన్నడ బ్రహ్మయ్య చరిత్రము.



## [సప్తదశాధ్యాయము.]



కల్యాణంబున బ్రహ్మయ్యయను భక్తవర్యుండు సంసార దూరుండునై తను మనోధనంబులను శరణజనాధీనంబు గావించినవాఁడై సద్విద్యాపరుండై నిర్మల నిరవద్య భక్తియుక్తుండై బాహ్యాంతఃపూజా నిరతుండై కేవల జంగమూరాధనంబే పరమంబని భావించియు ద్రవ్యంబెంతయున్న నంత పాపంబులకు కారణమని (అర్థసంపద్విమోహాయ విమోహోనరకాయచ । తస్మాదర్థమనర్థాఖ్యం శ్రేయోర్థీదూరతస్త్యజేత్) అనునట్లు మోక్షాపేక్షకి విత్తము కష్టప్రదము ఒకవేళనున్నను భగవద్భక్తులకొఱకు వినియోగించిన లాభదాయకమని దలఁచి కలధనంబెల్ల శరణ జనారాధనలకై బోనిచ్చి నిస్వుఁడై ఇఁక ముంగిదారాధనకు ద్రవ్యంబు లేమి గడుచింతించి (నధర్మోధర్మతాంవ్రజేత్) అను న్యాయము ననుసరించి జంగమార్చనలంజేయుపట్ల నెట్టియకార్యంబైన నాచరించిన పాపంబులేదని యెంచి మనంబును నిర్మలముగ గావించుకొని కత్తియు, పటుకయు, కావిచీరయు, కత్తెరయుం నిసుక యత్రతలును, ముండ్లబంతియు, నీలిముసుగును, అంతరకాటుకయు, చండవేదియు, సెలగోలయు, సన్నని చెప్పులును, కుక్కల వాకట్టును, త్రాటినిచ్చెనయు మొదలగు వస్తువులఁదాల్చి భయంకర గాఢాంధకార రాత్రులయందు ధనికులిండ్లం జేరి యొరులకు వినరాకుండ గడికన్నమో, గోడకన్నమో, నేలకన్నమో, త్రవ్వియిలుసొచ్చి ఆయిల్లు శరణులదైన వారినిలేపి నమస్కరించి పూజించి పాదతీర్థంబునుగొని వెడలును. ఇతరుల యిండ్లయిన సకల పదార్థంబుల సేకరించుకొని జనిభక్తజనారాధనంబుఁ గావించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు శరణబృందంబు వేంచేసిన వారిపూజలకు ధనంబు లేమి పట్టపగలే తన పరికరంబులంగొని దొంగిలించ జనుచున్న మధ్యేమార్గంబున బసవేశ్వరుంకు కనంబడి కన్నడ బ్రహ్మయ్యకు

నమస్కారంబు గావించినంత బ్రహ్మయ్య బసవనింజూచి యిట్లనియెను.

ఓ మంత్రీశ్వరా! నేను శరణ వర్యులు మిగులగ వెంచేసినారు. తదారాధ నకు ధనంబులేదు బిజ్జలుని భాండాగారంబులం జూపుము అనిన భకులకు మారు పలుకని బాసగలవాడు గాన బసవేశ్వరుండు నతనినోడ్తెచ్చి కోశాగారంబుల తలుపులం జూపించిన బ్రహ్మయ్య యత్యాగారంబునకు కన్నంబిడి లోనజొగి వలయు ద్రవ్యంబును గొనిచనియెను.

అంతట నంగరక్షకులేగి తద్వృత్తాంతంబును బిజ్జలున కెఱిగించిన నతండు మండిపడి! ఓహో బసవేశుండెంతకైన సాహసించుచున్నాడు తానే పట్టపగలు గన్నంబును బెట్టించినాడా! శివభక్తులనుపేర నారాజ్యమునంతెయు నశింపజేయు చున్నారు. ఇంక నేమింజేయనున్నారో తెలియదు. ఈ మిత్రరూప శత్రుండు నాకెటనుండి దాపరించెనోగదా? యని కనుగొలకులనుండి యంగారకణంబులురాలఁ గోశాగారంబువద్దికేజని యాకన్నంబునుజూచి మఱియు మండిపడి పటపట పండ్లు గొరుకుచు బసవనింజూచి "ఓ రాజద్రోహీ! ద్రోహులను శిక్షించగల నీవే దొంగ లకు సహాయివై నాయిల్లుఁ గుల్లం జేయించుచున్నావా! భక్తులని పేరుమాత్రమే గాని మీరుజేయు పనులన్నియు దేశద్రోహకరములే నీవు నిజముసెప్పుము ఆదొంగ యెవఁడు? సాధనంబేది? అనిన బసవన చిఱునగవునగి " ఓ రాజా! నీవు యుక్తా యుక్తము నెఱుంగకఁ బల్కుదువు. శైవులు దేశద్రోహులుగారు. ద్రోహులను శిక్షించువారు పాపులుగారు పాపాత్ముల బాపంబులం బారదోలువారు నీసొమ్మును గొన్న నాతఁడు కేవలము గుక్షింభరుఁడగు చోరుండుఁగాఁడు కేవల పరమ భక్త వర్యుండు. ఆతని శ్రీపాదము కల్పద్రుమ సమానము ఆమహాత్ముని దయాదృష్టి యమృతావ లోకనము ఆదీనావనుని హస్తస్పర్శము పరశువేది ఆతని యనుగ్ర హమే లోకసంరక్షణము ఆతని నిగ్రహమే లోకనాశంకరము అట్టి పుణ్యాత్ముండేల యిట్టి కుమార్గంబు ననుసరించె నందువేని వినుము భక్తుల పథంబేదియు దురా చారంబుగాదు. జూదంబాడిన పాండవులు సెడిపోయిరి జూదమాడిన యొక భక్తుండు పార్వతీశుం జేరెను వేటాడిన రాజు లెందఱో భ్రష్టులైరి వేటాడిన యొకుకు విశ్వేశ్వరుం గలసెను. పరసతుల మోహించిన వారెందఱో నశించిరి పరసతింగూడిన

నంబి పార్వతీరమణునకుఁ బ్రియుండయ్యెను పేరులను జంపిన మాండవ్యుఁడు కొఱత బడియెను. యితరుని ఖండించిన ఘంఘుండుఁ గైలాస నివాసియయ్యెను. అసత్య మాడిన బ్రహ్మకు గుడిగుండములేదు, బొంకిన చిఱుతొండరాజు పరమార్థంబు జెందెను ఇంకెందఱో గలరు భక్తులు పరోపకారులును స్వార్థత్యాగులును గాన వారికి పాపంబంటదు వారిదర్శనంబున సకల కల్మషములు దొలంగును వారి పాద ధూళి సోకిన యిల్లు పావనంబగును యీకన్నడ బ్రహ్మయ్య కేవల జంగమారాధన పరుఁడు ఆతనికి రాత్రియని పగలనియు భేదంబులేదు భవభక్తులిండ్లకురాఁడు భవుల యిండ్లనుపునీతము జేయకమానఁడు నీవంటి లోభులయింటి ధనమునంతయు గొని శరణులకు వినియోగించి కృతార్థులం జేయుచుండును ఆతండు ముట్టిన నినుము బంగా రంబగును చూడుము నీకోశాగారము గడెలన్నియు బంగాంబులైయున్నవి. నీబొ క్కసములో లెక్కలేని ధనంబున్నది. ఆతడు నిన్ననుగ్రహించనే నీయింటి కరుదెంచినాడు అని కోశాగారంబును జూపించి బొక్కసంబులనిండ ధనంబుండుట జూపించిన నయ్యపారధనంబును జూచి సంతసించి పృథ్వీకాంతుండు శివభక్తులమహా త్వంబునకు విస్మయంబంది యెప్పటియట్ల మంత్రీశ్వరుని గౌరవించుచుండెను. బ్రహ్మ య్యయు ధనంబెల్లఁగొని నిజమందిరంబునకు జని పంచభక్ష్య పరమాన్నాదులచేత వస్త్రాద్యలంకారములచేతను శరణజనుల దనిపెనుఇట్లే సర్వకాల సర్వావస్థలయం దును జంగమార్చనలం గాలంబు బుచ్చుచుండెను.

మహామహిమ్నే నమః

పదునేడవ అధ్యాయము ముగిసెను.

భక్తసులభాయనమః

# సురియ చౌడయ్య చరిత్రము.



## [అష్టాదశాధ్యాయము.]



కళ్యాణపురంబున సురియ చౌడయ్యయను భక్తశ్రేష్ఠుండు లింగమర్మజ్ఞుండై లింగాభిమానియై లింగయోగానందసంగతుండై గూఢలింగైక్యమానసుండై ఉభయ లింగప్రసాదోపభోగియై అంగవికారదూరుండై గృహస్థధర్మముతో నింటవసించుచు (నైవకించిత్కరోమీతియుక్తోమన్యేతతత్త్వవిత్ ॥ పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి ॥ ఇంద్రియాణీంద్రియార్థేషువర్తంతఇతిధారయన్) అనునట్లు పదార్థములంజూచుచు శబ్దములను వినుచు తాకుచు, వాసనఁజూచుచు నడచుచు, నిద్రించుచు, ఉచ్ఛ్వాసనిశ్వాసములందియు ను మాటలాడుచు, మలమూత్రంబులను విడుచుచు, విషయంబులనొందుచు, కన్నుల మూయుచు తెఱచుచు, ప్రత్యింద్రియము తమకార్యములయందు పనిసేయుచున్నను తానొందునంటక (నసంశయోస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్) అనురీతి ఈశ్వరు నుపాసించుటలో పరమపదములభించుట సంశయమున్నను తద్భక్తుల నారాధించుట యందు మోక్షములభించుటసిద్ధంబు (మహాంతస్తేసమచిత్తాఃప్రశాంతాః విమన్యవస్సుహృదస్సాధవోయే) అనురీతిసాధువులు పరమేశ్వర లీలావిభూతియగు చేతనాచేతనములయందు సమబుద్ధిగలవారు. తమ్మొకరవమానపఱచినను వారియందు ద్వేషభావంబునూనని శాంతచిత్తులును, కోపములేనివారును, జగంబునకు మిత్రులునుగానుందురు, అట్టి భక్తజనోత్తములెంతదూరముననున్నను (సుదూరమపిగంతవ్యంయత్రభక్తవరాఃస్థితాః) అనురీతిపోయి వారిని దర్శించినచో పాపంబులెల్ల నడఁగును. ఈశ్వరసాన్నిధ్యము జేకూరును. అని తలఁచి ప్రతినిత్యమున్న వివిధరసరసాయనంబులతో బ్రహ్మనిష్ఠులగు జంగముల కారాధనం గావించుచు వారారగించినపిదప తాంబూలకుసుమచందనాదులనొసంగి వివిధపక్వాన్నంబులను

బంగారుపళ్ళెరమునసునిచి యిష్టలింగంబునకు నివేదనంబుగావింప సర్వేశ్వరుండు భక్తకీర్తితుండుఁగాన మెల్లనతత్పదార్థంబులనెల్ల నారగించి సర్వాభీష్టంబుల నొసంగుచుండును. పిదప చౌడరసుభక్తశేషంబును భగవచ్ఛేషంబును మిగుల భక్తితో నారగించుచు ధన్యమ్మన్యమానసుండై చరించుచుండెను చూపరులెల్లరు మున్ను కరికాలచోడుండు బ్రతినిత్యముమున్నూటఱువదిపుట్లధాన్యమునువండి శాకములందు ముప్పందుము మిరియములనువెచ్చించి పదార్థంబులను సేయించి పరమాత్మకు నివేదించ నారగించెను. మాదరచెన్నయ్య తొల్నాటియంబలిని గిన్నెలోఁబోసి దా గించిన శివుండుఁదా ప్రీతి యానందించెను. దాక్షారామమున వీరచోడమ్మదాసిచే పులగంబునంప గౌరీశ్వరుండు ప్రేమతో నారగించెను. అని విందుము. గానినేఁడు చౌడయ్యగారివలన విందారగించుటగంటిమి యితనిభక్తియెంతటిదని గొనియాడుదుమని వేనోళ్ల జనులుబొగడుచుండ బ్రతినిత్యమున్ను చౌడరసుభగవద్భక్తార్చనంబు జేయుచుండెను.

భక్తకీర్తితాయనమః

పదునెనిమిదవ అధ్యాయము ముగిసెను.

శ్రీలక్ష్మీప్రసిదాయనమః

# తెలుగుఁ జొమ్మయ్య చరిత్రము.

## (ఏకోనవింశత్యధ్యాయము)

కల్యాణపట్టణంబున తెలుఁగు జొమ్మయ్యయను శరణాగ్రిగణ్యుండు కేవల వీరశైవ వ్రతాచారుండై సంతతచింతిత చిరంతన పురుషుండై దారేష, పుత్రేషణ ధనేషణంబులకు లోబడక (క్లేశాదిపంచకతరంగయుతే భ్రమాఢ్యే దారాత్మజాప్త ధనబంధురుషాభియుక్తే ♦ ఔర్వానలాగ్నినిజరోషజలాభిపూర్ణే సంసారఘోరజలధౌహి కిమస్తిసౌఖ్యం) అనురీతి దుఃఖములనెడి తరంగములతోడను విభ్రాంతులనెడి సుడులతోడను, దారాసుత మిత్రబంధువులను మకరంబులతోడను, కామక్రోధాదులను బడబానలముతోడను, ఇంద్రియవ్యాపారములనెడు జలములతోడనుగూడి కొనియున్న సంసార సముద్రమున మునింగినవానికి సుఖంబేమికలదు (అహో మోహస్యమాహాత్మ్యం కఃపుమాన్ లంఘునేక్షమః అసారభూతే సంసారే ముహ్యాంత్యతివిపశ్చితః) అకటా మోహముయొక్క మహత్వమునేమని చెప్పవలయును యెంతటిమహానుభావుండైనను దీనినిఁ దాటినవాఁడులేడు విద్వాంసుఁడును విభ్రాంతుండై సారరహితంబైన సంసారంబున ముగ్ధుండై జరించుచున్నాఁడు. అని చింతించుచు తాసంసారపరివర్తనుండైనను, కామక్రోధాదులకుఁజిక్కక నడుసులో మెదలు కుమ్మరపురుగువలె దిరుగుచు (శివాదన్యత్పరంనాస్తి శివాదన్యం నకించన ♦ శివాదన్యాభిధానాస్తి శివఏవసదాగతిః) అని మనంబున జింతించి సదాకాలంబు పరమేశ్వరారాధనంబు గావించుచు త్రికరణశుద్ధుండై పరులకపకారంబు సేయక నసత్యాలాపిగాక నాశాపరుండుగాక మెలంగుచు శరణజనవర్యులెవరైన గనుపడిన సాష్టాంగపడి నమస్కారంబు గావించి యింటికి దోడ్తెచ్చి యర్ఘ్యపాద్యాముల యిష్టమృష్టాన్నపానంబులచే సంతృప్తులం గావించుచుండెను.

ఇట్లుండ గటకప్రాంతారణ్యంబునందొక్కనాఁడు జొమ్మయ్య శివపూజార్థమై బిల్వంబును గోయుచుండ మత్తిల్లిన మృగసమూహంబు జొమ్మయ్యం జుట్టుకొని

పొడువవచ్చుచు నెటు గదలనీక శరపంజరంబునోలె నిలిపెను. అంత నందొక్క మృగము జొమ్మయ్యంజూచి " ఓ స్వామీ! మేము మీకాపదల బెట్టరాలేదు మేము గంధర్వులము శ్రీశైలమునందొక్కనాడు చరించుచు నొక్కచో నొక చిత్రముం గంటిమి అదేమన శివానందుండను నొక్క యోగి పరాకాష్ఠీభూతభావనంబుచే నిత్య శివానంద పరుండై దపంబుసేయు నతని పాదములు భూమిలోనికిగ్రుంగి వేరులై పారినవి చేతుల గోళ్ళనుండి తెల్లని తీగెలు బ్రబలినవి శిరంబునందలి వెండ్రుకలు నల్లగా దేహమంతయు జీర్ణమ్రానువలె గన్పడెను దానింగాంచి మేమందఱ మాశ్చర్య చకితులమై తెల్లత్రీవెలతోడ నల్లదనంబుగల దిదియేమి కాబోలును? ఇది శిలయా? శిలయైనచో దీగెలు గలుగునా? తరువా? తరువైనచో నాకులెవ్వి? లేక ముసలి యెలుగా? యని జింతించుచు నాతపస్వికడకేగితిమి అతని శిష్యుండు మమ్ముగాంచి గోపించి "ఓ తుచ్ఛులారా! కేవల శివస్వరూపుండగు మాగురుని మృగస్వరూపునిగ భావించితిరిగాన మీరందఱును మృగములగుదురుగాక యని శపించెను. అంతట మేము భయకంపితులమై శరణంబువేడిన కరుణించి " కల్యాణ కటకంబున దెలుగు జొమ్మయ్యయను భక్తుండుగలడు ఆకటకప్రాంతంబున మీరు మృగంబులై బుట్టి యతనిచే జచ్చినచో కైలాసంబు జెందెదరు" అని యనుగ్రహించెను కావున మీరనుగ్రహించి మమ్ము వధించి కైలాసంబునకు బనుపుడు. అని ప్రార్థించినమించినకరుణచే యోగదృష్టినివహించి నిజంబంతయుగాంచి తక్షణంబె యింటికరుదెంచి లింగార్చనం గావించుకొని విల్లమ్ములదాల్చి కాసెబిగించి నడికట్టు గట్టి తలకు రుమాలంజుట్టి సింహంబులుబోలి బలజవంబులుగల జాగిలంబులను వెంట నిడికొని యరణ్యంబునకుంజనిన తదాగమనంబునకై నిరీక్షించుచున్న మృగంబులు జొమ్మయ్యంజూచి జుట్టికొనిన జాగిలంబులు నంకమపోలెలను విడిపించుకొని బలంబు జలంబువెలయమొకంబులం దజుముచుండెను. అంత జొమ్మయ్య దనవిల్లున వాలమ్ముల గీలించి వేయుచుండ నొక్కొక్క వేటునకు పదివరకు మృగంబులు పడిజచ్చి గంధర్వ దేహంబులందాల్చి జొమ్మయ్యకు ప్రదక్షిణ నమస్కారంబులం గావించి నిలుచునంతనే భగవద్భక్తకరమరణంబు గలుగుటంజేసి వెంటనే శివలోకంబునుండి విమానంబు లరుదేర వాని నధిష్ఠించి శివలోకంబున కేగుచుండిరి ఈసంగతి బట్టణం

బంతయును వ్యాపింప జనంబంతయు మూగికొని యరణ్యంబుసేరి యువ్వింతను జూచుచుండిరి బిజ్జలుండును బసవేశ్వర సహితుండై వచ్చి యచ్చటి ప్రవృత్తంబు నంతయుంగాంచి యచ్చెరువందుచుండెను.

ఇట్లు జొమ్మయ్య వేటాడి సమస్త జంతువులంజంపి మోక్షంబునకనిపి విల్లును దిగ్గించి నిలిచినంత బసవనమంత్రి జొమ్మయ్యకు సాష్టాంగ నమస్కారంబుగావించి వినుతించెను. పిదప నందఱును యీయద్భుతంబునే ప్రశంసించుచు పురంబు జేరిరి జొమ్మయ్యయు సద్భక్తివిహార భగవద్భాగవతార్చనలం గాలంబుబుచ్చుచుండెను.

అఖిల శరణ్యాయనమః

పంతొమ్మిదవ అధ్యాయము ముగిసెను.



శ్రీవిరూపాక్షాయనమః

# గిలకమారయ్యచరిత్రము.

## [వింశత్యధ్యాయము.]

కల్యాణపురంబున గిలకమారయ్యయను నొక భక్తశిఖామణి యుండెను ఆమ్మహానుభావుండు (విచిత్రాదేహసంపత్తిరీశ్వరాయనివేదితుం) అనగా కరచరణాద్యవయవయుక్తమైన దేహమును భగవంతుఁడు మనకొసంగియున్నాఁడు. ఆ శరీరమును శబ్దాది విషయంబులకుఁబోనీక ననారతంబు భక్తజనుల కర్చనంబులను సేయుచుండవలయును. అట్టి సపర్యలయందు దంభాహంకారముఁడిన పతనమునకు హేతువు గాన వానినెల్ల విడిచి శుద్ధసాత్వికస్వభావంబును బొందవలయును అని మనఃబున దలఁచి దూరీకృత సంసారుండై (మాతాచపార్వతీదేవీ పితాచపురమర్దనః బాంధవాశ్శివభక్తాశ్చసర్వమాత్మమ కుంజగత్) అనునట్లు తల్లి పార్వతిగను దండ్రి శివునుగను బందుగులు శివభకులుగను సర్వజగంబు తనవలెను భావించుచు బరులను దూషించక స్వధర్మంబును విడకయుండెను. అతఁడు ప్రతినిత్యము నుదయంబలేచి తానమాడి లింగార్చనం గావించికొని విభూతి పట్టంబు నుదుటఁదాల్చి కాలనొక గండపెండేరంబు దగిలించికొని కావిదోవతిని కాశబిగించికట్టి ఫాలభాగంబున బ్రాణలింగంబునుగట్టి కస్తూరీకుంకుమబొట్టును బొమలనడుమ నలంకరించి పైనుండి శాలువను వలెవాటుగా వేసికొని నొక గిలకయు నొక బొమ్మను గేలధరించి గణవర్గంబుల నిండ్లలో సంచరించుచు గిలకవాయించుచు బొమ్మనాడించుచు తద్ద్రవ్య విశేషంబుంగొని భక్తసమారాధనంబుఁ గావించుచు కాలంబు బుచ్చుచుండెను.

అంత నొక్కనాడు నిత్యప్రకారము మారయ్య భిక్షమెత్తుచుండ సంగయ్యయను నొకజంగము జూచి కోపించి మారనింగాంచి "ఓయీ! నీవిట్లు మాయావిద్యలనేర్చి బొమ్మనాడించుచున్నావు. తల్లబ్ధధనంబుచే జంగమారాధనంబుఁ గావించుట హేయముగాదా? (యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతేకామకారతః సిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిం) అనునట్లు శాస్త్రవిధిని వదిలి స్వేచ్ఛగా

వహరించువానికిసుఖము లేదుసిద్ధియు లేదు. ఈశ్వరలోకప్రాప్తియు లేదు.-(శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ । స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః) అనగా పరధర్మ మెంతబాగున్నను స్వధర్మమున గుణములు లేకపోయినను స్వధర్మము నడచుట మేలు స్వధర్మమున చావు సంభవించినను మేలే పరధర్మము మిక్కిలి నరకాస్పదము గాన మన శరణ ధర్మంబునువిడిచి కేవల మైంద్రికజాతిక వేషమును దాల్చుట మేలగునా! పరమేశ్వరుఁడు మెచ్చునా? అశాశ్వతమైన యీమానవ దేహమునొంది ఈశ్వరారాధకుఁడవయ్యును స్వవేషస్వవిద్యలను మాని పర వేష పరవిద్యలను గ్రహించుట పాడిగాదు. మనకీ దేహము శాశ్వతముగాదు(అమేధ్యపూర్ణం క్రిమిజాలసంకులం స్వభావదుర్గంధమశౌచమధ్రువం । కళేబరంమూత్రపురీషభాజనం రమంతిమూఢా నరమంతిపండితాః) అనఁగా అమేధ్యముచే నిండి పురుగులతో గూడి స్వభావముచే దుర్గంధభూయిష్ఠమై యపరిశుద్ధమై మూత్రపురీషములకు దావైన నీదేహమునందు మూర్ఖులే మోహింతురుగాని పండితుఁడెవ్వఁడును దానిపై నాసించఁడు. ఈతుచ్ఛమైన వేషమంతయు నరకావహమే కాని ఈశ్వరప్రియముగాదు సాధువులు సంతోషించరుజంగమారాధనకీమార్గంబునకన్న వేఱొండుమార్గము లేదా? తొల్లింటి మహాత్ములు లింగవినోదంబుకన్న నన్యంబుజూచిరా? యనినమారయ్య మారుబలుకక సంగయ్యకు మ్రొక్కి "ఓ స్వామీ! నేను మూఢుఁడనై గావించిన కృత్యంబును క్షమించుఁడు (నగురోః పరస్త్రాతా) యనునట్లు మీరు నాకాచార్య స్వరూపులై నన్ను రక్షించితిరి అని పల్కి యానాఁడు నిత్యంబునలెనే శరణజనారాధనంగావించి తెల్లవారి యాబొమ్మనుగొనిరాక గేలలింగంబునఁగొని గిలకవాయించుచు శరణవీధులం దిరుగుచు నొక్క శరణునింటిముంగల గిలకవాయించుచు నిలుచున్నంత కేలనున్న లింగంబు నృత్యంబుసేయుచుండెను. పిమ్మట శరణులయిండ్లనున్న చరలింగంబులును స్థిరలింగంబులును స్త్రీ పురుషులు ధరించిన లింగంబులును, మిగుల నానందంబుగ వినోదంబు గావించుచున్నంత నాయద్భుతంబున కచ్చెరువంది కొందఱు బసవనికడ కేగి యాసంగతిని దెల్పిరి శివాలయార్చకులగు నాదిశైవులును ఆలయంబులందలి స్థిరలింగంబులు నెగురులాడుచుండుటయుఁ దెల్పిరి. ఆయద్భుతంబునకు మంత్రియు నాశ్చర్యంబునొంది మారనిందిలకించ నేతెంచి యతనింగని తన్మహిమంబున కచ్చెరువంది తదీయపాదారవిందంబులకు సాగిలిపడి మ్రొక్కి నిలిచినంత

మారంపు పెరగుజెంది "దేవా! మీరు మహనీయులు నన్నిట్లగ్గించదగునా?" యని ముహుర్ముహుర్ముహుః ప్రణామంబులఁ గావించుచున్న నతనింజూచి మంత్రిపుంగవుండును "మహానుభావా! నీయంతటి మహాత్మునెచటనైనం గలఁడా? మదనారాతిని గేలం గొనియాడించుచున్నావు. నీకాపరమేశ్వరుండు వశ్యుఁడై యున్నాడు (త్రిజగతిసజ్జనసంగతిరేకా భవతిభవార్ణవతరణేనౌకా) యనునట్లు సంసార సముద్రమును తరించుటకు సజ్జన సహవాసమే ముఖ్యమైననౌక నేడు మీసహవాసమువలన నేను పాపార్ణవమును దాటితిని అనిపలికిన మారండు "ఓదేవా! మీయుంగల నేనెంతటివాఁడను భక్తవర్యులకరుణయే యన్నిటికి ముఖ్యోపాదేయము. ఇది నాతప్పిదముగాదు. నేనిత్యమొక బొమ్మనాడించుకొనుచు భిక్షమెత్తుకొనుచు దాన జంగమార్చనల సలుపుచుందును నిన్న సంగయయను నొక భక్తుండు నన్నాక్షేపించి తొల్లింటివారు లింగవినోదంబుచే గాలంబుబుచ్చిరి గాని యిట్టి మాయబొమ్మలనాడించిరాయని పలికెను. నేడు లింగవినోదంబును జేయుచు భిక్షకై వచ్చితిననిన యచ్చటివారందఱును సంగయ్యను పరిహసించిరి. పిమ్మటఁ బసవన మారనింజూచి "ఓ శరణవర్యా! ఈసంగయకతన లింగధారుల కిందఱికిని లింగతాడనంబులఁ గలిగెను. ఇఁకముందీ ప్రవర్తనంబును జాలించి శరణుల రక్షింపుమనిన నాతఁడు "దేవా! నానేర్చిన రెండుకృత్యంబులును ఇఁకముందు గావించవలదంటిరి నేనెట్లు శరణారాధనం గావింతును భక్తప్రశ్లేషంబున కేనట్లొరుదును. (ప్రతిత్సమస్తపాపానాం ప్రాయశ్చిత్తంమనీషిభిః ♦ నిర్ణీతం భగవద్భక్తపాదోదకససేవనం) అనగా అనేక పాపభూయిష్ఠులగు మానవులకు పాపాపనోదనార్థమై భక్తజన పాదతీర్థసేవనమే ప్రాయశ్చిత్తమని పెద్దలచే నియమింపఁబడెను. అట్టి జంగమచరణ తీర్థము నాకు కఱువైనచో నాజీవనం బెట్లుసాగును" అని పలికిన నచ్చటి పెద్దలందఱును నీ మునుపటి కాయకమే శ్రేయోదాయకము. దాని నాచరించియే నీ నిత్యకృత్యముం జరిపింపుమని యైక్యకంఠ్యముగ సెలవిచ్చిన వెంటనే లింగవినోదంబు మాయం బయ్యెను. బసవనాదులు ఆయద్భుతంబును బొగడుచు నిజనివాసంబులకు జనిరి. మారన యెప్పటి వేషంబుననే జంగమారాధనలం గావించుచుండెను.

మాయామూర్త యేనమః

ఇఱువదవ అధ్యాయము ముగిసెను.

శ్రీపద్మారమణాయనమః

# ఈండ్రిమారయచరిత్రము.



## (ఏకవింశత్యధ్యాయము.)

కల్యాణపురంబున మారండను నొక్కభక్తుండు గౌడకులంబున జన్మించెను (శమోదమస్తపశ్శౌచం క్షాంత్యార్జవ విరక్తతా ॥ జ్ఞాన విజ్ఞాన సంతోషాస్సత్యాస్తిక్యేద్విషడ్గుణాః) అనగా శమము ఇంద్రియ నిగ్రహము, తపస్సు, ఆచారము, ఓర్పు ఆర్జవము, వైరాగ్యము, జ్ఞానము, విజ్ఞానము, సంతోషము, సత్యము, ఆస్తికతయ నెడి పండ్రెండు గుణములుగలవాఁడై సర్వసంగపరిత్యాగుఁడై (అహింసాప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః ॥ సర్వభూతదయాపుష్పం ॥ క్షమాపుష్పం విశేషతః ॥ శాంతిపుష్పంతపఃపుష్పం ధ్యానపుష్పంతథైనచ ॥ సత్యమష్ట విధంపుష్పం భగవత్ప్రీతికారణం అనునట్లు ఈశ్వర ప్రీతికరములైన అహింసాద్యష్ట విధపుష్పములచేత నీశ్వరు నారాధించుచు మనోవాక్కాయంబులం జేయుకర్మలను (బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వాకరోతియః ॥ లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా) సంగరహితుఁడై తాఁజేయు కర్మల నన్నియు నీశ్వరార్పితము జేయుచున్నాఁడో ఆపురుషుఁడు నీటియందున్న తామరాకువలెనే పాపముల నంటకుండును అనురీతి భగవంతునకు సమర్పించును (కలవిద్య లెన్నిగల్గిన కులవిద్యకు సాటిరాదు) అనురీతి తన కులకృత్యంబును జేయు చందాన వచ్చు నాదాయముచే గణనరార్చనం గావించుచు బ్రతిదినంబు దన రెండుచేతులను దెగఁగోసి రజతగిరి కంపించిన నయ్యావి కైలాసంబునకుఁజని గౌరీరమణు నర్చించి మరలివచ్చి యెప్పటియట్ల మారయ శరీరమున కంటికొనియుండును ఆతండొక్కనాఁడు రాచబాటం బోవుచుండ రాకొలువున కేగు బసవండు మారనింగని వందనంబాచరించి యతని ప్రసాదంబుఁగొన మనమున నిశ్చయించికొని వేగంబ కొలువుపనుల దీర్చికొని ఈడిగ మారయ యింటికేగెను

అంత నాభక్త దంపతులీ దండనాయకుని గని భీతిల్లి ప్రణామంబు నాచరించి (అద్యమేసఫలంజన్మ సుప్రభాతాచమేనిశా; అనునట్లు ఓ మహాత్మా నాజన్మము మీదర్శనమున పవిత్రము, నారాత్రికంతముఁగల్గెను. నాయిల్లు పావనంబయ్యెను

ఈశ్వరుండు నాయందు కరుణించెను నాపాపములన్నియు నడుగంటెను. మహాత్మా! భవాదృశుల కటాక్షము నిర్హేతుకజాయమానము. ఈ బీదవానిని గనికరించుటకు గాదా ఉంటివానిపైకి గంగవచ్చినట్లు వేంచేసితిరి లింగార్చన వేళయయినది దేవర వారిని పూజించుట దాసుని కర్తవ్యము గాన నీదీనుని ప్రార్థన నంగీకరించి లింగ పూజ గావించుడనిన బసవండును దాగోరివచ్చిన కార్యం బదియే గాన లింగా ర్చనం గావించుకొని జంగములతోడంగూడి ప్రసాదంబును భుజించి ధన్యమ్మన్య మానుండై తదనుజ్ఞంగొని యిలుసేరెను.

అంతనొక కొండెకాడు భూమండల పతిదరికరిగి జోహారులుసేసి యిట్లనియెను "ఓ ప్రభూ! మన బసవమంత్రిచేసిన నీచకార్యంబు నేమనివచింతును అతనికి కుల భేదములేదు పెద్ద పిన్న గౌరవములులేవు కేవల కుక్షింభరునివలెనే నెవడైనను సరే లింగధారియైన జాలును జాతిభేదములేక భుజించివచ్చును నేడొక గొడ నింట భుజించి యిప్పుడే యిలుసేరినాడు" అని తెల్పిన బిజ్జలుండు కోపగించుకొని బసవనిం బిలిపించి యిట్లనియెను. ఓ మంత్రీ! మీమతంబునకు ధర్మంబును కర్మంబును లేదా? (యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః । నససిద్ధిమవాప్నోతి నసుఖం నపరాంగతిం) అనునట్లు శాస్త్రవిధిని త్యజించి యిష్టానుసారముగ నడచినచో సుఖ ముగల్గునా ఈశ్వరుడుత్కృష్టపదము నొసంగునా? జాతిభేదంబులేదా? తప్పులేదని శీలంబును దిగనాడి కల్లమ్మవానియింట భుజించుట మేలగునా? నీవు సర్వజ్ఞుండ వయినను గుణాగుణంబులం జాటింపగూడదా? గారడితనంబున జేతులగోసికొని యందఱిని మోహింప జేయునతని గొప్పగజెప్పిన మర్యాదయగునా? యని బిఱుసుగ మాటలాడిన ధరణీవరునింగాంచి "ఓ ప్రభువర్యా! నీవు శైవుల మహాత్మ్యంబు నెఱింగియు నిట్లనుచున్నావు. భక్తునకొక జాతి గోత్రములేదు. భక్తుడు పరమేశ్వ రాధీనుడు పరమేశ్వరుడు భక్తాధీనుడు భక్తిగల శ్వపచుడైనను మహానుభావుడే (విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని । శునిచైవశ్వపాకేచ పండితా స్సమ దర్శినః) అనురీతి అందఱియందును సమభావముగలవాడే భక్తుడు. ఒకతండ్రికి నలు గురు కొడుకులున్నచో నలుగురికి నాలుగుజాతు లేర్పడునా? అట్లే భగవత్సంతాన మగుభక్తులకు జాతిభేదముండదు(ధర్మస్యప్రభురీశ్వరః) అనగాధర్మమునకు ఈశ్వరుడు ప్రభువు, అధర్మ నియంతను గొల్చువారల ధర్మంబులు వేశ్వేర యెట్లుండును వేష

భారుల మార్గములు వేరు నిజమైన భక్తిగలవారిత్రోవలు వేరు నే జెప్పనేటికి మారయ మహాత్మ్యమును జూడగోరితివేని యతని సన్నిధానమునకు జనుదము. అనిన ధరణీ నాథుండట్లే కానిమ్మని లేచెను. ఆతని వెంబడి సభికులెల్లరు మారనింటికి జనిరి.

అంత మారయ్య బిజ్జలాదులరాక నెఱింగి యెదురేగి వందనం బాచరించి దోడ్తెచ్చి యుచితాసనాసీనులం గావించినంత బసవేశ్వరుండు మారయ్యకు మ్రొక్కి యిట్లనియెను “ఓ శరణవర్యా! మీమహాత్మ్యమును పరీక్షించ బ్రహ్మాదులకును దరంబుగాదు. కించిజ్ఞులమగు మేమెంతగాని తమరిప్రభావంబు నొకింత జూడంగోరి ధరారమణుండు తమవద్దికి వచ్చినాడు గొంకక మీయద్భుతంబును జూపింపుడనినన మారయ యట్లే కానిమ్మని పరమేశ్వరుని మనంబున ధ్యానించి నిజపత్ని హస్త యుగంబును తనకేల్దోయి నిన్ని చెఱుకుతునకలవలె నఱికి వెండికొండ కంపించిన నాహస్త చతుష్టయంబును పార్వతీదేవిచూచి యాశ్చర్యపడి పరమేశ్వరుంజూచి “ఓ నాథా? ప్రతిదినంబొక్క పురుషకరంబులే వచ్చుచుండెనుగాని నేడేమో స్త్రీ పురుషుల కరంబులు వచ్చియున్నవి కారణంబేమని యడిగిన నిందుకళావతం సుండిట్లనియెను “ఓ సుందరీ! నేడు కల్యాణంబున మద్భక్తుండగు నీండ్రిమారని మహత్వంబును పరీక్షింప బిజ్జలుండే తెంచినాడు. దానంజేసి దంపతుల కరయుగళంబులుమనవద్దికి వచ్చినవి” అనిన సంతసించి గిరిజాదేవి యక్కరంబులకు పారిజాతాది దేవతా పుష్పమాలికలంజుట్టి బహూకరించి తోలించనయ్యవి తిరిగివచ్చి యెప్పటియట్ల దంపతుల బాహువుల కంటుకొనెను. దానింగాంచి పృథివీపతి యచ్చెరువంది మారని చరణంబులపయింబడి మ్రొక్కి “మహాత్మా! నీమహాత్తు నెఱుంగలేక బరీక్షించవచ్చితిని క్షమింపుము” అని వేడుకొని మంత్రిం గొనియాడుచు నిజమందిరంబునకుం జనియెను.

సర్వఫలప్రదాయ నమః

ఇఱువదొక అధ్యాయము ముగిసెను.

శ్రీ విరూపాక్షాయ నమః

# ఘూ్రణద బ్రహ్మయ్య చరిత్రము.



## (ద్వావింశత్యధ్యాయము)



కల్యాణ నగరంబున ఘూ్రణద బ్రహ్మయ్య యను భక్తుండు నిఖల శైవాగమాచారంబుల నెఱింగి తత్సమయంబులఁ దెలిసికొని శరణజనార్చనలం గావించుచుండెను.

అతండు నిత్యముదయంబున లేచి భక్తితో (నమస్తే జగదాధార సర్వబ్రహ్మాండ నాయక త్రిపురాసురవిధ్వంస కారణాయ మహాత్మనే) అని పరమేశ్వరుని ధ్యానించి గాలమును వలనుగొని నదీతటాకంబులం జేరి గాలమును వైచుచు మొదటఁ బడిన చేపను శివునకు రెండవమత్స్యంబును పార్వతికిని మూడవమత్స్యంబును గురువునకును సమర్పించి యనంతరము వలంబడిన చేపలను బుట్టిలో నుంచుకొని తెచ్చి యంగడిలో నమ్మి తల్లబ్ధధనంబుచే బ్రతిదినంబును జంగమార్చనలం గావించుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁడు ఆతనిభార్య భర్తకు మ్రొక్కి నాథా! ఈయకారేఁ బ్రధానమంత్రియగు బసవన ప్రతిదినము లక్షతొంబదాఱువేల శరణుల కారాధనం గావించుచున్నాఁడు. మనమట్లొకనాఁడైనఁ జేయఁజాలక బోయితిమి. అని పలికిన నాతఁడు ,, ఓ ప్రేయసీ! నీకీబుద్ధిని పరమేశ్వరుఁడొసంగినందుకు నేనెంతయో సంతసించుచున్నాను. ధన్యుఁడనైతిని జంగమారాధనకంటె విశేషపుణ్యంబేమిగలదు నీకోర్కె నీడేర్పుటకై నేఁడేజని తజ్జంగమకోటిని బ్రార్థించి తెచ్చి లింగార్చనంగావింతును. అనిపలికి బ్రహ్మయ్య బసవనాగారంబునకుఁజని యనుభవమంటపమున గూర్చుండి నిష్ఠాశైవరహస్యంబును భక్తిమార్గంబును యీశ్వరవైభవంబును బ్రశంసించుచు గోష్ఠిని సలుపుచున్న శరణవర్యులంగాంచి సాష్టాంగ నమస్కారంబులం గావించి విభూతి తాంబూలంబుల నొసంగి ముకుళితకరకమలుండై "ఓ భక్తవర్యులారా

నేడీ భక్తునిగుడిసెలో లింగార్చనఁ గావించవలయు నని ప్రార్థించుచున్నాను. నాకోరి క నుపేక్షింపక మన్నించి యాశిష్యుని గృహమునకరుదెండనిన వారందఱు నిట్లనిరి "ఓ భక్తుఁడా! మేమింతవరకు బసవనిల్లుదప్ప మఱొక్కనింటికి బోయినవారము గాము యీ బండారితప్ప మాకొరు లేరును శివార్చనల గావింపబిల్వ సాహసించరు అని పల్కిన నాతఁడు "ఓ మహానుభావులారా, అట్లు సెలవీయకుఁడు ఈశిష్యు నింట మీాయనుగ్రహంబున నేమియుఁ గొఱఁతలేదు ఈ శిష్యనామంబు బ్రహ్మఁడని యందురు. సంశయించక నాయింటి కరుదెంచుడనిన వారందఱును సమ్మతించి విభూతి తాంబూలంబులం గైకొనిరి.

అనంతర మతఁడు నిజగృహంబునకువచ్చి జరిగిన వర్తమానమును నిజపత్నికి దెల్పి నిత్యకాయికంబునకై జని యనేక మత్స్యంబులం గొనితెచ్చి యంగడిలో నమ్మక కొనుచుండ నాకృత్యంబు నొకభక్తుఁడుగాంచి శరణవర్గముతో విన్నవించిన వారం దఱు నీసంగతి నెఱుంగ మఱొక్కని నంపిన నాతఁడుజని తిరిగివచ్చి రోయయ్య లారా! యతఁడు నీచకార్యంబు నొనర్చువాఁడు చేపలనన్నిటినమ్మి యొక్కచేపం గొని యంగడినంతయు మీారుగొనుఁడు మీారుగొనుఁడని దిరుగుచున్నాడు" అని తెల్పిన నాజంగమగణంబు "అక్కటా! నేడెట్టి మోసము గలిఁగెను. మత్స్యజీవియింట మనమెట్లు శివార్చన గావించుకుందము. ఇసీ మనవాసిదొఱఁగిపోవును వాడు వచ్చె నేని లింగార్చనకు రామని చెప్పుదమని నిశ్చయించుకొని యుండిరి.

అనంతరము బ్రహ్మఁడు చేపల నమ్మికొని తద్ధనంబుచే సర్వవస్తు సము దాయంబుం గొనితెచ్చి పాకంబు సేయుమని భార్యకు నియమించి త్వరగా బసవ నింటికిజని శరణులకు నమస్కరించి "అయ్యలారా! పాకంబు సిద్ధంబై యున్నది లింగార్చనకు వేళయగుచున్నది వెంచేయుడు" అనిన విని శరణులు గోపించి ,, ఓరీ! మమ్మవమానించుట కే తెంచితివా? మేము విరసులమని భావించితివా? మేము బసవ నింట నిత్యము సుఖముగ సరస షడ్రసాన్నంబుల భుజించువారము. అట్టి మాకు నీయింట చేపలకూడు దినిపింపనెంచితివా? పోపొమ్మనిన నతండు ఓ స్వాములారా! మీాకపరాధంబుఁజేయ నేనెంతటివాఁడను నాభక్తికొలంది మిమ్ము షడ్రసోపేత

భోజనంబులచే నర్చించ నెంచితిని. గాన దయలుంచి వేంచేయుఁడు" అని ప్రార్థించిన వాక్యఁగినిసి పైఁబడి మెడఁబట్టి గెంటిన నతండును మిగుల నవమానితుండై నిజగృహంబునకుఁజని తనకగు పరాభవంబును భార్యకుఁ దెలిపిన నవ్వనిత మిగుల జింతించి తాఁజని శరణులకు మ్రొక్కి మహాత్ములారా! అర్చనవేళ యయినది. దేవరలు వేంచేయుండనిన వారు గినిసి ఓసీ నీయింటికేతెంచుటకు మేమిష్టపడలేదు. మఱలిపొమ్ము లేదేని నీమగనికగు నవమానము జెందెదవు. పొమ్మనిన నమ్మగువ దుఃఖాకులయైజని భర్తకాసంగతి నెఱింగించి ,, అక్కటా! శరణజనంబునకై గావింప బడిన నీపదార్థములు వ్యర్థములై జనునుగదా! నేడీశ్వరుఁడు మనపై కోపించెను అని చింతాకులితస్వాంతులై యుండిరి.

ఈవర్తమానము నంతయుఁ జారులవలన మంత్రిపుంగవుం డెఱింగి శరణులకడ కేగి దండప్రణామంబు నాచరించి యిట్లనియెను. మహాత్ములారా! ఘూర్ణిణద బ్రహ్మయ్య నూరకేల నవమానించి తోలితిరి? హింసాపరుండగిన జొమ్మయామలు లేరా? కులము ముఖ్యంబందురేని కక్కయామల నెన్నవలదా? (దురాచారోపి సర్వాశీకృతఘ్నో నాస్తికః పురా ॥ సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది ॥ నిర్దోషం విద్ధితంజంతుం ప్రభావాత్పరమాత్మనః) అనురీతి నీశ్వరసమాశ్రితుని పూర్వకృత్యంబుదలఁపఁగూడదు భగవద్భక్తులు దోషభోగ్యులు వారినవమానించుట చాలా దుఃఖదాయకము, వారి కులశీలంబుల దలపవలదు. బురదలో కమలము, కట్టెలో నింగలము, మాంసములో పాలు, శిలలో మణియును, గలుగునట్లు మహానుభావులుందురు :గావున మీరు సంశయింపక నభ్భక్తునింటికిఁ జనవలయునన వారందరును నమ్మతించి మీరెట్లానతిచ్చిన నట్లే యొనర్తుమని పలికి యొకచారుని పంపిన నాతఁడు వేగంబనని నాభక్త దంపతులకు మ్రొక్కి భక్తజనంబుంగూడి శరణవర్గం బేతెంచుట? దెల్పిన వారును తదమృతమయవచనంబునువిని మహానంద సాగరంబున మునింగి యతనికి మమ్మారు నమస్కరించి నిలుచున్నంతలో భక్తబృందంబు ధరిత్రి యానిన చందమున బసవనితోడంగూడి బ్రహ్మయ్య యింటికేతెంచిరి.

అంత నాదంపతులు వానికి సాగిలపడిమ్రొక్కి పాదప్రక్షాళనంబొనర్చి తత్తీర్థంబును శిరంబున బ్రోక్షించికొని వెంటనే వారికి స్నానమాడనిచ్చి తా

వస్త్రములనొసంగి బిల్వపత్ర పుష్పగంధాది పూజాద్రవ్యంబుల నొసంగి లింగ పూజలం గావించుకొనునంత మేలైన యచ్ఛిద్ర సమరంభా పత్రంబుల సందటికిని వేసి వివిధ పక్వాన్నంబుల వడ్డించిన భక్తవర్యులందఱును విస్తళ్ళవద్దఁగూర్చుండి లింగనైవేద్యంబు నొసంగి యిష్టముగా భుజించి తృప్తులై లేచి వక్త్రపాద ప్రక్షాళనంబులం గావించుకొని కర్పూర తాంబూలంబుల నందికొని సుఖాసీనులై యున్నంత బ్రహ్మయ్యయు భక్త భుక్తశేషంబును భుజించి వారియెదుట ముకుళిత కరకమలుండై నిలిచియుండెను.

అంత బసవన బ్రహ్మయ్య మహాత్మ్యమును శరణులకు జూపింపఁదలచి బ్రహ్మయ్యనుంజూచి "ఓ పుణ్యాత్మా! మీరు ప్రత్యహంబు నొనర్చెడు వేట యెట్టిదో వీరి కెఱింగింపుఁడు" అనిన వల్లెయని యభ్భక్తల్లజుఁడు తన గాలంబును గొని మజ్జనోదకగుండము (జలదారి) కడనిల్చి "ఓ సర్వేశ్వరా! జగన్మయా !(త్వమేవమాతాచపితాత్వమేవ త్వమేవ బంధుశ్చగురుస్త్వమేవ ॥ త్వమేవవిద్యా ద్రవిణం త్వమేవత్వమేవ సర్వం మమదేవదేవ" తల్లి, దండ్రియు, బందుగు, గురువు, విద్య ధనము, అంతయు నీవే. నీవు వినా నాకన్యములేదు. ఓ దీననాథా! ఘోరసంసార సముద్రమున మునింగినవారికి నీవు నౌకవై యుద్ధరింతువు. సర్వదేవతలు నీ వశవర్తులై యుందురు నీయాజ్ఞచేతనే బ్రహ్మసృజించును, విష్ణువు పాలించును, నీస్వరూపుండగు రుద్రుండులయంబుజేయును దినకరుండు యెండగాయును, గాడుపువీచును అగ్ని ప్రజల్లును నీవు, యోగనిద్రను వహించినచో బ్రహ్మాండంబులు సుషుప్తిం జెందును. (భీషాస్మాద్వాతఃపవతే॥ భీషోదేతిసూర్యః ॥ భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ ॥ మృత్యుర్ధావతిపంచమఇతి) అనునట్లు నీభక్తునకు భయపడి వాయువు సూర్యుడు ఇంద్రాగ్నులు మృత్యువు మొదలగువారు తమగార్యములందు విజృంభించకయుందురు ఓ వేదాంత వేద్యా! సర్వశరణ్యా! సర్వజగత్స్వరూపా! నీభక్తుని గనికరించి రక్షింప మర్హుండవు నీవేకదా! నీమహిమంబు నిబసవనాదులకుజూపి నన్నుద్ధరింపుము" అని భగవంతుని ధ్యానించి యా గాలంబునంవేయ నొక్కొక్కపరి నొక్కొక్క దేవతవంతున బ్రహ్మ విష్ణు రుద్రేంద్రయమాగ్ని నిఋతివరుణ వాయు కుబేరేశాన యక్షరాక్షస పన్నగ గరుడ గంధర్వ కిన్నర కింపురుష విద్యాధరాదులును నంది

భృంగి ప్రముఖ ప్రమథ గణంబును గాలంబున దగిలివచ్చినంత నచ్చటి వారచ్చెఱు వంది చూచుచుండిరి

అంత పార్వతీ రమణుండు వృషభవాహనంబు నధిష్ఠించి ప్రత్యక్షంబైన నా భక్తులెల్లరు (వామదేవాయ నమోజ్యేష్ఠాయ నమశ్శ్రేష్ఠాయ నమోరుద్రాయ నమః కాలాయ నమః కలవికర్ణాయ నమో బలవికర్ణాయ నమోబలాయ నమో బలప్రమథనాయనమస్సర్వభూతదమనాయ నమో మనోన్మనాయనమః) అని వేద సూక్తులచే వినుతించిరి ఆపుణ్యదంపతులును పుణ్యజనాధిప సఖునకు మ్రొక్కి (నమో వృషభవాహాయ జగద్రక్షణహేతువేసర్వప్రమథనాథాయ పార్వతీ పతయేనమః) అని సాష్టాంగంబుగ మ్రొక్కి వినుతించుచుండ నప్పరాత్పరుండు వారిరువురిని విమానంబున నెక్కించుకొని చూపరు లచ్చెఱువందఁ గైలాసంబున కేగెను.

ఆశ్రితరక్షకాయనమః

ఇరువది రెండవ అధ్యాయము ముగిసెను.



శ్రీ గురుభ్యోనమః

# బెట్టిద దేవర సుచరిత్రము.



## [త్రయోవింశత్యధ్యాయము]



కల్యాణంబున బెట్టిదదేవరసుయను నొకభక్తుండుండెను (అమానిత్వమదాంభిత్వమహింసాక్షాంతిరార్జవం ♦ ఆచార్యోపాసనంశౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ♦ ఇంద్రియార్థేషువైరాగ్య మనహంకారఏవచ ♦ జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషానుదర్శనం ♦ అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ♦ నిత్యంచ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ♦ మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ♦ వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది♦అధ్యాత్మజ్ఞాననిత్యత్వంతత్వజ్ఞానార్థదర్శనం ♦ ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా) అనగా విద్యాధనాదులచే గొప్పవాఁడనని దలంపకుండుటయు, దంభము లేకనుండుట, జీవహింసఁ జేయకుండుట, త్రికరణ శుద్ధిగలిగి యుండుట, ఆచార్యోపాసము జేయుట, ఆచారవంతుఁడై యుండుట, స్థిరవృత్తి నొందుట, మనస్సును నిగ్రహించుట, శబ్దాదివిషయముల దూరంబుసేయుట, అహంకారము లేకయుండుట, పుట్టుక చావు రోగము ముసలితనము వీనిదోషముల నెఱుంగుట, పాంచభౌతిక భోగములం దాసపడక, దారాపుత్రాదివిషణత్రయజన్య సుఖదుఃఖములకు సంబంధించకుండుట, యిష్టానిష్ట ప్రాప్తులయందు సమచిత్తము గలిగి యుండుటనాయం దనన్యమైనభక్తి నిజేయుటరహస్యస్థలమున నసించుట, జనసమూహమందుప్రేమను విడుచుట, ఆత్మజ్ఞానముతో గూడియుండుట, తత్వజ్ఞానార్థమును దెలిసికొనుట నివి జ్ఞానమనియు తదితర మజ్ఞానమనియు నీశ్వరుఁడుపదేశించినట్లు లమ్మహానుభావుండుఁ జగించుచు సదాకాలము లింగవీక్షణంబునను లింగధ్యానంబునను కాలంబుబుచ్చుచు ఆచార్యస్వరూపుండగు బసవేశ్వరుని గొలుచుచుండెను.

ఇట్లుండ నొకనాడు బిజ్జలుండు పేరోలగంబుననుండి బసవనచే వీరశైవుల గాథలను వినుచు నిట్లనియెను ఓ మంత్రీ! నీవెప్పుడును పూర్వుల చరిత్రములనే తెల్పుదువుగాని యాధునికులకా మహాత్మ్యంబున్నట్లుసూపింపవు. ఇప్పటివారందఱును వేషధారులు మోసకాండ్రేకాని నిజమైన భక్తులుగారు. అనిన బసవన కోపించి

"ఓ రాజా నీ కెన్నిసారులు భక్తుల మహాత్మ్యమును జూపించినను నీయజ్ఞానమునే వెలిబుచ్చుచుందువు శైవులందు మహాత్మ్యమెన్నటికిని దరుగదు పూర్వులెట్లో యాధునికులట్లే యున్నారు. నీవు చూడఁదలంచిన జూపించెదను అని కట్టెమటనున్న కట్టిదదేవరుసునువిలోకించిన నతండు మంత్రికనుసన్నఁగని దిగ్గనలేచి సభాసదులెల్ల బెగ్గిలవియుద్వీథి నంటంబెరిగి ఓ దేవా! సెలవేమి? సూర్యుని బట్టిమ్రింగుదునా? దేవ తలంబట్టి బొమ్మలరీతి నాడింతునా? కులగిరులం ద్రొక్కఁజేతునా? సముద్ర సప్తకంబు నింకింతునా? యనిపలికి బసవన చిత్తవృత్తి నెఱింగి యొక పర్వతంబును పెకలించు కొనివచ్చి వ్రేళ్ళసందున నిరికించుకొని పైకెగుర వేసినంత సభసదులు తమపైఁ బడునేమోయని భీతిల్లి నిర్విణ్ణులై చూచుచుండిరి నాగిరియు బొంగరముబోలె గిరగిరం దిరిగి యొకచో నేలంబడి చూర్ణంబయ్యెను. అంత బిజ్జలుండులేచి దేవరను పాదార విందంబులపయింబడి "దేవా! మీమహాత్మ్యంబుల నెఱుంగలేక దప్పాడితిని నాయం దనుగ్రహించి నీరూపు నుపసంహరింపుము" అని ప్రార్థించినంత తత్క్షణంబ పూర్వ రీతిని నిజదేహంబును దాల్చి నిలిచెను. సభ్యులెల్లరు నీశ్వరభక్తులహాత్మ్యముం గొనియాడి నిజనివాసంబులకు జనిరి.

అద్భుతచరిత్రాయనమః

ఇరువదిమూడవ యధ్యాయము ముగిసెను.

అద్భుతచరిత్రాయనమః

# గుణేంద్రుని చరిత్రము.



## (చతుర్వింశత్యధ్యాయము)



కల్యాణంబున గుణేంద్రుండను నొక్క భక్తశ్రేష్ఠుండు జితేంద్రియుండై సంతత జపిత పంచాక్షరీ మంత్రుండై యీశ్వరానుగ్రహంబువడసి కేల నొక కప్పెరంగొని శరణులయిండ్లం దిరుగుచు నాకప్పెరనిండువరకు తండులంబుల నడిగికొని ఆయా తండులంబులచే వేనవేలు శరణులకు యిష్టమృష్టాన్నంబులనొసంగుచుండెను. యఃద్భుతంబు బిజ్జలుండువిని సహించలేక బసవనితో నిట్లనియెను.

ఓబసవన్నా! ఈయూరనొకభక్తుండు తాదెచ్చిన కప్పెరడుతండులములతో వేనవేల శరణులకు భోజనంబిడుచున్నాడట ఇందేమైన సత్యంబుగలదా? వివరింపుము. అనిన మంత్రి యిట్లనియెను. ఓరేడా! భవదీయుతవాక్యంబు సత్యంబే యతండు తనకేలనుండు కప్పెరనిండువరకే తండులంబుల సంపాదించును అందు మానెడుకన్న నెక్కువనిల్వావు దానసే లక్షలకొలంది జనములకు మృష్టాన్నంబుల నిడుచుండును. అనిన యిందెంతవరకు సత్యముండునో కనుగొందును మనమునే డాతనింటికి భోజనమునకై వెడలుదము. అనినయట్లేయని బసవేశ్వరుండు రాజసహితుండై గుణేంద్రునింటికి బయలుదేరెను తేనివెంబడి పట్టణజనులందఱును జనిరి ఆవార్తనాలించి గుణేంద్రుండెదురేగి నమస్కరించి రాజును తోడ్తెచ్చి యుచితాసనాసీనుంగావించి బసవనివచనానుసారముగా వచ్చిన వారందఱికిని యిష్టమృష్టాన్నపానీయంబులచే సంతృప్తిగలుంగఁజేసెను రాజును ఆతనిమహాత్త్వముంగొనియాడి నిజమందిరంబున కఱిగెను.

ఆసంగతిని రాజగురుండగు మీమాంసుండెఱింగి కోపమానసుండై "అక్కటా! యీభూపాలునకేమి చేటువాటిల్లినది తనవంశమర్యాదలనుజూడక మతధర్మంబులఁబాటించక శైవులయిండ్లలో భుజించుటకరిగెను ఈగుణంబును మాన్పింపకున నామర్యాదకు భంగంబురాదా? యని చింతించి శిష్యభృత్యగణంబులతోడంగూడి

నిజవైభవంబేపారఁ బయలుదేరి కల్యాణపురప్రాంతోద్యానంబునవిడిసి దూతల చేత తనరాక భూకాంతునకెఱింగించిన నాతఁడు సత్వరంబున గజతురగాందోళి కాదిసహితుండై సమస్త సామంతమంత్రిబంధువులు ప్రజలునుబయలుదేరిరా గురుసన్ని ధానంబునకఱిగి ప్రణామంబునాచరించి సగౌరవంబుగా నెదుర్కొని నిజమందిరంబు కేతెంచి విడిదిసేయించి పిదపఁ గొలువుకూటంబున బ్రవేశించి గురువున కుచితాస నంబిచ్చి కూర్చుండనిచ్చి ధర్మాలాపంబులుసేయుచున్నంతఁ బసవేశ్వరుండు నిజవై భవంబుమెఱయ గొలువునకువిచ్చేసి తనమేల్గద్దియపైఁ గూర్చుండినంత మీమాం సుండతని విభవంబునుగాంచి సహించకయు తనకువందనంబిడకుండుటయు గోపించి శిష్యుండగు జైనింజూచి "మీమాంసుండిట్లనియెను. "ఓధరేంద్రా! యీదురహం కారుఁడెవ్వఁడు. సకలశాస్త్ర పారంగతుండనై రాజగురువునై యెదుటఁగూర్చున్న నన్నుఁ గన్నులనైనఁ గానక గద్దెపైఁ గూర్చున్నాఁడు యిట్టిదోషిని సభలోఁ గూర్చుండనిచ్చుటఁ దగునా యనిన జిఱునగవు మోమునదోప భూమీశుఁడు ,, ఓ స్వామీ ఇతఁడు సాక్షాదపర శంకరుండు ఈతని మహిమంబు లద్భుతంబులు జితేంద్రియుఁడు కేవల సత్వగుణ ప్రధానుడును తనయిల్లు గొల్లబెట్టవచ్చిన మ్లె చ్ఛుల మెడలలోని వార్తాకంబుల లింగంబులఁ గావించెను. జొన్నలరాశిని ముత్య ముల ప్రోవుగాఁ జేసెను. కోశాగారంబుననుండు రొక్కంబునంతయు నొక్క భక్తునకిచ్చి నేనడిగినప్పుడు యథాప్రకారముగా గోశాగారమునందగుపరచెను ఇతడు కేవల పరవాది భయంకరుఁడు ఇదియడియననేల నీతని చరిత్రంబులను వర్ణింప శేషునకును వశముగాదు. ఈతనికతననే నారాజ్యంబు విస్తారంబై శత్రు శూన్యంబై యున్నది. ఈయపారైశ్వర్యంబంతయు నీమహానుభావునివలననే గలిగినది ఇతండు నాప్రధాన మంత్రియైస్థానము నలంకరించి యున్నాఁడు" అనిన విని మీమాంసుండా మాటల కేవగించుకొని గర్వితమతియై ,, ఓ రాజా! ఈతండు పరవాది భయంకరుండంటివి. యెట్లగును నీదేశమున మంత్రిత్వమునవలంబించినంతనే పరవాది భయంకరుండయ్యెనా? నాముంగల వీనిపగ్గెలు సాగునా? వేద వేదాంత ములందును తర్క వ్యాకరణ నిరుక్త ఛందోజ్యోతిష కల్పంబులయందును కావ్య నాటకాలంకారాదుల యందును, యంత్రతంత్రమారణోచ్చాటన స్తంభన ...

మోహన విద్వేషణ వశ్యాకర్షణేంద్రజాల యక్షిణీరసాయనాది విద్యలయందారి తేరినవాఁడను ఇట్టి నాతో వాదించి గెలిచినగదా యితండు పరవారి భయంకరుం డగును. అని పలికి దండనాథుని దిక్కై వాక్స్తంభమంత్రంబును బ్రయోగించినంత బసవండు చిఱునగవునగి తనముంగలనున్న నందికోల శాంతయ్యనుజూచి కనుసైగ జేసినంత నాశాంతయ్య యద్దానిని కొనగోటజిమ్మి పారవైచెను అది భగ్నంబగుడు మీమాంసుండుఁ గనుకట్టును బ్రయోగించిన దానినాకసంబున కెగురఁజిమ్మెను పిమ్మటఁ దన చంకనున్న నిజ్జతోలు కట్టనుగొని బసవనపైకి విసరిన శాంతుండు తన పాదరక్షం గొనివేసెను. అది దానిందూటార్చి మీమాంసుని ముఖముపై నాల్గు ప్రహారణంబులనిచ్చిన మీమాంసుండు భగ్నదంతుండై లేచి భయభక్తులెసఁగ బసవని పదారవిందంబుల పయింబడి "మహాత్మా! నీమహత్వంబు నెఱుంగక నీ కపరాధంబు గావించితిని నీవు సాక్షాద్రుద్రుండవుగాని యన్యుండవుగావు. ఈదీనుని గరుణించుమని ప్రార్థించిన దయాకరుండగు బసవన సంతసించి యతని మన్నించి బిజ్జలునిచే మెప్పువడసి నిజమందిరంబునకుం జనియెను. పిదప మీమాంసుండు మిత శిష్య పరివృతుండై బసవన యింటికేగిన నాతడు మర్యాదం గావించి యుచితాసనా సీనుంజేసిన నమ్మీమాంసుండు సముచిత ప్రసంగంబులంజేయుచు తన్మందిరంబున గోడలకు శోభిల్లు గణపవర్యుల చిత్తరువులంజూచి యచ్చెరువంది బసవనిం జూచి మంత్రిసత్తమా! ఈచిత్రపటములన్నియును సజీవములై యున్న నెంత బాగుండెడిది అనిపలికిన బసవేశ్వరుండు దరహాసితవదనుండై "ఓయీ! నీమనోరథంబట్లుండినసెందుకు జిన్నవుచ్చ వలయును. అదిగో జూడుమని యా చిత్తరువులందలి శరణుల పేర్వేరం బిలిచినంత గీల్గూడిపడిన బొమ్మలంబోలి యప్పటివలెనే స్థితి శరణులు దిగునాడుచుండిరి. దానింగాంచి మీమాంసుండచ్చెరువందిబసవనమహిమనుమిగుల బొగడి నిజనివాసంబునకుం జనియెను. మంత్రివర్యుండు చిత్తరువుల నెప్పటియట్లు గావించి యథావిధి నిత్యకార్యంబుల నాచరించుచుండెను.

గర్వభంజకాయనమః

ఇరువదినాల్గవ అధ్యాయము ముగిసెను.

# చామయ్యచరిత్రము.

## [పంచవింశత్యధ్యాయము.]

కల్యాణంబున చామయ్యయను నొకభక్తుండుండెను. అతండు సత్యవాక్యసంపన్నుండై శైవనిష్ఠాగరిష్ఠుండై (సుదూరమపిగంతవ్యం యత్రభక్తవరాంస్థితాః) అనురీతిని శరణజనోత్తము లెంతదూరముననున్నను వారివద్దరికిజని వందనాది క్రియల నాచరించి వారిని దోడ్తెచ్చి తదారాధనంబు గావించుచుండెను జంగమారాధనకు ద్రవ్యంబులేమి కూలిపనులం జేయుచుండెను.

ఆతండొక్కనాడు బసవనం గాంచనేతెంచి యతని ముంగిలికడనిలిచి తద్దర్శనంబుకై, వేచియుండ యాతాయాత జనసమ్మర్దంబున నతసంగాంచనేరక, నెట్లో లోనికేగి యనేక శరణజన పరివేష్టితుండైన బసవని దర్శనంబుగామి చింతించి యెట్టకేలకుబట్టరాని కోపంబున నందరువినుచుండకట్టా! నాకీశరణులు బసవని దర్శనంబు గానీకున్నారు శిరిగలవానికి నిరుపేదదోమవలెఁ గన్పట్టునుగదా? బెబ్బులి నాశ్రయించిన నక్కలన్నియు వ్యాఘ్రములేయగును. యనిపలికిన వారువిని కోపించి ఔరా! వీఁడెవ్వఁడో కన్నుగానక మితిమీరి పలుకుచున్నాఁడు యీ కూలివానిని లోనికిరానిచ్చినవారెవరు? వీని మెడబట్టిగెంటి వేయుండన నొక్కండులేచిచామయ్య నావలికి గెంటివేసెను.

ఆపరాభవంబును సహించజాలక విషాదమనస్కుండై చామయ్య తనయింటికరుదెంచి యొక చెట్టునీడంగూర్చుండి యిట్లు దలపోసెను. "అక్కటా! నేనేల యాబసవనింటికిబోయి యవమానపడితిని శ్రీమంతులకు దరిద్రులు గానంబడరు శ్రీమదాంధులగువారు జేయుయిట్టి మత్తులకే పరమేశ్వరుడు శిరినొసంగును. (యస్యార్థాస్తస్యమిత్రాణి కృత్యములు పరమేశ్వరునకు మెప్పిదముకాబోలు? (యస్యార్థాస్తస్యమిత్రాణి యస్యార్థాస్తస్యబాంధవాః ◆ యస్యార్థాస్సపుమాంల్లోకే యస్యార్థాస్సచపండితః) లోకములో ధనము గలిగిన వానికే మిత్రులుగానివారుఁగూడ మిత్రులగుదురు ద్రవ్యముగలవాఁ డేనిచుట్టములందఱును దెగ్గఱిబంధువులవలె చుట్టుమూగుదురు

డబద్ధమాడినను సత్యహరిశ్చంద్రుని మించినవాఁడగును. వాఁడేలోకోత్తరపురుషుఁడు అమ్మహానుభావుఁడే పెద్దవిద్వాంసుఁడు వాఁడే లోకపూజ్యుండుకులీనుఁడు నగును ఓ విత్తమా! నిన్నాశ్రయించినవాఁడెట్టి యకార్యములనైనం జేయును. యెన్నెన్నో పాతకములునీయందులీనమగుచున్నవి. నీకు బందుగు, మిత్రుఁడు, పుత్రుఁడు, తండ్రి తల్లియనిలేదుగురుఁడులేఁడు దైవములేదు (అర్థసంసద్విమోహాయవిమోహోనరకాయచతస్మాదర్థమనర్థాఖ్యం శ్రేయోర్థీ దూరతస్త్యజేత్) అనగా ద్రవ్యము మోహమునకు హేతువు ఆమోహము నరకమునకు త్రోవ. కావున పరమార్థమును గోరువాఁడీ యనర్థదాయకమైన యర్థమును శత్రురూపముగా దూరము జేయవలయునని పెద్దలు జెప్పుదురు. యీధనవంతు లెన్నటికిని పరమేశ్వరునికి బ్రియులుఁగాఁజాలరు అందుకేగదా (యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తంహరామ్యహం) అనురీతి యెవని ననుగ్రహించుదునో వానిద్రవ్యమును హరింతును అని భగవంతుఁడానతిచ్చినాఁడు. ఇంతటి ద్రవ్యంబున్నదనియేకదా బసవఁడేరిని కనులంగానకున్నాఁడు అతని నాశ్రయించువారందఱు నాతనికంటె నెక్కువవారైరి. ఆహా! వీరిదేమి మోహము, వీరికీద్రవ్యమెప్పటికిని శాశ్వతముగ నుండునని భావముగాబోలును? ఓబసవనా! లక్ష్మి చంచలమని భావించుము. చంచలమైన శిరికాసపడి యేలఁగర్వితుఁడవై చెడిపోవుచున్నావు నీవెంతో మహానుభావుఁడవు నీదర్శనముచే జన్మము ధన్యమగునని తలంచి నీవద్దికివచ్చి భంగపాటుఁజెందితిని యీనాఁడెచటికిఁ గూలికిబోక జెడిపోయితిని. నానిత్యకృత్యమునకు భంగము గల్గెను. జంగమార్చన నెట్లుగావింతును డంబాచారియని భక్తులు నన్నేమి కోపింతురో ఓపరాత్పరా! దీనబంధూ! ఆర్తత్రాణ పరాయణా! సర్వేశ్వరా! నాకీపాడుబుద్ధి నేలగల్పించితివి దురాశనేలగల్పించితివి అయ్యో (జీర్యంతేజీర్యతః కేశాః దంతాజీర్యంతిజీర్యతః । చక్షుశ్శ్రోత్రేచ జీర్యేతే తృష్ణైకానిరుపద్రవా) అనునట్లు వెంట్రుకలు తెల్లబారినను, పండ్లూడిపోయినను, చెవులు వినరాకపోయినను, కనులు కానరాకపోయినను, ఆశమాత్రము అంతకంతకు తరుణమగుచున్నది. దానిచేత నెందఱెందఱో దుఃఖాంబుధిలోఁ గూలిపోవుచున్నారు. నేనీవేళ యాశనాశ్రయించియే యిహపరదూరుఁడనై పరమాత్ముని కృపకు దూరుఁడనైపోయితిని అని పెక్కుభంగులం జింతించుచుండెను.

అంత నిక్కడ బసవని గృహంబున శరణజన సమారాధనకొఱకు వంటకంబు సేయుచున్నంతె వండిన పదార్థంబెల్ల నున్నదున్నట్టె గనఁబడకుండ నయ్యోను భాండము

లందలి యున్న మందులో నే తిరోధానముఁజెందెను. ఎక్కడి వస్తుజాలం బక్కడనే మాయంబయ్యెను. ఈసంగతి నందఱుఁజూచి విస్మయమందిరి. బసవేశ్వరుండు భయ భ్రాంతుండై "అయ్యో! ఈనాఁడేమి తప్పుఁజేసితిని? శరణజనంబునుగనియు నాద రంబున మ్రొక్కకుంటినా? యెవనికేని హానిఁజేసితినా? పరద్రవ్యాపహరణంబుగావించి తినా? పరుల కవమానంబు ఘటింపఁజేసితినా? ఎవరేని జంగమొత్తములడిగిన లేదం టినా? యేల నిర్నిమిత్తముగా నీగతి సంభవించినది? అని కింకర్తవ్యతామూఢుండై చింతించుచుండ నొక్క భటుండరుదెంచి చామయ్య సంగతిఁ దెలపినతత్క్షణంబమంత్రి పుంగవుండు లింగదర్పణంబున చామయ్య ప్రవృత్తి నెరింగి యతడున్నకడ కేగి దండ ప్రణామంబుగావించి స్వామీ! నాజేసిన నేరంబుక్షమించి నన్ను సంరక్షించుము నేను దుర్మదుండను, శఠుండను తమరీ దీనునివద్దికి వేంచేయు టెఱుంగక మోసపోయితిని శరణాగత రక్షణంబార్యధర్మంబుగదా? శరణగణంబంతయు క్షుధాకులంబైయున్నది గణార్చనయే నాజీవనాధారము మీరు గరుణించకున్నచో నాప్రాణంబులునిలువవు పుత్రుండుఁజేసిన నేరములనుతండ్రియేకదా కప్పిపుచ్చును. అని పెక్కుభంగుల గొని యాడుచున్న బసవేశునిజూచి చామయ్య భక్తియుక్తుండై నమస్కరించి "దేవా! నన్నీలాగు పెద్దఁజేసి నుతించుటఁ బాడిగాదు. మాదృశ భవమగ్నుల నుద్ధరించుటకు గాదా భగవదంశంబున జన్మించితివి నీమహిమంబును గొనియాడ శేషున కలవి గాదు అని ప్రస్తుతించి వినయంబునబంపిన మంత్రి దనయింటికి వచ్చువరకు నెప్పటి యట్ల సకల పదార్థంబులు దృగ్గోచరంబులగుటయు సంతసించి గణార్చనంబు గావించి సంతుష్టాంతరంగుండై యుండెను.

మాయావినే నమః

ఇరువది యయిదవ అధ్యాయము ముగిసెను.

మాయావినేనమః

# ఏకాంతి రామయ్య చరిత్రము

## (షడ్వింశత్యధ్యాయము.)

కేవల మపరరుద్రుండో యన ప్రభావ ప్రభాప్రతిభలచే వెలుంగుచు శమదమాది గుణసంపన్నుండై యితరమత నిరసనుండై శైవమత సిద్ధాంత ప్రతిపాదకుండై లింగరహస్యజ్ఞానియై పరమైకాంతియై ముప్పూటలును లింగపూజ నొనర్చుచు నేకాంతి రామయ్యయను శరణవర్యుండుండెను. అమ్మహానీయుండు నిత్యము లింగపూజానంతరము ప్రమథలోకమున కేఁగి వీరభద్రాదులకు నమస్కరించి వారితోడ శివభక్తి రహస్యతత్త్వంబులను ముచ్చటించి యెప్పటియట్ల భూలోకంబునకు వచ్చుచుండెను.

ఇట్లుండం గల్యాణంబున బసవేశ్వరుని భక్తిప్రభావంబులు దెసల నాక్రమించిన విని యతనిం గాంచ నెంచి యేకాంతిరామయ్య ప్రచ్ఛన్నవేషంబునఁ గల్యాణంబుఁ జేరి బసవనిం గాంచి సంతసించి యేకాకియై జరించుచు నొక్కశివాలయంబుఁ జొచ్చి యందుఁ గూర్చుండెను.

అంత నొక్క జైనుండుఁ జెప్పులకాళ్ళతో గుడిసొచ్చినం గాంచి కోపించి "ఓరీ జైనా! నీచుండవై చెప్పుకాలుతో శివాలయముం జొచ్చితివా? ఆతప్పునకు చెప్పుల నావల బారవైచి సాష్టాంగపడి శివునకు మ్రొక్కుము లేదేని శివదండనలకు గురియగుదువు. చెప్పుకాలితో క్షణములినిచితేని నిన్నుఁ దునుకదునుకలుగ ఖండింతును అనిన నాజైనుండుఁ గనలి "ఓరీ! నీవేల నాగ్రహించెదవు? దిక్కులేని ముక్కంటిగుళ్ళకు నీవొక్కదిక్కు గల్గితివా? నీవొక్క భక్తుండవా? సత్యంబులేని మీదేవునకును నిష్ఠలేని నీకును నేవెఱతునా? వేల్పులకెల్ల పెద్ద మాజినదేవుఁడు. వానికి నేను నిక్కమైనభక్తుఁడను. నీవు హరభక్తుఁడవే నిజమేని మీదేవుండు ప్రభావంబు గలవాఁడేని నీతల నఱికికొని మఱల వడయుము" అని జైనుండు బలికిన, శివభక్తి మహత్వమును వెల్లడింపఁ దలచి యేకాంతిరామయ్య యిట్లనియెను.

ఓ జైనుఁడా! శివభక్తుల మహిమ నీకేమి తెలియును వినుము జంబూర మహాశాళుఁడను భక్తుండు తన తలను శివునకర్పించి సమస్తజనులచ్చెరువంద మఱల శిరంబును బడసెను. ఈపట్టణంబుననే గోవిందభట్టారకుండు తనతలను శివున కర్పించి మూఁడునాళ్ళకు మఱల శివానుగ్రహంబున తలనున్న బొందెను మఱియట

వంకయ్య భక్తిచే శివునకు తలనర్పింప వెంటనే మఱియొక తలయుదయించెను. ఇట్లు మొలచెటి తలయు నఱికెటి తలయు నెగిరెడి తలయు శివునిచేరెడితలయు, మఱలవచ్చెడి తలయు మొలవనున్న తలయు శివునిచేతిలోని తలయు పాదములపై బడు తలయు నిగిలించు తలయు శరణమను తలయు నుతియించు తలయు శివుని గలయు తలయు నగుచు కోట్లకొలంది తలలుదయించెను అప్పుడు శంకరుఁడు బ్రత్యక్షమై వంకయ్యనుజూచి ఓ భక్తా! నీకు నేనోడితిని నీనిష్ఠకు మెచ్చితినని బల్కి యాతలలనన్నింటిఁదనరుండమాలలోఁ జేర్చుకొనెను కావున నో జైనా! యిటు వంటి భక్తులు మాయందు వేలకొలది యున్నారు. మునుపు మీవారినెందరినో మాభక్తులు గడతేర్చినారు తిరునావలూరను కరిశుండును జైనాచార్యునికి శూల బాధ గలిగించెను. ఆతని సహోదరి శివభక్తురాలు గావున తనయన్నవద్దికేగి "భక్తులకు ప్రణమిల్లి పంచాక్షరీ మంత్రోపదేశంబు నొందితివేని శూలయుడుగు" నని తెలిపిన వల్లెయని తద్బాధం బడజాలక నొకగురువర్యునిచే మంత్రోపదేశ మొందినంతనే శూలబాధ నివృత్తియయ్యెను. తన్మహత్వంబునకలరి యప్పటినుండి శివభక్తుండయ్యెను.

మఱియు వినుము గోవూరు బ్రహ్మయ్యయను శివభక్తునకును యొక జైనము నకు నొకనాడు వివాదంబుఁ జరిగెను. దాన జైనుండోడెను. అట్లోడియు నచ్చట నున్న మఱ్ఱిచెట్టుంజూపి జైనుండు బ్రహ్మయ్యంజూచి "దీనిని నీవుగాల్చెదవా లేక మొలిపించెదవా? యనిన బ్రహ్మయ్య యిట్లనియెను "యేప్రాణినైనను హింసింపుట మాతెరంగుగాదు. నీవు గాల్చుము నేను మొలపించెదను" అనిన జైనుండు మంత్ర తంత్రంబుల గావించి యాచెట్టును గాల్చెను. వెంటనే బ్రహ్మయ్య యేమంత్ర తంత్రంబులులేక విభూతిం జల్లి యెప్పటియట్ల వటవృక్షమును వికసింపంజేసెను. తనశిష్యులం బిదపం గోవూరి జైనవసతులనెల్లం బాడుజేసి జైనాచార్యులనెల్ల తనశిష్యులం గావించుకొనెను మా శైవుల మహాత్మ్యంబసాధారణంబు వారలగినచో బ్రహ్మా దులును గడగడ వడకుదురు ఇంకను మా శైవుల మహత్వంబును వినుము.

భక్తకింకరతాయనమః

ఇరువదియాఱవ అధ్యాయము ముగిసెను.

# ఏకాంతిరామయ్య జైనునకు శివపరత్వంబు జెప్పుచరిత్రము



## [సప్తవింశత్యధ్యాయము.]



ఓ జైనా! వినుము పొట్లచెఱువుయను పురంబున నేడు నూర్లమఠములుం గట్టి యిఱువదివేల జినమునులు గొలువ జైనాచార్యుండు నాపట్టణపు రాజునకు గురువై జైనధర్మంబులం బోధించుచుండెను. ఆరాజు భార్యయగు సుగ్గలదేవి తేడర దాసయ్యగారి యనుగ్రహ పాత్రురాలుగాన నిక్కడ విధానంబు తనకు సహాయంబుగా దోచుకు హితులం బంపి తేడః దాసయ్యం బిలిపించెను. ఆసమాచారంబును గుర్తెఱింగి జైనులు రాజుతో విన్నపింప నతండు నిజకాంత చెంతకఱిగి "ఓవనితా! లోకంబునందెందైన భార్యదొక్క మతము భర్తారుని దొక్కమతముండునా? నీచిన్ననాటి గురుశిష్య సంబంధంబును జాలించుము. నీస్వాములను తిరిగిపంపుము లేదేని జినమును లాగ్రహింతురు అని పలికిన రాణికోపించి "ఓ రాజా! గురుశిష్య సంబంధంబెన్నటికిని దెగదు. (నగురోరపరస్త్రాత్రా ◆ గురురేవపరంబ్రహ్మ) అనురీతి గురువుకన్న రక్షకుండెవడును లోకమున లేడు ఆగురువే ప్రత్యక్ష శివస్వరూపము. గురువునందు మానవభావముంచిన వారు నరకపాతులగుదురు సంసారసముద్రము నందు బడనీక మోక్షమార్గమును జూపువాఁడు గురువేకదా! గురుసమాశ్రయణము లేనివారికిహపరములయందును సద్గతులులేవు. ఒకవేళ సతీపురుషుల మతములు భిన్నములు గావచ్చునుగాని గురుశిష్యమతములు భిన్నములుగావు మనవివాహము నాటిమాట జ్ఞప్తికి నుంచుకొనుఁడు నీకింకొక్క భార్యయుండిన నుండవచ్చునుగాని నాకట్లుగాదు ఒకవేళ భర్తృమార్గము ననుసరించనిది పతివ్రత గాదందువేమో ఆసంబంధము దైహికము దేహసంబంధులు ఈదేహమున్నంతవరకేకాని యవల నుండనేరదు నేనును నీవును యింతవరకెందఱికి సంబంధమైతిమో తెలియునా? గురుసంబంధ మాత్మకుగాని దేహమునకుగాదు గురువనగా (గుశబ్దస్త్వంధకారస్స్యా

దుశ్శబ్దస్తన్నిరోధకః] అనురీతి అజ్ఞానాంధకారమును బాపి కేవల దైహిక సంబంధు లతోఁ జేరి ఈ సంసారమే నిజమని నమ్ముకొనువారలకు (యద్దృశ్యంతన్నశ్యం) యీ కనబడువస్తువులెల్ల నశించునవి. యనశ్వరమగు పదార్థ మొక్కటియున్నదని తెలిపి దాని స్వరూపము తెలియఁగఁజేయువాఁడు అట్టాత్మ నుద్ధరించు గురువునకంటె నితరబంధువుఁ డెవ్వఁడును లేడు. ఒకవేళ నామతము మీకిష్టముగాకున్నను విడువ వచ్చును. నాకు పార్వతీరమణుండుఁదప్ప నాశ్రయం బెద్దియులేదు. అట్లుగాదేని వేదాది శాస్త్రవాదంబులచే మాగురువుగారి నోడింపుము" అనిన నట్లగుఁగాకయని రాజుసభఁగావించి జైనులనందఱిని రావించెను. రాజసింహాసనమునకు వామభాగం బున బంగారు సింగాసనంబును వేయించి యందు దాసయ్యం గూర్చుండఁబెట్టి సుగ్గలదేవి తత్పాదఘట్టనంబుఁ గావించుచుండెను.

అంత జైనులు మంత్రతంత్ర మహేంద్రజాలేంద్రజాలాది విద్యలనునేర్చిన వారు వేలకొలఁది మందివచ్చి వాదంబునకుఁ గూర్చుండిరి. అప్పుడు జైనులద్వైత మాయావాద కర్మవిద్వేషంబున వాదింపవారికి (ఏకఏవరుద్రోదేవః) భూచరాఃఖేచ రావారిచరాగిరిచరాశ్చయే ♦ శివఏవహివిజ్ఞేయ శ్శివాదన్యంనకించన ♦ శివాతిరిక్త నహిచ సర్వంశివమయంజగత్ ♦ అంతర్బహిశ్శివః పూర్ణః అంతర్యామీ పరశ్శివ ఆత్మాపరాత్మాపరమ శ్శివఏవనసంశయః ♦ సర్వత్రపరిపూర్ణోసౌ సచ్చిదానంద విగ్రహః ♦ అద్వితీయః పరశ్శంభురఖండాత్మాసనాతనః ♦ ఈశావాస్యమిదంసర్వం జగదేతచ్చరాచరం ♦ అతఃకింబహునోక్తేన శివాత్మకమిదంజగత్ ♦ ఈశానస్సర్వవిద్యా నామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మాశివో అస్తుసదా శివోమ్). ఇత్యాది శృతిస్మృతిపురాణాదుల ప్రమాణంబులచే సర్వేశ్వరుఁడగు శంక రుఁడే దేవతయు ఈ కనఁబడు భూచరఖేచర జలచరాది సంయుక్త సర్వప్రపంచంబు ఈశ్వరుని స్వరూపమేకాని శివాతిరిక్తంబైన వస్తువు కించిత్తైనను లేదు ప్రపంచ మునకు వెలుపలలోపలయు శివుఁడే నిండియున్నాఁడు ఆశివుఁడే సర్వోత్కృష్టుండు వానికి బరమైన వస్తువులేదు. బ్రహ్మాది దేవతలు నతనియాజ్ఞనుండి చెప్పినపనిఁ జేయుదురు గాన శివుఁడే సర్వజగత్కారణుండు" అని నిరూపించి (లింగబాహ్యు

త్పరతరంనాస్తి, అనగా లింగముకంటె భిన్నమైనపదార్థమేలేదు ఈదృశ్యమైన పదార్థ మంతయు" అనిన జైనులు ఓయీ! ఈజగంబంతయు శివుఁడే యంటివి. శివుఁడే జగంబున కంగమా లేక జీవమా? పరమాత్మయా? అట్లగుచో మీరొకచో గుడిలో నున్న లింగమునకుమాత్రమేలఁ బూజింతురు? చెప్పుమనిన దాసయ్య యిట్లనియెను ఓ శ్రమణులారా! వినుఁడు ఈప్రపంచంబంతయు రాజేయన్నప్పుడు అందు విభేద ముండునా? అట్లే ప్రపంచమంతయు సర్వేశ్వర స్వరూపమన్నప్పుడు భేదములేదు. అట్లుండ మేముగుడిలోని లింగమునుమాత్రమేల పూజింతుమో వినుఁడు ఆకసంబున చంద్రుఁడు వికసించిన నిలపైనున్న రాళ్ళన్నియు గాంతిమంతంబులగును. అందు జంద్రకాంతపు రాళ్ళుమాత్రమే కరుగును అన్నియు రాళ్ళేకదా ఇతరశిలలేల స్రవిం చకయుండును చంద్రిక యన్నిరాళ్ళయందును సమముగనే ప్రకాశించును. అచంద్రి కాప్రకాశమునకు భేదబుద్ధిలేదు కాని అన్నిరాళ్ళకును కఱుగు స్వభావములేదు. అట్లే ఈశ్వరుఁడు సర్వవ్యాపియైనను భక్తులహృదయములే భక్తివంతంబులగును! ఈశ్వరుఁడు వారియందే ప్రసన్నచిత్తుఁడగును. శివునకు అరూపసరూపములు సమ ములుగానే యుండును (నతేరూపంనచాకారం నాయుధానినచాస్పదం॥తథాపిపురుషా కారో భక్తానాంత్వం ప్రకాశసే) అనురీతి రూపము ఆకారము సాధనము ఒకతావుఁ నామము, లేనట్టి పురురూపియగు భగవంతుడు భక్తులకొరకే సరూపమును బొందును ఈశ్వరుని స్వస్వరూపము రూపమేలయ్యుండును అట్లే జీవునకు నరూపమే యున్నను కర్మజన్యమైన శరీరసంబంధముచే రూపముగల్గును ఈశ్వరునకు స్వరూప పరిగ్రహమైచ్ఛికము అది దివ్యమంగళ విగ్రహ విశిష్టము దానికి జననమరణ జరా వ్యాధ్యాదులు లేవు అది భక్తుల కోరకపై నుండును; స్వాతివాన యంతట గురి యును. ఆవానలో నెప్పటికిని గటిచిప్ప మ్రింగుచునేయుండును. కాని అన్ని చిను కులకు రత్నములగీనదు. యెప్పుడో యేవేళనో మ్రింగిన చినుకులచే రత్నములు గలుంగును అట్లనే లింగజంగమ సామరస్యము. ఖాలిమెరనే చూడనివానికి యూరేమి తెలియును అందలి మేడల సౌష్ఠవం బేమి తెలియును. శివుఁడు దేహమా? జీవమా? ఆత్మయా యనుటకు వినుండు దేహము పూర్వకర్మమున గలింగి సుఖదుఃఖ జరామరణవ్యాధి పుణ్యపాపరూపమై నస్వరమైయుండును గాన దేహము శివుఁడు

గాఁడు జీవుఁడే శివుడందురా! జీవుడస్వతంత్రుఁడు పాపకారి మలినుడుఒకనికి భృత్యుడు నశించువాఁడు కర్మానుభవుఁడు. జననమరణాదులు గలవాఁడు త్రిగుణంబులకు బద్ధుఁడు శివుండు వీనినన్నిటికి విలక్షణుండు స్వతంత్రుండుగాన శివుఁడు జీవుఁడుగాఁడు ఆత్మయందురేని ఆత్మ పంచభూతాత్మకంబై పంచేంద్రియాత్మకంబై దేహగుణాత్మకంబై యుండును గాన ఆత్మశివుఁడుగాఁడు. ఇఁక శివుఁడు అఖండ చిత్స్వరూపుఁడు కల్యాణగుణ విశిష్టుండు ప్రకృతి దూరుండును తానరూపుండై యుండియు (అణోరణీయాన్ మహతోమహీయా నాత్మాగుహాయాం నిహితోస్యజంతోః) అనువున కంటెనణుస్వరూపుండై మహత్తుకంటె మహాత్స్వరూపుండై యుండియు జీవుల యొక్క హృదయ కుహరమునందు వెలయుచున్నాఁడు (సతపోఽతప్యత ♦ సతపస్తప్త్వా ♦ ఇదగ్ంసర్వమసృజత యదిదంకించ తత్సృష్ట్వా ♦ తదేవానుప్రవిశత్) అనునట్లు జగత్కారణుండైన ఆ పరశివుండు యోగనిద్ర ననుష్టించి ఈదృశ్యమాన జగంబునంతయు సృజించి అందుతాను జీవులతోడనుప్రవిష్టుండై యుండెను. గావున నే నూవులలో నూనెయట్లు, కట్టెలోని యగ్గియట్లు రాతిలో నినుముభాతి, పాలలో నేయిభంగి, నీటికడవలలోని చంద్రునిరీతి, పూసలలోని దారంబువలె అద్దములోని ప్రతిబింబము చందాన, ఘటపటాదులలోని ఆకాశముబోలి బీజములోనితరువుభాతి ప్రతిధ్వని సమానము శివుఁడు ప్రపంచ శబ్దములోని యర్థముతీరు, గుహాలయందలి ప్రతిధ్వని సమానము శివుఁడు ప్రపంచ మును విడకయుండును ఈజగంబంతయు ముల్లుగుచ్చ సంధిలేకయుండిన నాశివుడే సర్వలోకేశ్వరుండు ఆతఁడే జగద్వంద్యుండు అనిన జైనులిట్లనిరి ఓ పండితా! అట్ల యిన నీశివునకు ప్రపంచమునకంటె విశేషములేమి? శివుండు నిత్యుండు ప్రపంచ మనిత్యముగదా, ప్రపంచంబంతయు శివుడేయన్న శివుఁడును అనిత్యుఁడు గాఁడా? శివ్రుఁడే దైవమయిన ప్రపంచంబంతయు దైవముగాగూడదా? పశుపతి శివుండైన పశువులన్నియు శివులెందుకుఁ గాగూడదు" అనిన వారివితండవాదమునకు గనలి దాసయ్య యిట్లనెను ఓ మూర్ఖులారా! మీ చెప్పదంటు ప్రశ్నకు బ్రత్యుత్తరంబును వినుడు: నూనెగాఁజేసి దీపము పెట్టిన దీపము వెల్గునుగాని నూగులుబోసి దీపము బెట్టిన వెల్గునా? అప్పుడు నువ్వులలో నూనెలేదా? నూవులలో నూనెగుణంబున్నదా అట్లే ఈశ్వరుండిన్నిటదానున్నను ఈశ్వరుని గుణములు ప్రపంచమునకు రావు.

నువ్వులలో నూనెయుండునుగాని నూనెలో నువ్వులు లేవు. అన్ని యీశ్వరుని యందున్నను ఈశ్వరుండన్నిటియందుండడు. తైలమునకాధారము పాత్రిముగాని పాత్రిమున కాధారము తైలముగాదు. అట్లే శివుఁడు ప్రపంచమున కాధారముగాని ప్రపంచము శివునకాధారముగాదు " అని పలికిన జినమునులపహసించుచు ఓయయ్యా నీవలన చాలామర్మములు మాకు తెలిసెను. గాని మామనంబున గాఢసందేహము గల్గినది. ప్రపంచమంతయు మీశివుఁడే నిండియున్న మలమూత్రిముల విడుచుటకు తావేది. యెక్కడవిడిచినను శివుండే యున్నాడుగదా? అనిన దాసయ్యగనలి "ఓ వెంగలులారా! వినుఁడు శివుఁడు సర్వవ్యాపియగుట సత్యమేగాని శివుఁడే లేడని పెడవాదముజేయ మీనోళ్ళే మలమూత్రివిసర్జనస్థానములు, ఓ యధము లారా! వెనుకంజలేయక నడుగుడు. మీకిట్లే మారుత్తరంబు వచ్చుచుండును (సర్వంఖల్విదంబ్రిహ్మ)యను ప్రిమాణంబును వినుఁడు సకలంబు తనయందుండినను తానందుండక సకలంబును బుట్టించియు దానందు బుట్టక సకలంబును గిట్టించుచు దానందు గిట్టక ముల్లుగుచ్చి సందులేక సకలంబు తనయందున్నను దానిని వహించు జాణమై నిజాజ్ఞాప్రిభావంబున సకలంబును సంచలింపంజేయుచు నిచ్ఛామాత్రంబున సృష్టిస్థితిలయంబులుఁజేయు ప్రిభుసైనవాఁడును, లేడన్నవారికి లేకను కలఁడన్నవారికి గలిఁగియున్నవాఁడునుతలంపులకుమీఁజినతత్వంబులవాడుఁను మెరుక నెరిగినచో నెరుక పడువాడును, వలపింపరాని వలపులవాడును, వలయునన్ని వరముల నిచ్చువాఁడును, పొందరాని తావుగలవాడునుపొందినవారికి మోక్షమునిచ్చువాఁడును పట్టినచో బట్ట బడులగువాడును చక్షురగోచరంబగు తేజంబుగలవాఁడునునిదానించిచూచిన కనంబ డెడివాడును తెలియరాని వేషంబు గలవాఁడును తెలివిలోపల నేవిహరించువాడునువాసన గడచినడువడిఁగలవాడువాసనలవిడిచిననేగానియగుపడనివాడును,రుచులకుమించిన సారముగలవాఁడు,రుచులను బాసిననేగానిప్రసన్నుడగువాడును భక్తవత్సలుడై శక్తిక లితుడై సాక్షాల్లింగస్వరూపుండై యుండువాడుగావునమాదేవునిప్రతిభావిశేషంబు నెన్న బ్రిహ్మాదులకువశంబుగాదు కాని మీకదృష్టప్రిమాణంబులచే పనిలేదుమీరడిగినచో బ్రత్యక్షంబు నూపింతును మీయేడునూర్లవనతుఁ దృివ్వింతును. ఓ పశువులారా! ఆలసించేదరేల? అనిన జైనులు. ఆహా! యెన్నిటనైనను వీడోడకుండనున్నాడు యేదైన దృష్టాంతమున వీనినోడింతమని యొక్కఘనసర్పంబున్ను గడువలోనుంచి

మూతఁగట్టి తెచ్చి యిందులో మీశివుండున్న జేమో చూపుమనిన దానయ్య సంత సించి ఆధునిక పురాతనభక్తులకు మ్రొక్కి (గౌరీవల్లభ కామారె కాలకూటవిషాశన మాముద్ధరాపదంభోధేస్త్రిపురఘ్నాంతకాంతక) యని శివునిదలంచి ఓ జైనులారా ! శివుడే సర్వోత్కృష్టుడైన దేవుడు శివభక్తులే యుత్తమచరిత్రులు పరమునుదలువని వారే పాపాత్ములు అని పలికి కుండలో చెయిబెట్టి అగ్నిజ్వాలాభీలంబైన విషంబును గ్రక్కుచు రోజుచున్న ఘనసర్పంబునుబట్టి ద్రిప్పినంతనేకోటిసూర్యులు ప్రకాశించు తెరంగున మిక్కిలి తెలివిగలిగి చూపరుల కనులు జీకట్లుగ్రమ్మ స్ఫటిక మయ లింగంబందుగనంబడెను. దుష్టజైనులందఱు యద్భుతంబునకు భయంపడి గేకల వేయుచు కరకమలంబుల ముకుళించి రక్షించుమని ప్రార్థించుచుండిరి. సుగ్గలదేవి సంతసించి గురువర్యుని స్తోత్రించెను. శరణమును జెందిన జైనుల నందఱిని లింగాం గులంజేసి జైనమందిరంబులగూలనేసియాలింగంబును పొట్లచెరువున స్థాపించి యుత్త రేశ్వరుండని నామంబిడి నిజనివాసంబునకు జనెను ఓ జైనా వింటివా మాశివుని పరత్వము మాభక్తుల మహాత్వమును.

ప్రపంచస్వరూపాయ నమః

ఇరువది యేడవ అధ్యాయము ముగిసెను.

శ్రీశుభమస్తు

# ఏకాంతిరామయ్య జైనునకు శివమహత్వముంజెప్పి నిజమహత్వంబును జూపించు చరిత్రము.

## (అష్టావింశత్యధ్యాయము)

ఏకాంతిరామయ్య యిట్లనియెను ఓ జైనా! మఱియు వినుము మారుడిగను పురంబు ననేక జైనులాక్రమించి పదునేడునూర్ల మందిరంబులంగట్టికొని యుండిరి అందొకటిమాత్రమే శివాలయముండెను. దానిని వారు నిర్మూలించిరి. ఆపురంబున నాచిదేవుడను నొక్కభక్తుం డేరికిదెలియకుండనుండెను ఆతడీ సంగతి నెఱింగి దేవున కారగింపు సేయక నేనెట్లుఁ గూఁడుఁగుడువగలను తిరిగి నీయూర శివలింగమును బ్రతిష్ఠించియే భుజింతుసని ప్రతినదాల్చి బయలుదేరి యేడెనిమిది దినములవరకు గ్రామగ్రామంబులందిరిగి పండ్రెండువేల శివభక్తులంగూర్చుకొని పదునేడునూర్ల శివలింగంబుల బండ్లపై నెక్కించుకొని తిరిగివచ్చి మారుడిగపురంబును ముట్టడించి జైనులుఁదప్ప తక్కిన బ్రాహ్మణాది చండాలపర్యంతము తమకు సహాయము రావలెనని చాటించెను అట్టి మొల్లజనంబుఁతోడురానాయుధుఁడై యొక్కుమ్మడి జైనులపైబడి వారిందునుమాడి జైనవిగ్రహంబుల తలలఁబగులగొట్టి పాడుసేసి యాగుళ్లయందు శివలింగంబుల బ్రతిష్టించి చావగ మిగిలిన జైనుల శైవులఁ గావించెను.

మఱియు హుళిగరయను గ్రామంబున సోమన్నయను శివభక్తుడుండెను. ఆయూరనొక్కడే శివభక్తుండు గాన దైవవశంబున నతనికి నేత్రవ్యాధి సంభవించి శివాలయంబునకుఁజనుట కాయాసపడుచుండెను. దానింగాంచి కొందఱు జైనులు సోమన్నకడకువచ్చి "ఓస్వామీ! నీకు కన్నులుగానరాక నాయాసపడుచున్నావు మేము నిన్ను శివాలయమునకుఁ గొనిపోవుదుము రమ్మని మెల్లన నతని చేయిబట్టికొని తమ జైనమందిరంబునకు గొనిపోయి యిదే శివాలయంబు ఇదే శివలింగంబని జైన విగ్రహంబును జూపించిరి. సోమన్నయు నిజంబనిమెంచి మందిరములోపలికిఁబోయి

జైనవిగ్రహమునకుఁ బూజించుచుండెను. అంత నాతుంటరులు "ఓస్సోమన్నా ! నీవు జలం జాలించుము నీవు జైనుడవైనందుకు మాదేవుఁడు బ్రసన్నుఁడైనాడు నిన్ను దనహానినిగా జేసికొనినాడు మాయనుగ్రహంబున బ్రతుకుమనిన సోముడు కోపించి ఓపందలారా ! ఆతఁడు మీ జైనదేవుఁడెట్లగును సాక్షాత్ లింగమూర్తి యే ఇదిగో మీకుఁ జూపించెదను" అనిపలికి తనకనుగట్టునువిప్పి యాయాసమునగనుల దెఱచి చూచునంతవరకు జినరూపంబుఁ బటపటబగిలి తటుకునబడ నటనుండి నిటలాక్షుఁడు బ్రత్యక్షంబై నిలచిన జైనులు సెఱగందిపారిరి అంత సోమేశ్వర నామంబున ఈశ్వరుండాయూరఁ బూజింపఁ బడుచుండెను హుళిగెరలో నిప్పటి కిని మాశివభక్తుల మహిమంబునుజాట మీజినవిగ్రహంబే సాక్షిగనున్నది.

మఱియు పరవళియందు వైజయను భక్తురాలు దనమగఁడు మొదలగుబంధు గులందరు జినమార్గవర్తనులైయున్నను దాను శివభక్తురాలైయుండెను. ఒక్క పర్వం బున దద్భర్త జైనులకుగుడుపుఁబెట్టదలంచి నానాపదార్థంబులం జేయించిన వైజపదా ర్థంబులనెల్ల సేసి "అక్కటా! నాసేతివంటకంబుఁ గూళలగు జైనులపాల్గావలసివచ్చెఁ గదా ఒక్క శరణమూర్తియైనను గన్పడకున్నాఁడు నేనేమిసేయుదునని దుఃఖించు చుండ గరుణామూర్తియగు శంకరుండు జంగమ వేషధారియైవచ్చిన మచ్చికమీర నమ్మచ్చెకంటి యమ్మహాత్ముని పాదంబులపైఁబడి మ్రొక్కి మగనివలనభయంపడుచు నులికిపడుచుదడబడుచు విడువనిభక్తిచే నయ్యయ్య పాగంబులం గడిగి తీర్థంబును గ్రహించి మించిన ప్రేమచేఁ గదళీపత్రంబున బదార్థంబులను వడ్డించిన నాతబిసియు రుచులాగ్రొచు భుజించుచుండెను అంత జైనులు భుజించనేతెంచి యంతకుమునుపు నాతపసి యద్ధ వైజవద్ద భుజించుచున్న శరణవర్యునిగాంచి తిరిగిపోవుచుండ నాతపసి యద్ధ శ్యుండయ్యెను. ఆసంగతిని జైనులు వైజమగనికి దెల్పిన నతఁడు కోపకషాయిత నేత్రుఁడై వైజకడకువచ్చి "ఓసీ చండాలురాలా ! నీవు జైనులకొఱకు జేయించిన వంటకంబును పాపిజంగమునకు దినిపించి యెంగిలిజేసితివా? యేడీ? ఆ జడుడు? యెందుదాచినావు. జైనులాగ్రహించినచో గష్టము లొందవును మగని యానం దాటిన మగువయుండిన ఫలంబేమి? యనిదుడ్డుకఱ్ఱం దీసికొని వెన్నుపగుల బాదుచుండెను. వైజయా దెబ్బలం బడుచు పరమాత్ముని ధ్యానించుచు నిలిచి

యుండెను. పరమేశ్వరుండా దెబ్బలను భక్తురాలికి దగులనీక జైనులపైబడజేసిన వారాదెబ్బలకు తాళక దుఃఖిపడుచు నోరెండ తడబడుచు హాహాకారవంబులం జేయుచు తబ్బిబ్బుపడుచు సోలుచు సొక్కుచు బారిపోవుచు కావుడోయనుచు యిదెక్కడి యాపదయని వాపోవుచు సందిగొందుల దాగుచు నొకరినొకరు జట్టుకొని యాక్రందనము సేయుచు నాయాసపడుచుండిరి వైజకు దగులు నొక్కొక్క దెబ్బకు వేలదెబ్బలుగ జైనులకుదాకు చుండిన చెల్లాచెదరై పోయిరి.

అంత వారియందలి యొక్క పెద్దమనిషి మెల్లనవచ్చి వైజకు జరుగు దండనం జూచి యిదియంతయు నీశ్వరమాయయేయని దలంచి తద్భర్త నవలోకించి “ ఓ మూఢాత్మా! నీవలన నేడు జైనులకు గష్టములు గలింగెను. శివభక్తురాలగు నీభార్యను గొట్టుటచే నాదెబ్బలు శివమహాత్వమువలన జైనుల ప్రాణములం దీయుచున్నవి అర్హాతు డడవిపాలయ్యెను. శ్రీ చంద్రముని చెఱువులో బడెను ఆచార్యముని యట్లే నీల్గెను క్షపణుడు సంతాపమొందెను. రాజేంద్రమునిగభసం బడిమెను. అంతయు సమాప్తమైనది జైనులు నాశనమైనారు ఇక దెబ్బలాట జాలించుమనిన నాతడు వైజను కొట్టుట చాలించెను. వెంటనే జైనులకు దెబ్బలు దాకుటమానెను.

ఆమూర్ఖుడు తనభార్య శివభక్తురాలని మెఱింగియు నాస్త్యైతరుండగుటచే జాయంజూచి “ ఓసీ! నీవు జైనులకన్నమున్న జంగమున కన్నముబెట్టుటయేగాక వారి నన్యాయముగా గొట్టించితివి ఇక నీపొత్తుజాలును జైనులు సామాన్యులుగారు. వారలిగియున్నారు. నీతోడనున్నను జంపఁగలరు నాయింటినుండి వెడలిపొమ్మనిన” యట్లేయని యెన్నడును యిలువెడలనిసాధ్విగాన శివాలయం బెక్కడనున్నది యెఱుంగక జైనమందిరంబే శివాలయంబనియెంచి యందు జొచ్చిఁ నమశ్శివాయయనుదాఁయు భవాయపరమేష్ఠినే ♦ దేవాయ దేవనాథాయ జ్యోతిషాంపతయేనమః) అనురీతి ఓ పరమేశ్వరా! ఓమంగళస్వరూపా! దేవదేవా! జగన్నాథా! ఆర్తత్రాణపరాయణా! నీకు భక్తితో నమస్కరించుచున్నాను. ఈ దీనురాలిని గాపాడుము. అని తదేకధ్యానమున నుతించుచుండ జైన విగ్రహంబు పటపటంబగిలి యందుండి లింగంబుదయించెను. అవ్వడప్పటి చెప్పరాని ముదం బంది లింగైక్యంబు జెందెను జైనులు మిక్కిలి భీతాత్ములై వైజకుమొక్కి

తమతప్పిదంబునకు క్షమార్పణం గోరికొనిరి. ఆలింగంబు వైజవలన బుట్టుటం జేసి వైజనాథుండనబరగెను.

ఓ జైనా వింటివా మా శైవుల మహిమాతిశయంబులు చెప్పనలవిగాని వేనవేలు శివభక్తుల మహిమాతిరేక గాథలుగలవు. ఆనాటి కీనాటికిని లింగము యొక్కయు భక్తులయొక్కయు మహత్వంబునకు గొఱంతగలుగలేదు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రమును వేయవలయునా? మీబోటుల నడచ పెద్దవారలతో బనేమి ? నాబోటులే చాలును. వెనుకటి గాథలతో పనేమి? ప్రత్యక్షంబుఁజూపెదను. అప్పుడే తలనఱికికొని యప్పుడే పడయుట మేలుగాదు. శిరంబును దరిగి శివునకిచ్చి యేడు దినంబులవరకీయూరంతయు దిరిగి యేడవనాడు మఱల శిరమును బడయుదును ఆపిమ్మట మీ జైన వసతుల జెల్లాచెదరము గావించెదను అని శపథముగావించెను ఈవార్త యప్పుడప్పుడే పట్టణమంతయు వ్యాపించెను వెంటనే జైనులును, బస వేశ్వరుండును, బిజ్జలుండును, సమస్త భక్తగణంబును, యితరజనంబును ఆగుడికడ కేతెంచిరి. అప్పుడేకాంతిరామయ్య యమునివలెనే మిగుల భయంకరాకారుండై నిశితకరవాలంబునుగొని పెనుబొబ్బలబెట్టుచు మహాట్టహాసంబు గావించుచు నొక్కమ్మడి తలనుత్తరించుకొనెను. బసవనాది భక్తులు జయజయ ధ్వానంబులం గావించుచు శివగీతంబులబాడం దొడంగిరి బిజ్జలుండబ్బురపడి సూడజొచ్చెను.

అంత నమ్మహానుభావుండు వలపలి కేలదలయు, డాకేలగత్తియుంబట్టికొనివివిధ వాద్యములును మ్రోగుచుండ తాళక్రియ ననుసరించి పాదవిన్యాసంబు గావించుచు జయపెట్టుడని భక్తుల నుత్సాహించుచు నార్చుచు బెడబొబ్బలం బెట్టుచు నీరీతి నేడుదినంబుల హోరాత్రంబులు పురమంతయు సంచరించి యెనిమిదవనాడుదయము మునుపటి గుడికడకువచ్చి జైనులందఱంబిలిచి "ఓపందలారా! నాబాసచెల్లినది చూచితిరాయని శిరంబును మొండెంబున కతికించికొనెను. హరుడే యుత్తమ దేవుడని సూచించు విధమున శిరము కొంచమోరగా యతికికొనెను.

ఆకారణంబున నేకాంతిరామయ్య యశశ్చంద్రికలు దిగంతంబున వ్యాపించెను జైనులందఱును బిజ్జలునిచే నేకాంతిరామయ్యకు జయపత్రమిప్పించి ఆతని వలన శైవదీక్షంబొందిరి పిదప నేకాంతి రామయ్య శిష్యులును భక్తులునుగూడిరా

జని జైనమందిరంబులం గూలనేసి యుద్దగించువారల మృత్యుపాలుజేసి కల్యాణంబున జైనులు లేకుండంజేసెను. బసవేశ్వరుండు నేకాంతిరామయ్యను సంగమగురునివలె భావించి పూజించెను.

అద్భుత చరిత్రాయనమః

ఇరువదెనిమిదవ అధ్యాయము ముగిసెను.



శ్రీశివాయనమః

# షొడ్డల దేవు బాచయ్య చరిత్రము.



## (ఏకోనత్రింశత్యధ్యాయము.)



కల్యాణపురమున షొడ్డలదేవు బాచయ్యయను భక్తశ్రేష్ఠుండుండెను. అతండు శాంతశమదమాదిగుణ సంపన్నుండై భృంగివంటి లింగనిష్ఠయు, వీరభద్రుని వంటి రౌద్రంబును, నందివంటి సర్వజ్ఞతయు, భృగువంటి శాపశక్తియు, శేషుని వంటి ధీవిశేషంబును గలవాఁడై శృతిస్మృతీతిహాసంబులను న్యాయవైశేషికాది శాస్త్రంబులను వేదాంతంబులను చక్కగ నెఱింగి తత్సారమంతయు శివభక్తియే యని మదిం దలంచి శివధ్యానంబు సేయుచు భక్తుల నర్చించుచు బిజ్జలుని ధాన్యాగారముల కధికారియై యుండెను.

అతండేటేట సౌరాష్ట్రమున కేగి శివరాత్రినాఁడు సౌరాష్ట్రనాథుని బూజించుచు వచ్చుచుండెను. అట్లే శివరాత్రియే తెంచుటచేఁ జాగరణ సేయ సౌరాష్ట్రమున కేగ నిశ్చయించి బిజ్జలునకు విన్నవించ నతండు బాచయ్యంజూచి "నీవిప్పుడు జనుటకు వీలు లేదు. ధాన్యముల యెగుమతి గావలయును పనులు మిక్కిలిగలవు లంజెఱికమునకు బాలింత తనమునకును రాచకొలువునకు భక్తికిని సమయము జెల్లదు శివరాత్రి జేయుట కిప్పుడు సమయముగాదు. యెప్పుడును నీవే సౌరాష్ట్రమునకు బోవుదువుగాని యొకప్పుడైన మీ సౌరాష్ట్రనాథుఁ డిక్కడికి రాకూడదా? అని పలికిన విని బాచి దేవుండు వీనిమాటల నెందుకు జిన్నంబుచ్చవలయును, భక్తవరదుండైన శంకరుండు నన్ను రక్షించఁదలఁచినచో దానేవచ్చును. అని తనమనంబున నిశ్చయించుకొని ప్రయాణము నాపుకొనియెను.

ఆనాటి మధ్యాహ్నమునకే శంకరుం డొకకింకరుని వేషంబునుదాల్చి లేఖయు నంది పటమునుగొని బాచయ్య వద్దికివచ్చి "ఓ స్వామీ ఇదిగో సౌరాష్ట్రనాథుఁడు మీకుత్తరమంపినాఁడు. తాను శివరాత్రికి నిక్కడికి రాబయనమై నన్ను మున్ను బుత్తెంచినాఁడు. ఇదిగో యుత్తరంబనియందీయ నాతడు విమల భక్తి ప్రేమలతో దాని నందికొని చదివికొనెను. అంత నప్పణిహారి " ఓ బాచయ్యా! త్రేపే శంకరుం డిచటికివచ్చును. అతనికి దగిన నివాసంబునకొఱకు ధాన్యాగారమును వట్టిజేయుము నేనేగుచున్నానని యచ్చటనే యదృశ్యుఁడయ్యెను.

అంతట బాచయ్య భక్తులం జేరఁబిలిచి " ఓ శరణులారా! దేవు సౌరాష్ట్రనాథుండు మనవద్దికి వచ్చునట. అమ్మహానుభావుని దయ యెంతటిదో కదా ! అతఁడు భక్తపరాధీనుఁడు భక్తికి వశమగునట్లు జపతపోయజ్ఞాదులకు సాధ్యుఁడుగాఁడు తొల్లి రావణుఁడు శంకరుని వశముజేసికొనలేదా యందురేమో. ఆతఁడు తపశ్శక్తి సంపన్నుఁడుగాని భక్తుఁడుగాఁడు భక్తిహీనులకు శివుఁడు గానరాడు. భక్తికిమెచ్చి గాదా గుడ్డవ్వకు యెదురై వచ్చెను. ఇన్ని యేటికి తేపేకదా దృష్టాంతము మనకగుపడును. ఇప్పుడువచ్చిన పణిహారి సౌరాష్ట్రనాథుఁడేకాని యన్యుఁడు గాఁజాలఁడు అని పలికెను.

అంత నావార్తకింవదంతిగా పట్టణమంతయు వ్యాపించెను. బాచయ్య శివాజ్ఞానుసారము ధాన్యపు కొట్టును బాగుజేయించి పురమును శృంగారించ తన భటుల కాజ్ఞాపించెను. బిజ్జలుండావార్తనువిని యానాడోలగంబున నీముచ్చటనే బ్రస్తాపించుచుండెను. బసవేశ్వరుండానంద సాగరంబున మునింగి శంకరుని రాకకై నిరీక్షించుచుండెను.

ఇంతలో సాగరంబు ఘూర్ణిల్లు చందమున గంభీరవాద్యంబులు వినఁబడఁ జొచ్చెను. వెంటనే అపారవైభవంబున సౌరాష్ట్రనాథుండు ధాన్యాగారంబున పట్టిజేసిన గాదెలో నావిర్భవించెను " ఆహా పరమేశ్వరుండు భక్తియనుపాశములచే గట్టువడి భక్తులెట్లుసెప్పిన నట్లు వినుచుండును. సిద్ధరామయ్య శ్రీశైలమునుండి మల్లికేశ్వరుని బ్రార్థించి తెచ్చి సొన్నలాపురమున బ్రతిష్ఠించినట్లు బాచిదేవుండును సౌరాష్ట్రనాథునిదెచ్చి ప్రతిష్ఠించెను. ఆతని మహత్వమేమని గొనియాడవలయును అని శరణజనులు పొగడుచుండిరి. బిజ్జలుండును వెఱగంది బాచయ్యకు బ్రణమిల్లెను బసవేశ్వరుండును మిగుల సంతసించి ధాన్యాగారంబుల గొన్నిఁటిని గూలగొట్టించి దివ్యాలయంబును నిర్మించెను. బాచయ్యయు సోమనాథుండనుపేర లింగంబును బ్రతిష్ఠించి శివరాత్రి మహాత్మ్యవంబును సలిపెను. ఇట్లే బాచయ్య మిగుల భక్తివంతుండై తన మహిమను జనులెల్లఁ బొగడ శివశైవపదార్చనలం గావించుచు గాలఁబుఁబుచ్చుచుండెను.

సోమేశ్వరాయనమః

ఇరువది తొమ్మిదవ అధ్యాయము ముగిసెను.

మొదటి భాగము ముగిసెను.

# మహాకవిశిరోమణి

---

బ్రి॥శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారిచే రచియింపఁబడిన గ్రంథములు

| | |
|---|---|
| శ్రీగర్గభాగవతము | 3-0-0 |
| వేదవేదాంగచంద్రిక | 1-0-0 |
| బాలనీతి మొదటిభాగము | 0-8-0 |
| " రెండవభాగము | 0-6-0 |
| నీతికల్పలత మొదటిభాగము | 0-5-0 |
| " రెండవభాగము | 0-5-0 |
| ఆంధ్రరథాంగదూతకావ్యము | 0-6-0 |
| వేంకటేశ్వర విజ్ఞప్తి | 0-1-0 |
| సాంధ్రలక్ష్మీనృసింహస్తోత్రము | 0-1-0 |

రజస్వలా వివాహఖండనము
వర్ణవ్యవస్థ } రెండవకూర్పు కానున్నది

దర్శనదర్పణము వెల్వడ బోవుచున్నది

కావలయువారు:—

సికింద్రాబాద్ ఇమాంబావిడి బజారులో

బ్రి॥శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారికి

వ్రాసి తెప్పించుకొనగలరు